శ్రీకాళిదాసవిరచితమ్

# మాలవికాగ్నిమిత్రమ్



'ప్ర... ...సరి', 'భాగవతరత్న'

జి.వి. ... ...మ్యా శర్మ, ఎం.ఏ.



ప్రకాశకులు : ఆర్.సి. శాస్త్రి, ఛైర్మన్, స్టోనీకార్టర్

5-54/1, స్టోనీకార్టర్, 8/22, హబ్సిగూడ,

హైదరాబాద్ - 500 007.

# రచయితను గూర్చి...

పేరు : **గోళ్ళమూడి వెంకట శ్రీహరి సుబ్రహ్మణ్య శర్మ,** ఎం.ఏ.

స్వస్థలము : నూజివీడు, కృష్ణాజిల్లా

పుట్టిన తేది : 5-2-1940, ప్రమాది సం॥ పుష్య బహుళ ద్వాదశి

విద్యాభ్యాసం : ఎం.ఏ. సంస్కృతము, ఉస్మానియా విశ్వవిద్యాలయము

తల్లిదండ్రులు : శ్రీ వెంకటేశ్వరరావు, శ్రీమతి సులోచనమ్మ దంపతులు
తండ్రిగారు ఆశ్రమస్వీకారానంతరం శ్రీశ్రీశ్రీ ప.ప.
ఈశ్వరానంద భారతీస్వామి వారైనారు.

వృత్తి : వైస్ ప్రిన్సిపాల్, రీడరు మరియు సంస్కృతశాఖాధ్యక్షుడు
(రిటైర్డ్), మిసెస్ ఏ.వి.యన్. కళాశాల, విశాఖపట్టణము

బిరుదులు : "ఉపన్యాసకేసరి, ప్రవచనప్రభాకర, భాగవతరత్న"

## ప్రవృత్తి :

1. వివిధదేవాలయములు, ఆశ్రమములు, సంస్థలలో ఆధ్యాత్మికకార్యక్రమములలో పాల్గొనిప్రసంగించుట.

2. రామాయణ, భాగవత, గీతా, దేవీభాగవత, శివపురాణములను వర్ణచిత్రముల రూపమున ప్రదర్శించి, అందలి ఆధ్యాత్మిక విలువలను వివరించుట.

3. వివిధ ఆధ్యాత్మిక, సాహిత్య పత్రికలయందు వ్యాసములను రచించుట.

4. రేడియోలో సాహిత్య, ఆధ్యాత్మిక ప్రసంగములను చేయుట. ప్రసిద్ధ దేవాలయములయందు కళ్యాణోత్సవవ్యాఖ్యాతగా వ్యవహరించుట.

Complimentary Copy

శ్రీ కాళిదాసవిరచితమ్

# మాలవికాగ్నిమిత్రమ్ (నాటకమ్)

To Sudaraiah Vignana Kendram


తెలుగుసేత

"ప్రవచనప్రభాకర, ఉపన్యాసకేసరి, భాగవతరత్న"

గోళ్ళమూడి వెంకట శ్రీహరి సుబ్రహ్మణ్య శర్మ, ఎం.ఏ.,

వైస్ ప్రిన్సిపాల్, రీడరు మరియు

సంస్కృతశాఖాధ్యక్షుడు (రిటైర్డ్)

మిసెస్ ఏ వి యన్ కళాశాల, విశాఖపట్టణం 1



ప్రకాశకులు :

ఆర్.సి. శాస్త్రి

ఛైర్మన్, స్టోనీకార్టర్

5 54/1, స్టోనీకార్టర్, 8/22, హబ్సిగూడా,

హైదరాబాద్ 500 007

శ్రీకాళిదాసవిరచితమ్

# మాలవికాగ్నిమిత్రమ్ (నాటకమ్)



ఆంధ్రానువాదము

గోళ్ళమూడి వేంకటశ్రీహరి సుబ్రహ్మణ్యశర్మ ఎం ఏ

ప్రతులు 1000



ముద్రణ 10 మే, 2002








ప్రతులకు

1) ప్రకాశకులు

ఫోన్ (ఇ) 040 7170256, (ఆ) 7151947, 7172301

2) శ్రీ గోపాల్ పబ్లికేషన్సు,

3 3 860, ఆర్యసమాజ్ ఎదురు సందులో,

కాచిగూడా, హైదరాబాద్ 27

ఫోన్ 4658101

ముద్రణ సరస్వతీ ఆఫ్‌సెట్ ప్రింటర్స్,

నల్లకుంట, హైదరాబాద్ 44 ఫోన్ 7612180



శ్లో॥ వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే।

జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ॥



శ్రీ ఆర్. చంద్రశేఖర శాస్త్రి, శ్రీమతి ఆర్. కమలాదేవి

# విషయసూచిక





ఆర్.సి. శాస్త్రి
Chairman, Stony Carter
Director, Divine India Ltd

8/22, హబ్సిగూడా,
హైదరాబాద్ 500 007

# ఆకాంక్ష

సృష్టికార్యక్రమంలోనే పరివర్తనశీలం ఇమిడియున్నది సమాజాలు కూడా పరివర్తన చెందుతూనేఉంటాయి ఏదో ఒక చైతన్యశక్తి మనుష్యులను, వారు ఏర్పరచుకున్న సమాజాలను మార్పులకు గురిచేస్తుంది మార్పు అనివార్యం అయితే సనాతనమైన, మానవజీవితాన్ని ఉత్తేజపరిచే స్ఫూర్తి నివ్వగలిగిన శక్తులు ఈ మార్పువల్ల నశించిపోయే పరిస్థితి ఏర్పడితే మాత్రం అది భాధాకరం అవుతుంది కాని నేడు మన భారతీయత, మనసాంప్రదాయం, జాతిమనుగడ కూడా దెబ్బతినే పరిస్థితిలో మన మున్నాం మన ముందుతరం మన కందించిన అమూల్యసంపదలను సత్యం, ధర్మం, కర్మఫలత్యాగం అనే సద్గుణాలనే కాక కాళిదాసు, భాసుడు, బాణుడు, హర్షుడు మరెందరో మహానుభావులు, కవులు మనం అభివృద్ధి చెందాలనే తపనతో మనకోసం వదలివెళ్ళిన అమూల్య సదుపదేశరత్నాలను మనము పోగొట్టుకుంటున్నాము దేశ సంస్కృతిని చాటిచెప్పుతూ మన సంస్కృతికే అలంకారమైన గుళ్ళు, గోపురాలు, కట్టడాలు నేడు విచ్ఛిన్నమై కనిపిస్తున్నాయి అవికూడా ఇకముందు మిగిలి ఉంటాయన్న నమ్మకం ఏది నేటి కుహనాప్రపంచంలో? ఆశ్చర్య మేమంటే మనం మంచి చేయలేకపోయినా, మరిఒకరు చేసినా, లేక చేయుటకు ప్రయత్నించినా అటువంటి వారికి స్ఫూర్తినివ్వటం కూడా అతికష్టం అవుతున్నది నేటికాలంలో ఒక్క ధనసంపాదన విషయం మినహాయించి మరేదీ నచ్చటంలేదు నేటి సామాజికులకు

ఇటువంటి వాతావరణంలో, చిన్ననాటినుండి సంస్కృత భాషమీద, ఆభాషలో ఉన్న గ్రంధాలు, కావ్యాల మీద ప్రత్యేకాభిమానమున్న నాకు, ఏదో ఒకరోజు మహాకవి కాళిదాసు రచించిన నాటకాలను, కావ్యాలను తెలుగు లిపిలో, సరళమైన తెలుగు అనువాదంతో వెలుగులోకి తేవాలని ఆకాంక్ష కలిగింది

చిన్ననాటి స్నేహితుడు శ్రీజి వి యస్ సుబ్రహ్మణ్యశర్మతో చర్చించాను రచన మిత్రుడి బాధ్యత ఆర్థిక బాధ్యత నాది వానిని ఆస్వాదించే బాధ్యత పాఠకలోకానిది!

నిరుడు మే 10న "అభిజ్ఞానశాకుంతలం", "మేఘసందేశం" గ్రంధాలను సాహితీ ప్రియులకు అందించగలిగాం నేడు అదే రోజున నా షష్టిపూర్తి సందర్భంగా మరి రెండు కాళిదాసు నాటకాలను "మాళవికాగ్నిమిత్రం", "విక్రమోర్వశీయం" మీ ముందుంచుతున్నాను

ఎంతో కృషిచేసి, సమయం చూసుకొని, యావచ్ఛక్తిని కూడగట్టి, నాతో సహకరించి, తెలుగుసేత చేసిన ఆప్తమిత్రుడు సుబ్రహ్మణ్య శర్మకు 500 కాపీలను పూర్తి హక్కుతో అత్యానందంతో అందజేస్తున్నాను ఉత్కృష్టమైన కవులు, పండితులు ధనసంపాదనలో నాడు, నేడు కూడా విఫలమయ్యారు శర్మ గొప్ప పండితుడు అలాంటి పండితుణ్ణి ఆదరించండి ఈ పుస్తకాలను "కొని" చదవండి కవులకు, పండితులకు, రచయితలకు స్ఫూర్తినిచ్చే సదాచారాన్ని నిలుపండి అటువంటి ఆదరణ స్ఫూర్తి మా శర్మకు అందచేస్తారని ఆశిస్తూ, ఆకాంక్షిస్తూ, అభ్యర్థిస్తూ

విధేయుడు

10 5 2002

**ఆర్.సి. శాస్త్రి**



"ప్రవచనప్రభాకర, ఉపన్యాసకేసరి, భాగవతరత్న"
**జి.వి యస్. సుబ్రహ్మణ్య శర్మ, ఎం ఏ ,**
వైస్ ప్రిన్సిపాల్, రీడరు మరియు
సంస్కృతశాఖాధ్యక్షుడు (రిటైర్డ్)
మిసెస్ ఏ వి యన్ కళాశాల, విశాఖపట్టణము 1
ఫోన్ నం 0891 748809 (R)

# ముందుమాట

## కాళిదాసకవితావైభవము

సంస్కృత కవులలో మహాకవి కాళిదాసుది పెద్దపీట కాళిదాసుయొక్క సర్వోత్కృష్టతను చాటిచెప్పుచు కొందరు సాహితీవేత్తలు ఇట్లు చెప్పుచుందురు

శ్లో॥ పురా కవీనాం గణనా ప్రసంగే
కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసా
అద్యాపి త త్తుల్యకవే రభావాత్
అనామికా సార్థవతీ బభూవ॥

పూర్వము ఒకప్పుడు కవులలో శ్రేష్ఠు డెవ్వరు? అను విషయమును గూర్చి కవులందరు చర్చించుచు మొట్టమొదటివాడు కాళిదాసు అని తమ చిటికెన వేలిపై కాళిదాసునుంచి లెక్కలను ప్రారంభించినారట అనాటి కాలమునుండి నేటి కాలము వరకు అతనికి సాటివచ్చు మరియొక కవి లేనందువలన దాని తరువాతి వేలు అగు ఉంగరపు వేలిపై లెక్కించుటకు ఏ కవియు లేనందువలన దానికి అనామిక (పేరు లేని వేలు) అను నామము సార్థకమైనదట

కాళిదాసకావ్యములను సరళముగా ఆంధ్రీకరించు ప్రయత్నములో 'అభిజ్ఞానశాకుంతలము' 'మేఘసందేశము'లతో కూడిన ప్రథమసంపుటము వెలువడినది ఇప్పుడీ ద్వితీయసంపుటము వెలువడినది ఇందు 'మాలవికాగ్నిమిత్రమ్', 'విక్రమోర్వశీయమ్' అను కాళిదాసుని తక్కిన రెండు నాటకములును అనువదింపబడుచున్నవి

# సకలకళాప్రవీణుడు

కాళిదాసునకుగల సకలకళాప్రావీణ్యమే ఆతని సర్వోత్తమత్వమునకు, కవికుల గురుస్థానమునకు పునాది అయినది కాళిదాసునకు వేదవేదాంగములలో ఎంతటి ప్రావీణ్య మున్నదో అంతటి ప్రావీణ్యము సకలవిద్యలలోను, సకలకళలలోను ఉన్నది ఈ సర్వవిద్యాపరిచయ మెట్లేర్పడినదో తన రఘువంశ, కుమారసంభవ కావ్యములలో ఇట్లు సూచనప్రాయంగా ప్రకటించినాడు (1) రఘువంశంలో దిలీపుని వర్ణించుచు "విద్యానాం పారదృశ్వనః" అనును దిలీపుడు సర్వవిద్యల అంతుచూచిన వాడని చెప్పుట తన సర్వవిద్యాపారంగతత్వమునే పరోక్షముగా సూచించియుండును అట్లే కుమారసంభవకావ్యమునందు పార్వతికి విద్యాభ్యాస విషయమును వివరించుచు

"తాం హంసమాలాః శరదీవ గంగాం
మహౌషధీన్ నక్త మి వాత్మభాసః ।
స్థిరోపదేశా ముపదేశకాలే
ప్రపేదిరే ప్రాక్తన జన్మవిద్యాః॥" అనును

గురువు పార్వతికి విద్యాభ్యాసము చేయించునాడు ఆమె అంతకుపూర్వమే స్థిరోపదేశస్థితి నందియుండుటవలన (1) శరత్కాలమునందు గంగానదికి హంసలబారులు తమంతతాము చేరునట్లును, (2) తమలోనున్న కాంతులే రాత్రిపూట ఓషధీలతా వృక్షములో ప్రకటమై ప్రకాశించునట్లును, తనయందే పూర్వజన్మలలో అభ్యసించి అణగియున్న విద్యలు గురూపదేశకాలమున సహజముగా చేరి ప్రకటితములగుచున్నవి అని ఈ శ్లోకపు భావము కాళిదాసుని సర్వకళాపారంగతత్వము సహజమైనదే కేవలాభ్యాస సాధ్యమైనది కాదని ఇచట పరోక్షముగా కాళిదాసు తననే ఉదాహరణముగా చూపియుండును సంగీత, నాట్య, చిత్రలేఖనాదులలో గల ప్రావీణ్యము బహుధా పలుచోట్ల ప్రదర్శింపబడినది వీణాగానము కాళిదాసునకు మిక్కిలి ఇష్టము అనుటకీ క్రింది సన్నివేశములు నిదర్శనములు (1) మేఘదూతములో విరహిణి యైన యక్షిణిని వర్ణించుచు "ఉత్సంగే వా మలినవసనే సౌమ్య నిక్షిప్య వీణాం" అనును (2) మాలవికాగ్నిమిత్ర నాటకమునందు కథానాయకుడైన అగ్నిమిత్రునకు వీణ, తన ప్రియురాలియంతటి ఇష్టమైన దనును (3) అభిజ్ఞానశాకుంతలములో దుష్యంతునిపై

శాపప్రభావముపడి, తనను మరచినాడను విషయమును వీణపై పాడిన హంసపదికా గానము "మధుకర! విస్మృతో౽స్యేనాం కథమ్" ఈ విషయమునే నిరూపించుచున్నది

(4) రఘువంశమునందు అగ్నివర్ణుని శృంగారజీవితమును వర్ణించుచు

"వల్లకీవ హృదయంగమస్వనా"

వల్గువా గపిచ వామలోచనా!"

అగ్నివర్ణుని ఒడిలో ఎల్లప్పుడు వీణవలె మృదుమధురముగా మాట్లాడు ప్రియురాలు గాని, వీణగాని ఉండవలెనని దీని భావము

"నాటకాంతం హి సాహిత్యం" అని పెద్దలు అందురు నాటకరచనచేసి పాఠకులను మెప్పించిన కవియే సాహిత్యపుటంచులు చూచినవా డగునని దీని భావము సర్వశాస్త్రములును, కళలును సాహిత్యమునందలి భాగములే కదా అందువలన వాటి నన్నింటిని కవి తన కావ్యములలో జొప్పించి ఒప్పింపవలెను అందువలననే కాళిదాసమహాకవి వేదవేదాంతములను పురాణేతిహాసములను ధర్మశాస్త్రములను స్మృతిగ్రంథములను తర్క, వ్యాకరణ, షడ్దర్శన, తంత్రాగమాది సర్వభారతీయ విజ్ఞానమును అపోశనము పట్టినవాడు ఇందుకు కొన్ని ఉదాహరణ ములను గమనింతము

(1) **గజశాస్త్రజ్ఞానము** : రఘువంశములో దిలీపుని పాలనను వర్ణించుచు "అరుంతుద మివాలాన మనిర్వాణస్య దంతినః" అనును ఇచ్చట నిర్వాణమను పదము సాంకేతికమైనది నిర్వాణమనిన గజస్నానము అని అర్థము గజశాస్త్రజ్ఞానము లేనిదే ఈ పదమును ప్రయోగింపలేడు

(2) **రాజకీయశాస్త్రజ్ఞానము** : రఘువంశములోని రామాయణములో భరతుడు "పరివేత్తార మాత్మానం మేనే" అనును పరివేత్త అనగా పెద్దవా డుండగా చిన్నవాడు వివాహము చేసికొన్నవాడు (ర ఘు 12 16 )

(3) **అశ్వశాస్త్రజ్ఞానము** ·

"వక్త్రోష్మణా మలినయంతి పురోగతాని

లేహ్యాని సైంధవశిలాశకలాని వాహాః॥

ఉదయమే సాహిణులు గుర్రములను పోషించువారు గుర్రముల ముందు సైంధవ

లవణపు ముక్కలను ఉంచెదరట। గుర్రములు ఆ సైంధవలవణపు ముక్కలపై మూతిపెట్టి తినుచు తమ ముఖమునుండి వెలువడు వేడి నిట్టూర్పులతో మలినపరచుచున్నవి అని ఈ శ్లోకపు భావము అశ్వశాస్త్ర పరిజ్ఞానము లేనివాడు ఈ భావమును ప్రకటింపలేడు కదా।

### (4) ధర్మశాస్త్రజ్ఞానము :

నదీసంగమస్థానము ఒక పవిత్రమైన తీర్థము అందులో స్నానము చేసినవాడు ఆత్మహత్యా దోషమును పొందడు ఆ స్నానము చేయనివానికి ఆత్మహత్యా పాతకము అంటుకొనును అను ధర్మశాస్త్ర విషయము గంగాసాగర వర్ణనములో వివరించును

### (5) సంగీతశాస్త్రపరిజ్ఞానము ·

కుమారసంభవకావ్యమునందు హిమవంతుని వర్ణించుచు

"యః పూరయన్ కీచకరంధ్రభాగాన్

తాన ప్రదాయిత్వ మివోపగంతుమ్" అనును

ఈ శ్లోకమును మల్లినాథసూరి వ్యాఖ్యానించుచు "అధునిక సంగీత కళాకారులు "తానము"నకు వీణ ప్రధానవాద్యమందురు కాని కాళిదాసు తన సంగీత పరిజ్ఞానమును వెలార్చుచు హిమాలయప్రాంతమునందు వేణువులు తానమును సమకూర్చినవని చెప్పినాడు

### (6) తర్కశాస్త్రపరిజ్ఞానము .

కాళిదాసుని శబ్దప్రయోగ మాతని వ్యాకరణశాస్త్ర ప్రావీణ్యము, పాత్రల సంభాషణము, తర్కశాస్త్రపరిజ్ఞానము అతని కావ్యమునందు సర్వత్ర స్పష్టమగును

### (7) వ్యాకరణశాస్త్రపరిజ్ఞానము :

సుగ్రీవుడు వాలిని వధించి సుగ్రీవుని అతని స్థానమునందు పట్టాభిషక్తుని చేసిన సన్నివేశమును

"ధాతోః స్థాన ఇవాదేశం సుగ్రీవం సన్నివేశయత్" అనుచు ధాతువు స్థానమున దానిని తొలగించి ఆదేశపదము వచ్చునట్లుగా రాముడు వాలిని చంపి ఆస్థానమున సుగ్రీవుని కూర్చొనబెట్టెను అను వ్యాకరణశాస్త్ర విశిష్టపదములను ప్రయోగించెను

(బి) కుమారసంభవమునందు తారకాసురుని సైనికులు, దేవతలను స్వర్గము నుండి తరిమికొట్టిన తీరును వర్ణించుచు "అపవాదై రివోత్సర్గాః కృతవ్యావృత్తయః పరైః" సంస్కృత వ్యాకరణసూత్రములలో (1) ఉత్సర్గసూత్రములు (2) అపవాద సూత్రములు అని రెండు విధము లుండును ఉత్సర్గసూత్రము సర్వసామాన్యముగా అన్నిచోట్ల వర్తించును అపవాదసూత్రము ఉత్సర్గసూత్రమును అడ్డుకొనును ఇచ్చట దేవతల స్వైరవిహారము ఉత్సర్గము కాగా వారిని అడ్డుకొనిన తారకవిజృంభణము అపవాదమైనట్లు వ్యాకరణ విశేషాలను వేరుగా చెప్పక కథలోనే జోడించి వానితో సొగసుగా చెప్పుట కాళిదాసుని రచనాచమత్కృతికి చక్కని నిదర్శనము

## (8) షడ్దర్శనపరిజ్ఞానము :

(ఎ) న్యాయ వైశేషిక దర్శనములు రెండును హేతువాదమునకు సంబంధించినవి కాళిదాసుని పాత్రల సంభాషణములన్నియు ఈ న్యాయ, వైశేషికదర్శన విషయములనే వివరించుచుండును

**(బి) సాంఖ్యదర్శనపరిజ్ఞానము** కాళిదాసుని సాంఖ్యయోగదర్శనపరిజ్ఞానమునకు ఉదాహరణములు ఇవి వివిధ దేవతలు బ్రహ్మను శివుని, ఇతర దేవతలను స్తుతించుచు చెప్పిన స్తోత్రము లన్నియు ఈ సాంఖ్యదర్శనసారాంశమునే ప్రతిపాదించుచున్నవి

ఉదాహరణకు

కుమారసంభవమునందు ఈశ్వరుని తపశ్చర్యను వర్ణించుచు అందు అష్టాంగయోగవిషయములను బాగుగా వర్ణించినాడు

## (సి) యోగశాస్త్రపరిజ్ఞానము :

రఘుమహరాజనిర్వాణమును వర్ణించుచు కాళిదాసు తన యోగశాస్త్ర పాండిత్యమును ప్రకటించినాడు

రఘువంశ రాజులను వర్ణించుచు

"యోగే నాంతే తనుత్యజాం" అనుటచే రఘువంశపు రాజు లెవ్వరును లోకసాధారణమైన, రోగమూలకమైన, మరణము నందెడివారు కారు వారు యోగశాస్త్రరహస్యములను తెలిసికొని, యోగశక్తిద్వారా కపాలమోక్షము నందెడివారు

అని కాళిదాసు తన యోగపరిచయమును ప్రకటించినాడు

## (డి) మీమాంసాశాస్త్రపరిజ్ఞానము

కాళిదాసుయొక్క మీమాంసాశాస్త్రపరిజ్ఞానము అనన్యసామాన్యమైనది "మాతు మిచ్ఛా మీమాంసా" అని ఆ పదమున కర్థము వేదార్థనిర్ణయమును చేయు శాస్త్రమే మీమాంసాదర్శనము (1) కర్మమీమాంస (2) ఉత్తర మీమాంస అని ఈ దర్శనము ద్వివిధముగా ఉండును కర్మప్రధానమైనది పూర్వమీమాంస బ్రహ్మప్రధానమైనది ఉత్తరమీమాంస, ఇట్టి వివిధ మీమాంసావిషయములను సందర్భోచితముగా, కాళిదాసు తన కావ్య, నాటకాదులయందు ప్రయోగించినాడు ఉదాహరణమునకు

(ఎ) వశిష్ఠ, కణ్వ, మారీచాశ్రమ వర్ణనములలో తనకు గల కర్మ బ్రహ్మమీమాంసా రహస్యముల నెన్నింటినో ప్రకటించినాడు

(బి) అగ్నిహోత్రములను, అగ్నిశరణములను (అగ్నిహోత్ర గృహములను) వర్ణించెను

(సి) అరిష్టసముచ్చాటనమునకును, దోషనివారణమునకును చేయవలసిన శాంతి, పౌష్టిక కర్మవిధానమును

(డి) గోసేవావ్రతమును, దైవానుగ్రహమును సూచించుటకు నందిని ఇచ్చిన వరమును,

(ఇ) శకుంతలకు వనదేవత లందించిన ఆభరణములను పార్వతీతపశ్చర్యను, సప్తర్షులు హిమవంతునకు చెప్పిన శివపారమ్యమును మీమాంసాశాస్త్రోక్త విషయములే

(ఎఫ్) అభిజ్ఞానశాకుంతలమునందు "పశుమారణకర్మదారుణో అనుకంపామృదురేవ శ్రోత్రియః" అను శ్లోకముద్వారా కర్మకాండ ప్రాశస్త్యమును వివరించినాడు

(జి) ఉత్తరమీమాంసాపరిజ్ఞానము ఆత్మానాత్మలను రెండింటిని ఏకము చేసి ఆత్మభావముగా, అద్వైతపరముగా చూపుటయే కాళిదాసుని సిద్ధాంతము ఇందుకు ఉదాహరణము

(1) కుమారసంభవమునందు శివుడు అనగా జగద్యోని, జగత్తు వేరు భగవంతుడు వేరు కాదని చెప్పుటే ఈ పదప్రయోగమునందలి ఆంతర్యము

(2) కూమారసంభవకావ్యమునందే శివుని స్తుతించుచు

"త్వ మేవ హవ్యం హోతాచ,

ద్యాతా ధ్యేయం చ యత్పరమ్॥ అని శివాద్వైతమును వివరించినాడు కాళిదాసు

(హెచ్) శివకేశవాభేదమును కాళిదాసు చాటిచెప్పినాడు

(1) బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు సమానప్రాధాన్యము నిచ్చి, ఎంతో భక్తి శ్రద్ధలతో తన కావ్యములయందు సందర్భోచితముగా చెప్పి, సర్వమతసామరస్యమును చాటి చెప్పి, తనకు గల మతవైషమ్యరాహిత్యమును వెలార్చినాడు విష్ణువును శివునిచేత "త్రేధా స్థితాత్మనే" అని ప్రశంసింపజేసినాడు

(2) కుమార సంభవములోని శివపార్వతీ కళ్యాణమునకు బ్రహ్మవిష్ణువులు వచ్చి జయ జయనాదములతో శివుని స్తుతింతురు

(3) ఈ సందర్భములో కాళిదాసు "ఏకైవ మూర్తి ర్బిభిదే త్రిధా సా।

సామాన్య మేషాం ప్రథమావరత్వమ్॥ 'అనుచు సర్వదేవతాసమభావమును', మతసహనమును చాటి చెప్పినాడు

ఇట్టి సర్వశాస్త్ర, కళాప్రవీణుడైన కాళిదాసుని వచోవైభవమును సరళమైన ఆంధ్రభాషలో పరితల కందించుటకు చేసిన ప్రయత్నమే ఈ ద్వితీయ కాళిదాస సాహిత్య సంపుటము

## కాళిదాసుని ఇతరరచనలు

మరియొక కాళిదాసు గాని, కాళిదాసబిరుదాంకితుడైన మరియొక వ్యక్తి గాని ఈ క్రింది కావ్యములను రచించినట్లు తెలియుచున్నది

1 శ్యామలాదండకము 2 కాశ్యష్టకము 3 గంగాష్టకము 4 మంగళాష్టకము

5 శృంగారశతకము 6 నళోదయకావ్యము 7 లంబోదరప్రహసనము

8 పుష్పబాణవిలాసము 9 జ్యోతిర్విదాభరణము 10 చిద్గగనచంద్రిక

11 ఉత్తరకాలామృతము

కాళిదాసు రచించిన నాటక కావ్యములు కలిపి మొత్తము ఏడు గ్రంథములు ప్రసిద్ధములై యున్నవి చమత్కారముగా కాళిదాసుని పద్యకావ్యములను గుర్తుంచుకొనుటకై పండితలోక మీ వాక్యమును ప్రచారములోనికి తెచ్చినది "అస్తి కశ్చిత్ వాగర్థః అని 'అ స్త్యుత్తరస్యాం దిశి" అని కుమారసంభవమును "కశ్చిత్ కాంతా

విరహగురుణా" అని మేఘదూతమును, "వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే" అని రఘువంశ కావ్యమును కాళిదాసు ప్రారంభించినాడు

## 'మాలవికాగ్నిమిత్రమ్ నాటకమును గూర్చి

కాళిదాసు రచించిన నాటకములలో మొట్టమొదటిది మాలవికాగ్నిమిత్రము చారిత్రకమైన అగ్నిమిత్రుని జీవితము నాధారముగా చేసికొని, దాని కాతని ప్రణయవృత్తాంతమును జోడించి, ఈ నాటకమును రసవత్తరము చేసిన ఘనత కాళిదాసునకే దక్కును

## ఇతివృత్తము - ఐతిహాసికత

"పుష్యమిత్రస్తు సేనానీ, "స్సముద్ధృత్య బృహద్రథాత్।
కారయిష్యతి వై రాజ్యం । సమాష్షష్టిం మహాబులః" అను శ్లోకమును బట్టి పుష్యమిత్రాదులను గూర్చి ఈ క్రింది వివరములు తెలియ వచ్చినవి నాయకుడైన అగ్నిమిత్రుడు చరిత్రప్రసిద్ధుడైన వ్యక్తి మౌర్యవంశ పతనానంతరము మగధ సామ్రాజ్యమును పాలించిన, శుంగవంశముకు మూలపురుషుడైన, పుష్యమిత్రుని పుత్రుడు అగ్నిమిత్రుడు క్రీ శ 189లో కడపటి మౌర్య రాజైన బృహద్రధుని సంహరించి, అతని సేనాపతియైన పుష్యమిత్రుడు మగధసింహాసనము నాక్రమించెను సామ్రాజ్య దక్షిణభాగమున తన పుత్రుడైన అగ్నిమిత్రుని రాజప్రతినిధిగా నియమించెను రాజ్యమునకు దక్షిణసీమయైన నర్మదాతీరమున తన బావమరదియైన వీరసేనుని అంతపాలునిగా నియమించి అగ్నిమిత్రుడు విదిశనుండి పాలన సాగించుచుండెను

నర్మదకు దక్షిణమున విదర్భదేశము కలదు గోదావరికి ఉపనదియైన వరదానది ఆ దేశమును రెండుగా విభజించుచుండెను యజ్ఞసేన మాధవసేనులను దాయాదులు ఆ రాజ్యమునందు అధికారముకొఱకు కలహించుచుండిరి యజ్ఞసేనుడు మాధవసేనుని ఓడించి బంధించెను మాలవిక మాధవసేనుని సోదరి మాధవసేనుడు ఆమెను అగ్నిమిత్రునకు ఈయ సంకల్పించెను మాధవసేనుడు బందీకాగా అతని మంత్రి సుమతి మాలవికను రహస్యముగా అగ్నిమిత్రుని రాజ్యమునకు చేర్పయత్నించెను పరివ్రాజిక (సుమతి చెల్లెలు) కూడ మాలవికతో నుండెను వీరు మహారణ్యమున పయనించుచు దొంగల గుంపునకు పట్టుబడిరి

సుమతి వారితో పోరి మరణించెను, దొంగలు మాలవికను ఎత్తుకొని పోయిరి అగ్నిమిత్రుని అంతపాలుడైన వీరసేనుడు మాలవికను రక్షించి, తన అక్క అయిన ధారిణీ దేవికి కానుకగా పంపెను పరివ్రాజిక మాలవికను కానక, అగ్నిమిత్రుని రాజ్యమున ప్రవేశించెను అసలే విధవయైన ఆమె అన్నకూడా మరణింపగా విరక్తయై పరివ్రాజికావేషమును ధరించి, ధారిణిని ఆశ్రయించెను

అగ్నిమిత్రుడు విదర్భయందలి దాయాదకలహమున కల్పించుకొని, యజ్ఞసేనుని ఓడించి, మాధవసేనుని విడిపించి, వరదానది హద్దుగా రాజ్యమును రెండుగా విభజించి, యజ్ఞసేన, మాధవసేనులకు పంచి యిచ్చెను

అగ్నిమిత్రుని కుమారుడు వసుమిత్రుడు పుష్యమిత్రుడు అశ్వమేధము తలపెట్టి యాగాశ్వరక్షణకై వసుమిత్రుని నియమించెను అశ్వమును సింధుతీరమున యవనులు పట్టుకొనగా వసుమిత్రుడు వారి నోడించి, అశ్వమును విడిపించెను యాగమునకు సకుటుంబముగా రావలసినదని పుష్యమిత్రుడు అగ్నిమిత్రునకు లేఖ బంపెను తండ్రికి, కొడుకునకు ఏవో మనఃస్పర్థలున్నట్లు ఆ లేఖ వలన దెలియుచున్నది

పై యంశములు చారిత్రికములే పుష్యమిత్రాదులు పైన పేర్కొన్న వారందరు చారిత్రిక వ్యక్తులే యనవలసి యున్నది అగ్నిమిత్రుని పట్టపురాణి ధారిణి యజ్ఞసేనుని బావమరిది మౌర్యసచివుడు కూడా చారిత్రికవ్యక్తులే కావచ్చును తనకు పూర్వము సుమారు వందసంత్సములక్రింద జరిగియుండిన చారిత్రికాంశములనే స్వీకరించి కాళిదాసు రసానుకూలములైన మార్పులు చేర్పులు చేసి, యీ నాటకమునకు ఇతివృత్తముగా స్వీకరించెను అగ్నిమిత్రుని యీ శృంగారవృత్తాంతము కాళిదాసు కాలము నాటికి మాళవ, విదర్భదేశములందు ప్రఖ్యాతమే అయియుండును జనశ్రుతియందు పరివ్యాప్తమై యుండుటచేతనే నవీనమయ్యు సర్వజన విదితమైన యీ రమణీయ కథాంశమును కాళిదాసు తన నాటకమునకు ఇతివృత్తముగా గ్రహించియుండునని భావింపదగును

## పాత్రల ఆంతర్యము   అధ్యాత్మికభావన

**అగ్నిమిత్రుడు**   నావిష్ణుః పృధివీ పతిః అను వాక్యము ప్రకారము విష్ణువే అని కాళిదాసు భావన

**ధారిణి**   జడురాలై, భరించుస్వభావము కలదికనుక ఈ పట్టపురాణిని భూదేవిగను,

**మాలవిక**   ఆశ్రయింపబడునది, ఆశ్రయించునది కనుక అగ్నిమిత్రుని ప్రియురాలగు మాలవికను శ్రీదేవిగను కాళిదాసు భావించియుండును

## నాటకమా? నాటికయా?

కొందరు మాలవికాగ్నిమిత్రము "నాటిక" అని చెప్పుచుందురు కాని ఇందు నాటక లక్షణములన్నియు నున్నవి పైగా కాళిదాసు, ప్రథమాంకమునందలి ప్రస్తావనలో "కాళిదాస గ్రధితవస్తు మాలవికాగ్నిమిత్రం నామ నవీననాటకం అనినాడు కనుక ఇది నాటకమే కాని నాటికకాదు

## గ్రంధప్రత్యేకాంశములు

1   మూలగ్రంధమును, అనువాదమును స్థూలాక్షరములలో ముద్రింపబడినవి తెలుగులిపిలో మాలవికాగ్నిమిత్రము అచ్చటచ్చట లభించుచున్నను, విక్రమోర్వశీయము తెలుగులిపిలో ఇంతవరకు ప్రకటితము కాలేదు

2,   మూల గ్రంధపు భావము చెడిపోకుండ, భావస్పష్టతకై కొన్నిచోట్ల వివరణము నివ్వదలచినప్పుడు ఆ విషయమును కుండలీకరణములో ( ) ఉంచితిని

3   పరితల, పరిశోధకుల సౌకర్యార్థమై, అకారాది శ్లోకాను క్రమణిక చేర్పబడినది శ్లోకము చివరనున్న సంఖ్య వరుసగ అంకమును, శ్లోకమును సూచించును

4.   కొన్ని ప్రముఖపాత్రల ఊహాచిత్రము లిందు పొందుపరుపబడినవి

## కృతజ్ఞతలు

తన సాహిత్యాసక్తిని, నాపై సౌహార్దమును ప్రకటించుచు ఈ గ్రంథము నకు ప్రకాశకబాధ్యతను స్వీకరించిన శ్రీమతి ఆర్ కమలాశాస్త్రి, శ్రీ ఆర్ సి శాస్త్రి దంపతులకు నా హృదయపూర్వక కృతజ్ఞతలను తెలుపుచున్నాను షష్టిపూర్తి ఉత్సవమును జరుపుకొనుచున్న ఆ దంపతులకు శ్రీకమలా చంద్రశేఖరులు భోగభాగ్యములను సదా ప్రసాదింతురుగాక!

అటు ప్రెస్‌వారితోను, ఇటు నాతోను సంబంధము నేర్పరచుకొని, గ్రంధముద్రణకై విశేషకృషి చేసిన శ్రీ యు గణేష్‌బాబుకు నా కృతజ్ఞతలు.

గ్రంధప్రామాణ్యమును పెంచుటకై తగు సూచనల నిచ్చుటతోబాటుగా దీని పంపిణీ బాధ్యతను కూడ చేపట్టిన, శ్రీ జయలక్ష్మి పబ్లికేషన్స్ అధిపతి శ్రీమాన్ సి వి. శేషాచార్యులు గారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములను సమర్పించుచున్నాను.

ఈ నాటకమునకు వ్రాతప్రతిని సిద్ధముచేసిన చి॥సౌ॥ అబ్బూరి (కల్లూరి) ఉషాకుమారి, ఎం.ఎ కిని, ముద్రణప్రతిని సిద్ధముచేసి, ప్రూఫులను చూచిన డా. బి నాగేశ్వరరావు,ఎం.యస్ సి , పి.హెచ్ డి. (జువాలజీ శాఖాధిపతి, మిసెస్. ఏ.వి.యన్ కళాశాల (రిటైర్డ్)) గారికిని హృదయపూర్వక కృతజ్ఞతలు.

ముఖచిత్రమును, ఇతర చిత్రములను అందించిన అపర్ణ గ్రాఫిక్స్ వారికి నా అభినందనములను తెలుపుచున్నాను. శ్రీమతి ప్రశాంతి జయరాంకు మా ఆశీర్వాదములు.

ఈ గ్రంధమును సర్వాంగసుందరముగా ముద్రించిన సరస్వతీ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, నల్లకుంట, హైదరాబాద్ వారికి కృతజ్ఞతలు.

గ్రంధమును చదివి, అభినందనములతో బాటు మంగళాశాసనమును కటాక్షించిన గురుదేవులు ఉ వే ప్ర. శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు గారికినీ, బ్రహ్మశ్రీ అప్పల్ల సోమేశ్వరశర్మగారికిని చక్కని సమీక్ష నందించిన శ్రీ డా॥ కాజ లక్ష్మీనరసింహారావు గారికిని నా కృతజ్ఞతాపూర్వక వందనములను సమర్పించు చున్నాను

కాళిదాస కవితావైభవమును స్థాలీపులాక న్యాయముగా కొంత అందించితిని. పాఠకులు, ఈ సంపుటమునందలి కాళిదాసకవితావైభవమును ఆస్వాదించి ఆనందింతురుగాక!

వృష సం॥ మార్గశిర బ॥ చతుర్దశి — సారస్వతోపాసకుడు

13 1 2002 (భోగిపండుగ) — గోళ్ళమూడి వెంకట శ్రీహరి సుబ్రహ్మణ్యశర్మ

"ప్రవచన శిరోమణి'
**ఉ.వే. ప్ర. శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు** ఎం ఏ
విశ్రాంత సంస్కృతోపన్యాసకులు,
షీలానగర్, విశాఖపట్టణం 12.

# మంగళాశాసనము

బ్రహ్మశ్రీ జి వి యస్ సుబ్రహ్మణ్యశర్మ గారు విద్వాంసులు వారికి ప్రతిభ, వ్యుత్పత్తి, సహృదయత కలిగియుండుటచే కాళిదాస కృతులను అన్యూనానతిరిక్తంగా అనువదించడం సాధ్యమైనది కాని కొన్ని విషయాలు మరొక భాషలో ఇమడవు శ్లొక చతుష్టయంలో "సామాన్య ప్రతిపత్తి పూర్వకం" అనుమాటకు అన్ని అర్థాలతొటి అనువాదం చేయడం సాధ్యంకాదు. అయినా వారి రచనాకౌశల్యంచేత అనువాదం చక్కగా సాగింది కాళిదాస కృతుల నన్నిటినీ వారీ విధంగానే అనువదించి, లొకానికందించ ప్రయత్నం అవ్యాహతంగా సాగేలా శ్రీసీతారామచంద్రప్రభువు అనుగ్రహించుగాక!

శ్రీభాష్యం అప్పలాచార్యులు.



'వ్యాకరణాలంకార చక్రవర్తి' "సాహిత్య విశారద"

**ఆచార్య అప్పల్ల సోమేశ్వర శర్మ** ఎం ఏ , పి ఒ ఎల్
(సువర్ణ ముద్రాకంకణ విభూషితులు భారత సర్వకార
రాష్ట్రీయసంస్కృతసంస్థానసంమానితులు వివిధ
ఆధ్యాత్మిక, సాంస్కృతిక, సాహిత్యసంస్థాసత్కృతులు)
(విశ్రాంత సంస్కృతాచార్యులు ఆంధ్ర విశ్వవిద్యాలయం)

గౌరవాధ్యక్షులు

1 శ్రీ గితా ప్రచారసమితి

2 శ్రీ గీతా సత్సంగము

3 శ్రీ కావ్యకంఠపీఠము

ఇంటి నెం 50 96 8/2,
టి పి టి. కాలనీ, సీతమ్మధార,
విశాఖపట్టణం 530 013
ఫొన్ 0891 528410

శ్రీః

# మంగళాశాసనము

అభినయప్రధానమైన రచనల్లో "నాటకం" విశిష్టమైనది అది రమ్యరసాశ్రయమై ఉంటుంది అందువల్ల "నాట్యం రసాశ్రయమ్" అన్నారు పెద్దలు అందువల్లనే "నాటకాంతం కవిత్వమ్ , (కవితకు నాటకము పరమావధి) అన్నారు రసికులు, విమర్శకులు

ఇటువంటి సంస్కృతనాటకాలతో కాళిదాసుని "అభిజ్ఞాన శాకుంతలము" చూడామణి ప్రపంచసాహిత్యచరిత్రలో దీనికి మాత్రమే గణనీయమైన స్థానం లభించింది అదేవిధంగా ఇతని "మేఘ సందేశము" "విశ్వప్రేమసందేశము" కాగలిగింది. ఇది కాళిదాసుని "విరహగీతి" ఆధునిక భావకవులు "భావకవిత్వం" అని వ్యవహరించే సాహిత్య ప్రక్రియకు ఇదే నాంది। సార్వజనీనము, సార్వకాలికమున్ను అయిన "ప్రేమగీతి" ఇదే అవుతుంది ఈ రెండింటియొక్క పేర్లు అయినా వినని "సాహిత్యకుడు" ఉండడు ఉండకూడదు। ఇది సాహిత్యసంప్రదాయం సరే।

కాళిదాసు వాణీదాసు రసికదాసు వాల్మీకిదాసు వాల్మీకి సంస్కృతంలో "ఆదికవి" అయితే, సరససంస్కృతసాహిత్యంలో కాళిదాసు "ఆదికవి" అనవచ్చు సంశయంలేదు

"అభిజ్ఞాన శాకుంతలమునకు" లెక్కలేనన్ని వ్యాఖ్యలు, అనువాదాలు, విమర్శలు, ప్రశంసలున్ను ప్రసిద్ధమైన ప్రపంచభాషలన్నింటిలోను వెలిసి, బహుళ ప్రచారంలో ఉన్నాయి. ఇంకను నేడు, రేపు కూడా వెలుస్తూనే ఉంటాయి. ఇది సతతసాహిత్య ప్రక్రియ. సాగుతూనే ఉంటుంది. "మేఘసందేశము" స్థితి కూడా ఇంచుమించు ఇంతే! ఈ రచనలన్నీ గద్యపద్య రూపంలో ప్రకాశిస్తున్నాయి. ఇదంతా కాళీమహిమయే! కవిరాజవిరాజితమే! "అస్తు".

ప్రకృతం : ఈ కాళిదాసకావ్యద్వయానికి శ్రీ జి వి.యస్. సుబ్రహ్మణ్య శర్మగారు తెలుగు అనువాదాన్ని సంతరించినారు వీరు, ప్రవచన ప్రభాకరులు, ఉపన్యాసకేసరులు, భాగవతరత్నములు, ఈ బిరుదములే వీరి శక్తిసామర్థ్యాలను, వ్యక్తిత్వమును, బహుజనప్రియత్వమును చాటి చెపుతాయి "విశిష్య" సుచిరకాలంనుండి నాకు సహచరులు సహభావుకులు వీరు సహజ సత్త్వసంపన్నులు. సాధుమూర్తి భాగవతమూర్ధన్యులు నాయందు స్నేహబంధురమైన ఆదరాభిమానాలను పెంచుకున్నవారు మిత్రప్రోత్సాహంతో ఈ అనువాదానికి నడుము బిగించి, కృతకృత్యు లయినారు "మహాన్మోదః"

ఈ రచన పూర్తిగా గద్యమయం భాష సరస గ్రాంధికం, అయినా సరళంగాను, మధురంగాను, సుబోధంగాను ఉంది. పదగుంభనం బాగా అమరింది. సర్వమున్ను మూలవిధేయంగానే సాగింది దీన్ని నేను పుష్కలంగానే అనుభవించి ఆనందించేను.

శ్రీ శర్మగారు ఇదివరకే ఎన్నో కృతులను ముఖ్యంగా భక్తిప్రధానమైన వాటిని రచించి "చేయి తిరిగి" ఉన్నవారు కనుకనే వీరు "సుకృతులు". ఈ కృతి వీరి కృతులన్నింటికిన్ని "మూర్ధాలంకృతి" అగుగాక! అని "ఇతో ఉధికంగా కృతులను కూర్చుటకు తగిన శక్తియుక్తులను భగవానుడు వీరికి అనుగ్రహించు గాక!" అనిన్నీ మంగళాశాసనమును అందిస్తున్నాను.

విశాఖపట్టణం 13 — "సాహిత్య సంరక్షుడు"

తేది 6 2 2002

[signature] 6-2-02

**డా॥ కౌజ లక్ష్మీనరసింహారావు**
ఎం ఏ పిహెచ్ డి.
రీడర్, తెలుగు, సంస్కృతశాఖాధిపతి
నోబుల్‌కాలేజి, మచిలీపట్నం.

# సమీక్ష

శకుంతల కథకు మూలం వ్యాసభారతం. అభిజ్ఞానశాకుంతల నాటకానికి స్ఫూర్తి వాల్మీకం నుండి కూడా వచ్చింది. వాల్మీకంలో సుందరకాండలో శ్రీరాముడు హనుమంతుని కిచ్చి పంపిన అంగుళీయకవృత్తాంతం ఉంది. తత్పూర్వం ఎలా ఉంటుందో తెలియని సీతాదేవిని దర్శించిన హనుమ, ఆ సీతారాముల దాంపత్యధర్మానికి చ్యుతి లేకుండా చేశాడు తనచేత విస్మరింపబడ్డ శకుంతలను, తాను బహూకరించిన ఉంగరాన్ని చూచిన తర్వాత, దుష్యంతుడు, జ్ఞప్తికి తెచ్చుకొని, తన దాంపత్యధర్మాన్ని నిలబెట్టుకోవటానికి దుష్యంతుడు ప్రయత్నిస్తాడు అభిజ్ఞానశబ్దాన్ని వాల్మీకి ఉపయోగించాడు. ఈ విధంగా వాల్మీకి వ్యాసులు కాళిదాసుకు గురుస్థానాలు.

తెలుగులో, అభిజ్ఞానశాకుంతల నాటకానికి, పూర్వశతాబ్దిలో అసంఖ్యాకంగా అనువాదాలు వచ్చినాయి. ఒక్కొక్క అనువాదం ఒక్కొక్క విధంగా, మూలనాటకసౌందర్యాన్ని చెడగొట్టాయి. కాళిదాసు కవిత్వం కొంత ఇత్యాది సామెత ఉంది కదా!

కాళిదాసు అభిజ్ఞానశాకుంతలం నాటకాన్ని శ్రీ జి.వి యస్ సుబ్రహ్మణ్యశర్మగారు తెలుగులో కనువదించారు. వచనరూపంగా అనువదించారు. పాత్రల సంభాషణలనే గాకుండా, మూలంలో శ్లోకాలను కూడా తెలుగులో వచనంగానే అనువదించారు.

అభిజ్ఞాన శాకుంతలం నాటకం కాబట్టి పాత్రోచితమైన భాషను కాళిదాసు ఉపయోగిస్తాడు. శకుంతలా విదూషకాది పాత్రలు ప్రాకృతభాషలో మాట్లాడాలి. (ప్రాకృతం అంటే మన వ్యావహారిక భాషలాంటిది) పూర్వసంస్కృతనాటకాలన్నీ

యిట్లాగే వ్రాస్తారు. శ్రీ శర్మగారు, తన అనువాదంలో మొత్తం సరళ గ్రాంథిక భాషనే వాడారు. అంతేకాదు. సంస్కృతమూలంలొ కూడా ప్రాకృతభాషను విడిచి, దాని సంస్కృతభాషారూపాన్ని మాత్రం అందించారు. ఆధునిక కాలంలో పాఠకులకు నాటకాలను సంస్కృతంతొ పరిచయం కల్గించటం ముఖ్యంగాని, ప్రాకృతంతో అవసరంలేదని శర్మగారి భావన. ఇది సమంజసం

ఆయా వ్యాఖ్యలపట్ల శర్మగారికిగలగౌరవం, వారి తెలుగుసేతలో స్పష్టంగా కన్పిస్తుంది వీరి అనువాదసారళ్యం ఎలాంటిదంటే, ఒకసారి వీరి తెలుగు అనువాదాన్ని శ్రద్ధగా చదివి, రెండవసారి మూలాన్ని చదివితె దానంతట అదే బోధపడుతుంది శ్లోకాలలోని భావాన్ని మొదట తెలుగు వచనంలో చదివిన పాఠకుడు మూలశ్లోకాన్ని హాయిగా చదివి ఆనందించగల్గుతాడు

మూలంలోని శ్లోకాలలో ఉన్న పదబంధాలను అట్లే తెలుగులో వ్రాసి, కాళిదాసు ప్రయోగించిన శబ్దాలలోని సౌందర్యాన్ని తెలుగువాళ్లకి అందించటంలో శర్మగారు కృతకృత్యులయ్యారు. "అనాఘ్రాతం పుష్పం. శ్లోకంలో భోక్తారం, విధిః, ఈ మాటలను అట్లే ఉంచిన శర్మగారు, మార్చటంవల్ల కలిగే హానిని గుర్తించారు కాళిదాసు వాడిన ప్రతిశబ్దాన్ని గాఢంగా చింతనం చేయాలి. చతుర్థాంకంలో "శ్లోకచతుష్టయం" ఉంది వీటిని ఎటువంటి పద్యంలో అనువదించినా, మూలంలోని రసానుభూతి కల్గదు. మనొనేత్రంతో చూచి ఆనందించతగ్గ శకుంతలాదిరూపాల్ని, రవివర్మవంటి మహాచిత్రకారులు, చిత్రాలుగా వ్రాసి, భౌతికనేత్రాలకు కనువిందు కల్గించారు శ్రీ శర్మగారు ఆయాచిత్రాలను కూడా సందర్భోచితంగా పాఠకులకు అందించారు.

బహుభాషలలో బహువిధాలుగా అనువదింపబడినప్పటికి వ్యాసుని హృదయం ఆవిష్కరింపబడలేదని బాధపడిన రాజరాజు, నన్నయచేత, భారతాన్ని సమీచీనంగా తెలుగులో వ్రాయించినట్లు బ్రహ్మశ్రీ రాళ్లబండి చంద్రశేఖర శాస్త్రి దంపతులు శ్రీశర్మగారిచేత కాళిదాసకృతులను తెలుగులో వ్రాయించి, ఒక గొప్ప యజ్ఞఫలం పొందారు

# మేఘసందేశం

'మాఘే మేఘే గతం వయః' అని మల్లినాథులు ప్రశంసించిన కాళిదాసు మేఘసందేశాన్ని, ప్రవచనప్రభాకరులు, ఉపన్యాసకేసరి, భాగవతరత్న బిరుదాంచితులైన శ్రీ శర్మగారు, వచనరూపంగానే ఆంధ్రీకరించారు. మల్లినాథులవారు మేఘసందేశాన్ని మహాకావ్యంగానే పరిగణించారు "కాళిదాసు ప్రకృతి పరిశీలనాపాటవమును తన అన్ని కావ్యములలోను చూపినను అది మేఘసందేశములో పరాకాష్ఠ స్థితికి చేరినది" అని అనువాదకులు వివరించారు

అనువాదం కత్తిమీద సాము వంటిది అనువాదంలో ఏ చిన్న దోషం దొర్లినా, మూలగ్రంథంమీద పాఠకునికి గల గౌరవం తగ్గుతుంది ఈ ప్రమాదం జరగకుండా శ్రీశర్మగారు కేవలం వచనంలోనే తన అనువాదాన్ని చేశారు. ఉపాధ్యాయులు లభింపనివాళ్లకు తన్నిరపేక్షంగా మూలగ్రంథంలోని స్వారస్యాన్ని పాఠకుడు ఆస్వాదించగల్గుతాడు

శ్రీ శర్మగారు మిక్కిలి కృషిచేసి ప్రాచీన ప్రసిద్ధ నగరాల పేర్లను, నేడు వాటికి గల మ్లేచ్ఛనామాలను వివరిస్తూ ఒక పట్టిక నిచ్చారు అలక, అవంతి, ఆమ్రకూట, గంభీర, దశార్ణ మొదలగు ప్రాంతాలకు ఈనాటి పేర్లు వివరించారు. కాళిదాసు భావనలో భారతదేశ నైసర్గిక స్వరూపాన్ని వివరించే పటాన్ని (మ్యాప్) ప్రకటించి తన పరిశోధనాపరిశీలనానైపుణ్యాన్ని నిరూపించుకున్నారు

మేఘకావ్యంలోని చర్చనీయాంశాల జోలికి శర్మగారు పోలేదు కానీ ఆయా విషయాలను గూర్చి శర్మగారికి సమగ్రమైన అవగాహన ఉంది. గుహ్యక శబ్దం బదులు యక్షశబ్దాన్ని వాడి, తన పరిశీలనలోని నైశిత్యాన్ని నిరూపించుకున్నారు

శ్రీశర్మగారు తమ అనువాదంలో ప్రథమదివసే అని ప్రశమదివసే అని రెండు పాఠాలు వ్రాశారు. తమకు ఏ పాఠం సమ్మతమో చెప్పలేదు. అయితే కాళిదాసప్రయుక్త పదాలలోని ఔచిత్యాన్ని శర్మగారు సమగ్రంగా పాటించారు.

"పయోద" అనే సంబోధనను"ఓ నీటిని ఇచ్చువాడా" అని "ధనపతి" పదాన్ని "కుబేరుడు" అని అర్థవంతంగా తెలిగించారు పూర్వమేఘంలో 41 శ్లోకంలో "రుద్ధాలోకే నరపతిపథే సూచిభేద్యై స్తమోభిః" అనే చోట కాళిదాసు వాడిన "సూచిభేద్య" అనే ప్రయోగాన్ని "దట్టమయిన"ది అని అనువదించారు. దశార్ణదేశ వర్ణనంలో" త్వ య్యాసన్నే పరిణతఫలశ్యామ జంబూవనాంతాః" అనే శ్లోకంలో 'అంత' శబ్దానికి మల్లినాథులవారు రమ్యమైనది అని అర్థం వ్రాశారు శ్రీశర్మగారు 'అంత' శబ్దాన్ని రమ్యమైనప్రాంతం (ప్రదేశం) అని కొంత మార్చివ్రాశారు.

సంస్కృతగ్రంథాలలోని భావాలను ఆస్వాదించటానికి శ్రీ శర్మగారు చేసిన ఈ అనువాదం గురుస్థానంలో నిలుస్తుంది.

శిశిర శబ్దానికి మంచు అనే అర్థాన్ని శిశిరఋతువులో "మంచుచేత" అని శ్రీ శర్మగారు మల్లినాథుల వారిచే సుపరిష్కృతమైన పారాలనే స్వీకరించారు

మేఘసందేశానువాదం ద్వారా తెలుగు భాషలోని మాధుర్యాన్ని వచన రూపంలో ప్రవహింపజేసిన శర్మగారు అభినందనీయులు. పూర్వం "జంకుకళంకు లేని కవిచంద్రుడు" వేదం వేంకటరాయశాస్త్రిగారు కాళిదాస కృతులకు తెలుగులో వ్యాఖ్యానాలు వ్రాసి మనకు మేలు చేశారు అదే విధంగా శ్రీ శర్మగారు కాళిదాసాది మహాకవుల రచనలను అనువదించి తెలుగువారికి అందించి మేలుచేస్తారని నా విశ్వాసం.

డా॥ కాజ లక్ష్మీనరసింహారావు



# మాళవికాగ్నిమిత్రంనాటకమునందలి

## పాత్రములు

### పురుషులు

| | | |
|---|---|---|
| అగ్నిమిత్రుడు | : | నాయకుడు, విదిశాధిపతి |
| గణదాసు | : | మాలవికయొక్క నాట్యగురువు |
| హరదత్తుడు | : | ఇరావతియొక్క నాట్యగురువు |
| గౌతముడు | : | విదూషకుడు |
| వాహతకుడు | : | అగ్నిమిత్రుని మంత్రి |
| మౌద్గల్యుడు | : | కంచుకి |
| సారసుడు | : | అంతఃపురపరిచారకుడు |
| ఇరువురు | : | వైతాళికులు, (పరివారము) |

### స్త్రీలు

| | | |
|---|---|---|
| ధారిణి | : | అగ్నిమిత్రుని పట్టమహిషి |
| ఇరావతి | : | అగ్నిమిత్రుని రెండవభార్య |
| మాలవిక | : | నాయిక, మాధవసేనుని సోదరి |
| కౌశికి | : | పరివ్రాజిక, సుమతిసోదరి |
| వకులావలిక | : | ధారిణియొక్క పరిచారిక |
| కౌముదిక | : | ధారిణియొక్క పరిచారిక |
| సమాహితిక | : | పరివ్రాజికయొక్క పరిచారిక |
| మధుకరిక | : | ఉద్యానపాలిక |
| నిపుణిక | : | ఇరావతియొక్క పరిచారిక |
| జయసేన | : | ప్రతీహారిణి |
| { రజనిక | : | మాధవసేనుడు పంపిన |
| { జ్యోత్స్నిక | : | శిల్పకారికలు |

శ్రీః

# మాలవికాగ్నిమిత్రమ్

## ప్రథమో ఽఙ్కః

శ్లో॥ ఏకైశ్వర్యే స్థితో ఽపి ప్రణతబహుఫలే యః
స్వయం కృత్తివాసాః
కాంతాసమ్మిశ్రదేహో ఽప్యవిషయమనసాం యః
పరస్తా ద్యతీనామ్।
అష్టాభి ర్యస్య కృత్స్నం జగదపి తనుభి
ర్బిభ్రతో నాభిమానః
సన్మార్గాలోకనాయ వ్యపనయతు స వః
తామసీం వృత్తి మీశః॥ 1

శ్రీః

# మాళవికాగ్నిమిత్రము

## మొదటి అంకము

## నాందీశ్లోకము

(ఇది నాందీశ్లోకము, కాళిదాసు రచించిన మూడు నాటకములయందును అష్టమూర్తి యగు పరమశివుడే నాందీశ్లోకములయందు స్తుతింపబడినాడు. ఈ శ్లోకముల యందు ఒక మోక్షసాధనమార్గము వివరింపబడినదని అభిజ్ఞులు చెప్పుదురు. మొదటి నాటకమైన "మాళవికాగ్నిమిత్రము"లోని నాందీశ్లోకము మోక్షమార్గము నందుకొనుటకు కావలసిన "సన్మార్గాలోకనము" అను సాధనమార్గమును పేర్కొనినది రెండవ నాటకమగు "విక్రమోర్వశీయము". నందు మోక్షప్రాప్తికి సాధనమైన భక్తిమార్గము ప్రస్తావింపబడినది. మూడవ నాటకమగు 'అభిజ్ఞానశాకుంతలము'నందు అష్టమూర్తియగు సాకారశివుడు సాధకులను రక్షించుగాక. అను ఫలము వివరింపబడినది అందువలననే అభిజ్ఞానశాకుంతలపు భరతవాక్యములో "మమాపి చ క్షపయతు నీలలోహితః పునర్భవం పరిగతశక్తి రాత్మభూః" అని చెప్పినాడు. ఈ విధముగా కాళిదాసు తన 3 నాటకముల నాందీశ్లోకములలో ఒక సమన్వయభావమును కల్పించినాడు. తనకు ప్రణమిల్లిన భక్తులతో బహుఫలప్రదమైన ఏకైశ్వర్యము నందు (అద్వితీయమైన ఐశ్వర్యమునందు) ఉండియును, (తన నిరాండబరతను చాటుటకో అన్నట్లు) స్వయముగా గజచర్మమును ధరించినవాడును, కాంతాశరీరముతో కూడియు (అర్ధనారీశ్వరస్వరూపము కలవాడయ్యును) వీతరాగులైన (జితేంద్రియులైన) ఋషీశ్వరుల స్థితికంటె శ్రేష్ఠమైన స్థితి కలవాడును, అష్టవిధములైన శరీరములతో సర్వప్రపంచమును భరించు



వ్యపనయతు తామసీం వృత్తి మీశః 1 1

వాడయ్యును ఎవనికి అహంకారము లేశమంత కూడ లేదో, ఆ పరమేశ్వరుడు సన్మార్గమును చూపించుటకొరకై మీ యొక్క మనస్సుల యందున్న తమోమయమైన చిత్తవృత్తిని తొలగించు గాక. 1

ఈ శ్లోకమునందు ఉన్న కొన్ని పదములకు కల విశిష్టార్థములను ఇక పరికింతము . "ఏకైశ్వర్యేస్థితః" అను పదమునకు స్వజాతీయ, విజాతీయ రహితమై, అసాధారణమైన, సర్వేశ్వరత్వపదవియందు, ఇతరులచే స్థాపింపబడక, స్వయముగా ఉన్నవాడు అని అర్థము. "కాంతాసమ్మిశ్రదేహః " అనగా స్త్రీ మాత్రముతోనేకాక ప్రియపత్నితో సంపూర్ణముగా కలసియున్న శరీరము కలవాడని అర్థము. "పరస్తాత్" అనగా సర్వోన్నత స్థానమున ఉన్నవాడు అని అర్థము. " తామసీ వృత్తి' అనగా అవిద్యారూపమైన చిత్తవృత్తి అని అర్థము. ఈ శ్లోకమునందు విరోధాభాసాలంకార మున్నది. "సన్మార్గము" అనగా మోక్షమార్గము అని అర్థము. మోక్షప్రాప్తికై జీవులకు ఆ శివుడు జీవులయందలి అవిద్యను తొలగించి జ్ఞానమార్గమును ప్రసాదించుగాక అని ఇందలి ప్రార్థన.

"సన్మార్గాలోకనము" అను పదముచే "మార్గము" అను నాట్యభేదమును కవి సూచించినాడని మరికొందరు పెద్దలు పేర్కొందురు. భరతనాట్యములో "ఛలితము" అను మార్గనాట్యవిశేషము ఈ నాటకమునందు సూచింపబడినదని నాట్యశాస్త్రవేత్తలు చెప్పుచుందురు.

ఈ నాందీశ్లోకమునందలి నాలుగు పాదములలో చతుర్విధ పురుషార్థములు సూచింపబడినవి అని మరికొందరి అభిప్రాయము. ప్రథమపాదమునందలి. "ఐశ్వర్య" అను శబ్దముచే అర్థమును, ద్వితీయపాదమునందలి "కాంతా" శబ్దముచే కామమును, తృతీయ పాదమునందలి "బిభ్రతః" అను పదముచే ధర్మమును; చతుర్థ పాదము నందలి "సన్మార్గ" అను పదముచే మోక్షమును సూచితములైనవి.

(నాంద్యంతే)

**సూత్రధారః -** (నేపథ్యాభిముఖ మవలోక్య) మారిష ఇత స్తావత్.

(ప్రవిశ్య)

**పారిపార్శ్వకః -** భావ! అయ మస్మి.

**సూత్రధారః -** అభిహితో ఽస్మి విద్వత్పరిషదా "కాళిదాసగ్రథితవస్తు మాలవికాగ్నిమిత్రం నామ నాటక మస్మిన్ వసంతోత్సవే ప్రయోక్తవ్యం" ఇతి. త దారభ్యతాం సంగీతకమ్.

**పారిపార్శ్వకః -** మా తావత్. ప్రథితయశసాం భాస, సౌమిల్లక, కవిపుత్రాదీనాం ప్రబంధా నతిక్రమ్య వర్తమానకవేః కాళిదాసస్య క్రియాయాం కథం బహుమానః?

**సూత్రధారః -** అయి! వివేకశ్రాంత మభిహితమ్. పశ్య

**శ్లో॥** **పురాణ మిత్యేవ న సాధు సర్వం**
**న చాపి కావ్యం నవ మిత్యవద్యమ్।**

(నటరాజైన పరమేశ్వరుని నాట్యమునకు నందీశ్వరుడే రంగస్థలము కనుక నటులు రంగస్థలమును నందిగా భావించి, అచ్చటచేయు పూజావిధానమునకు, ప్రార్థనకు "నాంది" అని పేరుపెట్టిరి. ఈ నాందీ శ్లోకమందు ఎనిమిది, పన్నెండు, పద్దెనిమిది, ఇరవైరెండు, పదములు ఉండవలెనని లక్షణకారు లందురు.

(నాందికి తరువాత)

**సూత్రదారుడు:-** (నేపథ్యము వైపునకు చూచి) మారిషుడా! ఇటు రమ్ము

(ప్రవేశించి)

**పారిపార్శ్వకుడు:-** బావా! ఇదిగో వచ్చితిని.

**సూత్రధారుడు:-** "కాళిదాసు రచించిన మాళవికాగ్నిమిత్రము అను నాటకమును ఈ వసంతోత్సవ సమయమునందు అభినయించుము" అని ఈ పండితసభచే ఆజ్ఞాపింపబడితిని. కనుక రాగాలాపమును ప్రారంభింపుము.

**పారిపార్శ్వకుడు:-** అట్లనకుము. ఇప్పటికే సుప్రసిద్ధ కవులైన భాసుడు, సౌమిల్లకుడు కవిపుత్రుడు మొదలగు వారి ప్రబంధములను త్రోసిపుచ్చి, ప్రస్తుత (వర్ధమాన) కవియగు కాళిదాసుని రచనలపై సభ్యులకు గౌరవ మె ట్లేర్పడును?

**సుత్రదారుడు:-** ఓయీ! తెలివి లేనట్లు మాట్లాడితివి. ఇటు చూడుము.

కావ్యము పాతది అయినంత మాత్రముచేతనే అది అంతయు మంచిది అనరాదు. అట్లే క్రొత్తకావ్యము అయినంత మాత్రముచేతనే నిందింపదగినదియు కాదు. అందువలననే

సంతః పరీక్ష్యాన్యతరద్భజంతే
మూఢః పరప్రత్యయనేయబుద్ధిః॥ 2

**పారిపార్శ్వకః -** ఆర్యమిశ్రాః ప్రమాణమ్॥

**సూత్రధారః -** తేన హి త్వరతాం భవాన్.

శ్లో॥ శిరసా ప్రథమగృహీతా
మాజ్ఞా మిచ్ఛామి పరిషదః కర్తుమ్।

సత్పురుషులైన వారు క్రొత్తపాతలను బాగుగా పరిశీలించి, వానిలో మంచిదానినే స్వీకరింతురు. మూఢులైనచో వారి బుద్ధి ఇతరుల భావములచే నడిపింపబడుచుండును మూఢులకు స్వశక్తిపై నమ్మకముండదని దీని భావము. 2

(మాళవిక అను నాయికను గూర్చియు, అగ్నిమిత్రుడు అను నాయకుని గూర్చియు వారి ప్రేమకధను తెలుపుచు వ్రాయబడిన నాటకము కనుక ఈ నాటకమునకు "మాళవికాగ్ని మిత్రము" అను పేరు వచ్చినది.

కాళిదాసు తన రచనలకు ప్రామాణ్యమును సంపాదించు కొనుటకై పండితులకు తన కావ్యములను చూపించి, వారి అభిప్రాయములను స్వీకరించు అలవాటు కలవాడు. ఈ శ్లోకము నందలి భావమునే రఘువంశములో

"తం సంతః శ్రోతు మర్హంతి

సదసద్వ్యక్తి హేతవః" అనియు

"ఆపరితోషాత్ విదుషాం

న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానం" అని అభిజ్ఞాన శాకుంతలము నందును ప్రకటించును.)

**పారిపార్శ్వకుడు:** మాళవికాగ్నిమిత్ర నాటకమునందలి గుణదోషములను ఈ సభయందలి పూజ్యులైన పండితులే నిర్ణయింతురుగాక.

**సూత్రధారుడు:-** అందువలన (పాట పాడుటకై) నీవు త్వరపడుము

పట్టపురాణి యైన ఈ ధారిణీదేవియొక్క ఆజ్ఞలను సేవాదక్షులైన ఈ పరిజనములు పాటించునట్లే, నేనును ఈ

**దేవ్యా ఇవ ధారిణ్యాః**
**సేవాదక్షః పరిజనో ఽయమ్॥** 3

(ఇతి నిష్క్రాన్తౌ)

**ఇతి ప్రస్తావనా**

(తతః ప్రవిశతి చేటీ)

**చేటీ -** ఆజ్ఞప్తాస్మి దేవ్యా ధారిణ్యా "అచిర ప్రవృత్తోపదేశం ఛలితం నామ నాట్య మన్తరేణ కీదృశీ మాలవికా" ఇతి నాట్యాచార్యం ఆర్యగణదాసం ప్రష్టుమ్॥ త ద్యావత్ సంగీతశాలాం గచ్ఛామి.

(ఇతి పరిక్రామతి.)

(తతః ప్రవిశ త్యాభరణహస్తా ద్వితీయా చేటీ.)

**ప్రథమా -** (ద్వితీయాం దృష్ట్వా) హలా కౌముదికే! కుత స్తే ఇయం ధీరతా? య త్సమీపేనా ప్యతిక్రామంతీ ఇతో దృష్టిం న దదాసి?

సభలోని పండితులయొక్క ఆజ్ఞను ఇదిగో శిరసావహించుచున్నాను. 3

(అని ఇద్దరు నిష్క్రమింతురు )

## ఇది ప్రస్తావన

(తరువాత చేటి ప్రవేశించును.)

**చేటి :-** ఈ మధ్యనే ఛలితము అను పేరుకల నాట్యమును నేర్వ నారంభించిన మాళవికయొక్క విద్యాభ్యాసము ఎట్లు సాగుచున్నదో, ఆమెకు ఆ నాట్యమునందు ఎంతటి అభిరుచి కలదో, నాట్యాచార్యులైన గణదాసును అడిగి తెలిసికొని రమ్మ్మ" అని ధారిణీదేవి న న్నాజ్ఞాపించినది. కనుక (ఆ విషయమును తెలిసికొనుటకై) సంగీతశాలకు బయలుదేరుదును.

("ఛలితము" అనగా ఒక నాట్యవిశేషము. పూర్వము జరిగిన ఒక వృత్తాంతమును నెపముగా తీసికొని, నాయిక తన అభిప్రాయమును ఇందు సాక్షాత్తుగా ప్రకటించుచు నటించును "ఛలము" అనగా మిష. ఆ ఛలము ఈ నాట్యమునందు ఉండుటవలన ఈ నాట్యమునకు ఛలితము అని పేరు వచ్చినది)

(అని సాగిపోవును.)

(తరువాత ఆభరణమును చేతితో పట్టుకొని, రెండవ చేటి ప్రవేశించును.)

**ప్రథమ** రెండవ చేటిని చూచి, చెలీ! కౌముదికా! నా దగ్గర నుండియే వెళ్ళుచు, నా వైపునకు తిరిగియైన చూడకున్నావు. నీ కింతటి బెట్టు ఏమే?

**ద్వితీయా -** అహో వకులావలికా! సఖి! దేవ్యా ఇదం శిల్పి సకాశా దానీతం సర్పముద్రాసనాథం అంగులీయకం స్నిగ్ధం నిధ్యాయంతీ తవోపాలంభే పతితాస్మి!

**వకులావలికా -** (అంగులీయకం విలోక్య) స్థానే ఖలు సజ్జతి దృష్టిః. అనేన అంగుళీయకేన ఉద్భిన్నకిరణ కేసరేణ కుసుమిత ఇవ తే అగ్రహస్తః ప్రతిభాతి.

**కౌముదికా -** హలా! కుత్ర ప్రస్థితాసి?

**వకులావలికా -** దేవ్యా వచనేన నాట్యాచార్యం, ఆర్యగణదాసం ద్రష్టుమ్,
"ఉపదేశ గ్రహణే కీదృశీ మాలవికా?" ఇతి.

**కౌముదికా -** సఖి! ఈదృశేన వ్యాపారేణ అసన్నిహితాపి దృష్టా కిల సా భర్త్రా.

**వకులావలికా -** ఆమ్. స జనః దేవ్యాః పార్శ్వగతః. చిత్రే దృష్టః.

**కౌముదికా -** కథ మివ?

**వకులావలికా -** శృణు. చిత్రశాలాం గతా దేవీ యదా ప్రత్యగ్రవర్ణరాగాం చిత్రలేఖాం అవలోకయంతీ చిరం తిష్ఠతి,

**ద్వితీయ** ఓహో! వకుళావలికయా? చెలీ! నాగముద్రతోకూడిన, రాణిగారి ఈ ఉంగరమును శిల్పివద్దనుండి తెచ్చుచు దానిని ప్రేమతో, ముచ్చటగా పరిశీలించుచుండుటవలన నిన్ను చూడలేకపోయితిని. అందుకే నీ దూషణకు పాలబడితిని. (ఈ ఉంగరముయొక్క ప్రయోజనము చతుర్థాంకమున కనబడును.)

**వకుళాలిక:-** (ఉంగరమును చూచి) దీనియందు చూపు లగ్నమగుట ఉచితముగనే యున్నది నీ ముంజేతితో ఈ ఉంగరమును నీవు పట్టుకొనుటచేత అది, ఉంగరమునుండి వెలువడుచున్న కిరణముల సమూహములతో నీ ముంజేయి కేసరములతో కూడి పుష్పించినదా అన్నట్లున్నది.

**కౌముదిక:-** చెలీ! ఎక్కడికే బయలుదేరితివి?

**వకుళావలిక.-** "నాట్యోపదేశమును స్వీకరించు విషయములో మాళవిక ఎట్లున్నదో తెలిసికొని రమ్మని" ధారిణీదేవి చెప్పుటచేత నాట్యాచార్యుడైన గణదాసుని చూచుటకు.

**కౌముదిక:-** చెలీ! నాట్యాభ్యానమువలన మాళవిక మహారాణికి దగ్గరలేకున్నను ఆమె రాజుచేత చూడబడినదట కదా!

**వకుళావలిక:-** అవును, ఆ మాళవిక మహారాణియొక్క ప్రక్కన ఉన్నట్లుగా గీయబడిన చిత్రమునందు రాజుచే చూడబడినది.

**కౌముదిక:-** అది ఎట్లో?

**వకుళావలిక:-** వినవే. చిత్రశాలకు వెళ్లి అప్పుడే రంగులు వేసినచిత్రమును చూచుచున్న మహారాణిగారు, అచ్చటే చాలసేపు ఉండి

తస్మిన్నంతరే భర్తా ఉపస్థితః.

**కౌముదికా -** తత స్తతః?

**వకులావలికా -** ఉపచారానంతరం ఏకాసనోపవిష్టేన భర్త్రా చిత్రగతాయాః దేవ్యాః పరిజనమధ్యగతాం ఆసన్న పరిచారికాం దృష్ట్వా దేవీ పృష్టా.

**కౌముదికా -** కిమితి?

**వకులావలికా -** అపూర్వేయం దారికా, దేవ్యా ఆసన్నా ఆలిఖితా, కిం నామధేయా ఇతి.

**కౌముదికా -** ఆకృతివిశేషేషు ఆదరః పదం కరోతి. తత స్తతః?

**వకులావలికా -** తతః అవధీరితవచనః భర్తా శంకితః, పునర ప్యనుబన్ధుం ప్రవృత్తః. యావ ద్దేవీ న కథయతి తావత్ కుమార్యా వసులక్ష్మ్యా ఆఖ్యాతః. "ఆర్య! ఏషా మాలవికా" ఇతి.

**కౌముదికా -** (సస్మితం) సదృశం ఖల్వేతత్ బాలభావస్య. తతః పరం కథయ.

**వకులావలికా -** కి మన్యత్? సాంప్రతం మాలవికా సవిశేషం భర్తుః దర్శనపథాత్ రక్ష్యతే.

పోయినారు అంతలో రాజుగారు అచ్చటికి చేరవచ్చినారు

**కౌముదిక:-** తరువాత, తరువాత?

**వకుళావలిక:** మర్యాదలు అయిన తర్వాత, రాణిగారితో కలసి ప్రభువు ఏకాసనముపై కూర్చొని, ఆ చిత్రములో దేవిగారి పరిజనముమధ్య ఆమెకు మిక్కిలి సమీపముగా ఉన్న ఒక పరిచారికను చూచి, రాజుగారు రాణి గారిని ఇట్లు ప్రశ్నించిరి

**కౌముదిక:-** ఏమని?

**వకుళావలిక:-** "దేవికి మిక్కిలి దగ్గరగా లిఖింపబడిన ఈ క్రొత్త పిల్ల పేరేమిటి"? అని

**కౌముదిక:-** విశిష్టమైన ఆకారము కలవారియందు ఇట్టి ఆదరము నెలకొనుట సహజమే కదా! ఆ తరువాత, తరువాత?

**వకుళావలిక:-** రాజువేసిన ప్రశ్నకు మహారాణి సమాధానము చెప్పలేదు దానితో కలత చెందిన రాజు, రాణిని మరల, మరల అడుగసాగినాడు ఎంతకును దేవి సమాధానము చెప్పనందువలన ఆ దగ్గరనే ఉన్న కుమారి వసులక్ష్మి (రాజు యొక్క పెంపుడుకూతురు అయి ఉండవచ్చును) "అయ్యా! ఈమె మాళవిక", అని చెప్పివైచెను.

**కౌముదిక:-** (చిరునవ్వుతో) ఈ సమాధానము ఆమె కుర్రతనమునకు తగినట్లే యున్నది. తరువాత ఏమైనదో చెప్పుము.

**వకుళావలిక:-** చెప్పుటకు ఇంకే మున్నది? ఇప్పుడు మాళవికను రాణి, ప్రభువు దృష్టిలో పడకుండ మిక్కిలిగా రక్షించుచున్నది

**కౌముదికా -** హలా! అనుతి ష్ఠాత్మనో నియోగమ్. అహమపి ఏత దంగుళీయకం దేవ్యై ఉపనేష్యామి.

(ఇతి నిష్క్రాన్తా)

**వకులావలికా -** (పరిక్రమ్య అవలోక్యచ) ఏష నాట్యాచార్యః ఆర్యగణదాసః, సంగీతశాలాతః ఇదానీం నిష్క్రామతి. యావ ద స్యాత్మానం దర్శయామి.

(ఇతి పరిక్రామతి)

(ప్రవిశ్య)

**గణదాసః -** కామం ఖలు సర్వస్యాపి కులవిద్యా బహుమతా. న పునః అస్మాకం నాట్యంప్రతి మిథ్యాగౌరవమ్.

**తథాహి -**

**శ్లో॥ దేవానా మిద మామనన్తి మునయః కాంతం క్రతుం చాక్షుషం**
**రుద్రే ణేద ముమాకృతవ్యతికరే స్వాంగే విభక్తం ద్విధా।**
**త్రైగుణ్యోద్భవ మత్ర లోకచరితం నానారసం దృశ్యతే**
**నాట్యం భిన్నరుచే ర్జనస్య బహుధా ప్యేకం సమారాధనమ్॥ 4**

**కౌముదిక:-** చెలీ! నీ పనిని నీవు నిర్వర్తింపుము. నేను కూడ ఈ ఉంగరమును దేవికి అందింతును.

(అని వెడలిపోవును.)

**వకుళావలిక:-** (ముందుకు నడిచి, చూచి)

సంగీతశాల నుండి ఇడుగో నాట్యాచార్యుడైన, ఆర్యగణదాసుడు ఇప్పుడే బయటకు వచ్చుచున్నాడు. ఈయన దగ్గరకు వెళ్ళి, కనబడుదును.

(అని ముందుకు నడుచును.)

(ప్రవేశించి)

**గణదాసుడు:-** ఎవరికైనను నిజముగా కులవిద్య గౌరవింపబడదగినదే గదా! (కులవిద్య అనగా ఆ వంశము వారికి జీవనోపాధికారకమైన, వంశపారంపర్యముగా వచ్చు విద్య) ప్రత్యేకించి మాకు (కుటుంబమునకు) మాత్రము నాట్యమును గురించి ఏర్పడిన పూజ్యభావము మిథ్య కాదు.

ఏల యనగా

"ఈ నాట్యము అనునది దేవతలకు మనోహరమైన నేత్రయజ్ఞము! అని (భరతాది) మునీశ్వరులు చెప్పుచుందురు, రుద్రుడు ఈ నాట్యమును తన అర్ధనారీశ్వర రూపమునందు (1. తాండవము, 2. లాస్యము.) అను రెండు పేరులతో విభజించి, ప్రకటించినాడు. ఈ నాట్యమునందు (సత్వ, రజస్, తమస్సులు అను) త్రిగుణముల సమాహారము వలన జన్మించిన లోకవృత్తమే నానారసమయముగ కనబడు చుండును.

(భిన్న రుచులుకల జనులకు ఈ నాట్యము ఒక్కటియే అయినను అందరకు అన్ని విధముల ఆనందమును కలిగించు శక్తి కలది. (నాట్యశాస్త్రముయొక్క ప్రాశస్త్యమును వ్యాఖ్యాతలు ఇట్లు వివరించినారు. "నాట్యము వేదసమ్మితమైన కర్మ" అని భరతముని ఈ విధముగా నిరూపించినాడు. నాట్యవేదమునందలి పాఠ్యభాగము -- ఋగ్వేదము నుండియు, గానము--సామవేదమునుండియు , ఆంగిక భాగము (శరీరముతో ప్రదర్శింపవలసినది)- యజుర్వేదము నుండియు వివిధరసములు-- అధర్వవేదమునుండియు గ్రహింపబడినవట. అందువలననే భరతముని ఈ నాట్యవేదమును పంచమవేదము అని ప్రశంసించినాడు. పశుహింసాత్మకమైన యాగములు కాంతములు (మనోహర మైనవి) కావు. కాని భావ, రాగ, తాల, ఆంగిక, సదర్థసమ్మితమైన ఈ నాట్యవేదము దర్శనీయము, రమణీయము కూడ అయినది. ''కాంతం'' అను పదమువలన ఈ అర్థము సూచితమైనది. ''నాట్యము ద్వివిధముగా శివునిచే తన శరీరమునందే విభజించి ప్రదర్శింపబడినది" అని చెప్పినదానికి వివరణము ఇది. అర్ధనారీశ్వర స్వరూపములోని కుడిభాగమైన శివుడు చేయు ఉద్ధతమైన నృత్యమునకు 'తాండవము' అని పేరు. ఎడమభాగము అయిన పార్వతి చేయు మృదు, మధుర నాట్యమునకు 'లాస్యము', అని పేరు."ప్రపంచ సృష్ట్యున్ముఖ లాస్యకాయై-- నమః శివాయై చ నమ శ్శివాయ అను ఉమామహేశ్వర స్తోత్రములో ఆదిశంకరాచార్యులవారు ఈ విషయమునే ప్రకటించినారు. లోకమునందలి జనులు భిన్నరుచి గలవారు. వారికి ఇష్టమైన విషయము లభించినపుడే, ఆ

**వకులావలికా -** (ఉపసృత్య) ఆర్య! వందే.

**గణదాసః -** భద్రే! చిరంజీవ.

**వకులావలికా -** ఆర్య! దేవీ పృచ్ఛతి 'ఉపదేశగ్రహణే నాతిక్లిశ్యతి వః శిష్యా మాలవికా' ఇతి.

**గణదాసః -** భద్రే! విజ్ఞాప్యతాం దేవీ 'పరమనిపుణా మేధావినీ చ' ఇతి.

జనులు ఆనందింతురు. కాని లౌకిక విషయములన్నియు ఏదో ఒక రుచినే కల్గియుండును. కాని నాట్యము మాత్రము ఒక్కటే శాస్త్రము అయినను అందరికి అన్నిరుచులను అందించి, సమానముగ ఆనందింపజేయును. అర్థము పై రుచిగలవారికి సదర్థమును పాటద్వారా పలికించి ఆనందమును కలిగించును. సంగీతమునందు రుచిగలవారికి గానము ద్వారాను, శారీరికసౌందర్యదర్శనమునందు రుచిగలవారికి ఆంగికముద్వారాను, రసదృష్టి గలవారికి వివిధరసములను ప్రదర్శించియు, సౌందర్యదృష్టి కలవారికి వివిధవేషధారణ వలనను ఈ ఒక్క నాట్యవేదమే అందరికి అన్ని విధముల సమారాధనమును (సంతృప్తి) ఇచ్చుచున్నది).

**వకుళావలిక:-** (సమీపించి) ఆర్యా! వందనము.

**గణదాసుడు:-** కళ్యాణీ! చిరంజీవ.

**వకుళావలిక:-** ఆర్యా! "ఉపదేశమును స్వీకరించువిషయమున మాళవిక మీకు ఎక్కువ శ్రమను కలిగించుటలేదు కదా" అని పూజ్యురాలైన ధారిణిదేవి (నా మాటల ద్వారా) అడుగుచున్నది.

**గణదాసుడు:-** కళ్యాణీ! "మాళవిక, ఉపదేశగ్రహణవిషయమునందు నిపుణురాలును మేధావంతురాలును అయినది" అని దేవికి విన్నవింతువుగాక ("పరమనిపుణా" అనగా మిక్కిలి నేర్పరి అని అర్థము. "సూక్ష్మార్థావాప్తి నిరతః ధీవ్యాపారస్తు నైపుణ్యం" మిక్కిలి సూక్ష్మములైన అర్థములను పొందుటయందు నిరంతరము ప్రయత్నించు బుద్ధివ్యాపారమే (పనియే) నైపుణ్యము, అను నిర్వచనము వలన మాళవిక తన

కిం బహునా

శ్లో॥ యద్య త్ప్రయోగ విషయే భావిక ముపదిశ్యతే మయా తస్యై।
తత్త ద్విశేషకరణాత్ ప్రత్యుపదిశతీవ మే బాలా. ॥ 5



ఆ బాల నాకే తిరిగి ఉపదేశించుచున్నదా 15

ఉపదేశముల యందలి సూక్ష్మాంశములను బాగుగా గ్రహించుచున్నది అని గణదాసు మాళవికయొక్క విద్యాభ్యాసాసక్తిని ప్రశంసించినాడు అట్లే మాళవికయొక్క మేధాశక్తిని కూడ ప్రశంసించినాడు.

'ధీర్ ధారణావతీ మేధా'' అనునది మేధాః శబ్దమునకు నిర్వచనము చదివిన, వినిన విషయములను మరిచిపోకుండ గుర్తుంచుకొను బుద్ధిశక్తియే మేధాశక్తి అని ఈ నిర్వచనమునకు అర్ధము. మాళవికయొక్క విద్యాగ్రహణనైపుణ్యమును గణదాసు చక్కగా ప్రశంసించినాడు )

వేయేల?

ప్రయోగవిషయమున యేయే భావికమును (నాట్యమునందలి భావవిశేషమును) నేను ఆమెకు ఉపదేశించుచున్నానో ఆయా భావికములను ఆమె నేను చూపించిన దానికంటె అతిశయముగా నిర్వర్తించి, ఆ బాల నాకే తిరిగి ఉపదేశించుచున్నదా అని అనిపించుచున్నది **5**

(భావికమునకు నిర్వచనము ఇది )

“అంగికాభినయప్రాయం అల్పవాచిక సాత్వికమ్ ।
భావానా మాస్పదం నృత్యం పదార్ధ వ్యంజనాత్మకమ్''॥

భావప్రధానమైన నృత్యవిశేషమే భావికము ఇందులో ఎక్కువ భాగము అంగికాభినయము ఉండును. మాటలు తక్కువ ఉండును సాత్వికగుణము కలదైఉండును. వ్యాఖ్యానము నందలి పదముల అర్థమునే వివిధ ముద్రలచేతను, కరణములచేతను వ్యక్తముచేయవలెను ఇట్టి ప్రశంస ద్వారా

**వకులావలికా -** (ఆత్మగతం) అతిక్రామంతీ మివేరావతీం ప్రేక్షే (ప్రకాశం) కృతార్థా ఇదానీం వః శిష్యా, యస్యాం గురుజన ఏవం తుష్యతి!

**గణదాసః -** భద్రే! తద్విధానా మసులభత్వాత్ పృచ్ఛామి. కుతో దేవ్యా తత్పాత్ర మానీతమ్?

**వకులావలికా -** అస్తి దేవ్యా వర్ణావరో భ్రాతా వీరసేనో నామ స భర్త్రా నర్మదాతీరే అంతపాలదుర్గే స్థాపితః. తేన శిల్పాధికారే యోగ్యే యం దారికా ఇతి భగిన్యై, దేవ్యై ఉపాయనం ప్రేషితా.

**గణదాసః -** (స్వగతం) ఆకృతివిశేషప్రత్యయాత్ ఏనాం అనూనవస్తుకాం సంభావయామి. (ప్రకాశం) భద్రే! మయాపి యశస్వినా భవితవ్యమ్. పశ్య

**శ్లో॥** **పాత్రవిశేషే న్యస్తం గుణాంతరం వ్రజతి శిల్ప మాధాతుః।**
**జలమివ సముద్రశుక్తౌ ముక్తాఫలతాం పయోధస్య॥** **6**

గణదాసు మాళవికపై తనకుగల వాత్సల్యభావమును ప్రదర్శించినాడు.)

**వకుళావలిక:-** (తనలో) ఇరావతిని (నాట్యసాధన) విషయమునందు మించుచున్నట్లు తోచుచున్నదే! (ప్రకాశముగా) గురుజనమును ఈ విధముగా సంతోషపెట్టుచున్న తమ శిష్యురాలు ఇప్పుడు ధన్యురాలైనది

**గణదాసుడు:-** భద్రా! అటువంటి వారు (మాళవిక) ధుర్లభలు కనుక అడుగుచున్నాను (అర్హురాలైన) పాత్రురాలైన ఆ మాళవికను దేవి ఎచ్చటినుండి తెచ్చినది.?

**వకుళావలిక:-** దేవి అయిన ధారిణికి వీరసేనుడు . అను ఒక కులము తక్కువ తమ్ముడు కలడు, ప్రభువుగారు అతనిని నర్మదాతీరమునందలి ,గడిదుర్గమున అధికారిగా నియమించినాడు. ఆ వీరసేనుడు తన సోదరి అగు ధారిణీదేవికి ఈ మాళవికను ''శిల్పశిక్షణమునకు యోగ్యురా''లని నిర్ణయించి, కానుకగా పంపించినాడు

**గణదాసుడు.-** (తనలో) ఈమెయొక్క విశేషాకృతిచేత "ఈ మాళవిక గొప్ప ఇంట పుట్టినబిడ్డ'' అని నేను ఊహించుచున్నాను. (ప్రకాశముగా) కళ్యాణీ! (మాళవికతోపాటు ఆమెకు పాఠము చెప్పినందు వలన) నేను కూడ కీర్తిమంతుడను కాగలను, ఎట్లనగా

మేఘమునుండి కురిసిన జలము సముద్రమునందలి ముత్యపు చిప్పలో పడి, ముత్యమైనట్లు గురువుయొక్క శిల్పము (నైపుణ్యము!) వ్యక్తివిశేషములయందు (పాత్రులయందు ఉంచబడి) గుణాతిశయమును (గొప్పతనమును) పొందును.**6**

**వకులావలికా-** ఆర్య! కుత్రేదానీం వో శిష్యా?

**గణదాసః -** ఇదానీమేవ పంచాంగాభినయ ముపదిశ్య మయా 'విశ్రమ్యతాం' ఇత్యభిహితా, దీర్ఘికావలోకన గవాక్షగతా, ప్రవాత మాసేవమానా తిష్ఠతి.

**వకులావలికా -** తేన హ్యనుజానాతు మాం అర్యః, యావ దస్యాః ఆర్యస్య పరితోషనివేదనేన ఉత్సాహం వర్ధయామి.

**గణదాసః -** దృశ్యతాం సఖీ. అహ మపి లబ్ధక్షణః స్వగృహం గచ్ఛామి.

**వకుళావలిక:-** అయ్యా! తమ శిష్యురాలు ఇప్పుడు ఎచ్చట నున్నది?

**గణదాసుడు:-** పంచాంగాభినయమును (ఒకేసారి ఐదు అవయవములతో అభినయింపవలసిన నాట్యవిశేషమును) ఉపదేశించి, "విశ్రమింపుము" అని నేను చెప్పగా, ఇప్పుడే ఆమె, క్రీడాసరోవరము కనబడునట్టి కిటికీవద్ద కూర్చుండి, చల్లగాలిని అనుభవించుచున్నది.

(పంచాంగాభినయము అనగా

"కరాభ్యాం చరణాభ్యాంచ శిరసా చాభినీయతే।

యత్ర వస్తుని విజ్ఞేయః పంచాంగాభినయో హి సః॥"

"చిత్తాక్షిభ్రూ హస్తపాదై రంగచేష్టాది సామ్యతః

గాత్రాద్యవస్థా కరణం పంచాంగాభినయో మతః" ॥

రెండు చేతులు రెండు కాళ్లు శిరస్సు అను పంచాంగములతో నాట్యము చేయుట అని కొందరు అనగా ఇంకొందరు 1 చిత్తము, 2 కన్ను, 3 కనుబొమ్మ, 4. చెయ్యి, 5 పాదములు పంచాంగములని అందురు

**వకుళావలిక:-** అయినచో (ఆమెను చూచుటకు) నన్ను అయ్యగారు అనుమతింతురు గాక! నేను గురువులైన మీ ఆనందమును, ప్రశంసను (మాళవికకు) తెలియజేసి ఆమె ఉత్సాహమును పెంపొందింతును

**గణదాసుడు:-** నీ సఖిని నీవు చూడవచ్చును. విరామము దొరికినది కనుక నేను కూడ నా ఇంటికి బయలుదేరెదను.

(ఇతి నిష్క్రాన్తౌ)

## (ఇతి మిశ్రవిష్కంభః)

(తతః ప్రవిశతి ఏకాంతస్థితపరిజనో మంత్రిణా లేఖహస్తేన అన్వాస్యమానో రాజా.)

**రాజా -** (అనువాచితలేఖ మమాత్యం విలోక్య) వాహతక! కిం స ప్రతిపద్యతే వైదర్భః?

**అమాత్యః -** దేవ! ఆత్మవినాశమ్.

**రాజా -** సందేశ మిదానీం శ్రోతు మిచ్ఛామి.

**అమాత్యః -** ఇద మిదానీ మనేన ప్రతిలిఖితమ్ "పూజ్యేనాహం ఆదిష్టః 'పితృవ్యపుత్రో భవతః కుమారో మాధవసేనః ప్రతిశ్రుతసంబంధః, మమోపాంతిక ముపాగచ్ఛ న్నంతరా త్వదీయేన అంతపాలేన అవస్కంద్య గృహీతః. స త్వయా మదపేక్షయా సకలత్ర సోదర్యో మోచయితవ్యః", ఇతి. త న్న వో న విదితం య త్తుల్యాభిజనేషు భూమిహరేషు రాజ్ఞాం వృత్తి రీదృక్. అతో ఽత్ర మధ్యస్థః పూజ్యో భవితు మర్హతి. సోదర్యా పున రస్య గ్రహణవిప్లవే వినష్టా, త దన్వేషణాయ ప్రయతిష్యే అథ అవశ్యమేవ మాధవసేనో మయా పూజ్యేన మోచయితవ్యః, శ్రూయతా మభిసంధిః.

(అని ఇద్దరు బయలుదేరెదరు )

## (ఇది మిశ్రవిష్కంభము.)

(ఒక వైపున పరిజనులు నిలిచిఉండగా, చేతిలో లేఖను పట్టుకొని మంత్రి సమీపముననే ఉండగా, రాజు ప్రవేశించును )

**రాజు:-** (లోలోననే లేఖను చదువుకొనిన మంత్రిని చూచి) వాహతకా! ఆ విదర్భరాజు (యజ్ఞసేనుడు) ఏమి తలపెట్టినాడు?

**అమాత్యుడు:-** దేవా! ఆత్మవినాశనమును!

**రాజు:-** అతడు పంపిన సందేశమును ఇప్పుడు వినగోరుచున్నాను

**అమాత్యుడు:-** ఇప్పుడు యజ్ఞసేనుడు వ్రాసిన సమాధానము ఇది "పూజ్యులైన తమరు నన్ను ఇట్లాదేశించినారు "నీ పినతండ్రి పుత్రుడైన మాధవసేనుని కుమారుడు. మాతో సంబంధముకలిగి ఉందునని మాట ఇచ్చి, మా సమీపమునకు వచ్చుచుండగా నడుమనే నీ (యజ్ఞసేనుని) గడికాపరి అయిన వీరసేనుడు అనువాడు ఎదిరించి, మాధవసేనుని నిర్బంధించినాడు. మమ్ములను చూచి, మాపైగల గౌరవముతో నీవు ఆ మాధవసేనుని భార్యతోను సోదరితోను సహా విడిపింపవలెను'' అని మరి ఒకే వంశమునందు పుట్టినవారు రాజ్యమును అపహరించునపుడు రాజుల ప్రవర్తన ఇట్లే ఉండును అని తమకు తెలయనిది కాదు కదా (రాజనీతి ఎట్లు ఉపదేశించినదో నేనును అట్లే చేసితిని ) అందువలన పూజ్యులైన తాము (అగ్నిమిత్రుడు) ఈ విషయమున (ఎవరివైపునకును మొగ్గకుండ) తటస్థులై ఉండుట ఉచితముగా ఉండును మరి

**శ్లో** **మౌర్యసచివం విముంచతి యది పూజ్యః సంయతం మమ శ్యాలమ్।**
**మోక్తా మాధవసేనం తతో ఽ హ మపి బంధనాత్ సద్యః॥ 7**
**ఇతి**

**రాజా -** (సరోషం) కథం కార్యవినిమయేన మయి వ్యవహర త్యనాత్మజ్ఞః? వాహతక! ప్రకృ త్యమిత్రః ప్రతికూలకారీచ మే వైదర్భః త ద్యాతవ్యపక్షే స్థితస్య పూర్వసంకల్పిత సమున్మూలనాయ వీరసేన ప్రముఖం దండచక్ర మాజ్ఞాపయ.

**అమాత్యః -** య దాజ్ఞాపయతి దేవః.

**రాజా -** అథవా కిం భవాన్ మన్యతే?

**అమాత్యః -** శాస్త్రదృష్ట మాహ దేవః కుతః

**శ్లో** **అచిరాధిష్ఠితరాజ్యః శత్రుః ప్రకృతి ష్వరూఢమూలత్వాత్।**
**నవసంరోపణ శిథిలః తరురివ సుకరః సముద్ధర్తుమ్॥ 8**

ఆ మాధవసేనుని చెల్లెలు ఆదాడి హడావిడిలో తప్పిపోయినది ఆమెను మీకై వెతికించుటకు ప్రయత్నింపగలను మరి పూజ్యులైన తమరు మాధవసేనుని నా నుండి విడిపింప దలచినచో దానికి షరతును చిత్తగింపుడు.

మౌర్యుల మంత్రియగు నా మరిదిని, పూజ్యులైన తమరు (అగ్నిమిత్రుడు) విడిచిపెట్టినచో అప్పుడు నేను కూడ వెంటనే మీ కాబోవు మరిదియగు మాధవసేనుని బంధనమునుండి విడిచి పెట్టగలను. 7

**రాజు -** (రోషముతో) ఏమీ? స్వసామర్ధ్యమును ఎరుగని, (విదర్భరాజైన) ఈ యజ్ఞసేనుడు నా పట్ల ఇచ్చిపుచ్చుకొను బేరముతో వ్యవహరించుచున్నాడా? వాహతకా! ఈ విదర్భరాజు మాకు సహజ శత్రువు (పైగా) ఇప్పుడు మాకు ప్రతికూలకారి, (మాకిష్టము కాని పనిని చేయువాడు) కూడ అయినాడు. కనుక మనకు ప్రతిపక్షమునందు ఉన్న ఈ యజ్ఞసేనుని పూర్వము సంకల్పించిన తీరుననే సమూలనాశనము చేయుటకై (మన సేనానాయకుడైన) వీరసేనుడు మొదలుగాగల మన సైనికమండలమును ఆజ్ఞాపింపుము.

**అమాత్యుడు :-** దేవర ఆజ్ఞాపించినట్లే

**రాజు:-** మరి మీరు ఏమనుకొనుచున్నారు?

**అమాత్యుడు :-** శాస్త్రమునందు చెప్పబడిన మాటను దేవరవారు చెప్పినారు ఏలయన

అప్పుడప్పుడే రాజ్యమునకు వచ్చిన శత్రువు, మంత్రుల, ప్రజల, మనస్సులయందు ధృఢముగా పాదుకొననందువలన క్రొత్తగా

**రాజా -** తేన హ్యవితథం తంత్రకారవచనమ్. ఇదమేవ నిమిత్త మాదాయ సముద్యోజ్యతాం సేనాపతిః.

**అమాత్యః -** తథా.

(పరిజనో యథావ్యాపారం రాజాన మభితః స్థితః)

(ప్రవిశ్య)

**విదూషకః -** ఆజ్ఞప్తోఽస్మి తత్ర భవతా రాజ్ఞా 'గౌతమ! చింతయ తావ దుపాయమ్. యథా మే' యదృచ్ఛాదృష్టప్రతికృతి ర్మాలవికా ప్రత్యక్షదర్శనా భవతి' ఇతి. మయాచ త త్తథా కృతమ్. యావ దస్మై నివేదయామి.

**రాజా -** (విదూషకం దృష్ట్వా) అయ మపరః కార్యాంతర సచివో ఽస్మా నుపస్థితః.

**విదూషకః -** (ఉపగమ్య) వర్ధతాం భవాన్.

**రాజా -** (సశిరఃకంపం) ఇత ఆస్యతామ్.

(విదూషక ఉపవిష్టః)

- నాటబడి, ధృఢత్వమును పొందని, చెట్టువలె తేలికగా వేరంట పెకలింపబడదగినవాడుగ ఉండును కదా! **8**

**రాజు:-** అయినచో నీతిశాస్త్రకారుల మాట తప్పదు. దీనినే శుభ శకునముగా స్వీకరించి, సేనాపతి (శత్రునాశనమునకు) సిద్ధమగునుగాక!

**అమాత్యుడు:-** అట్లే

(రాజునకు చుట్టు తమ తమ కర్తవ్యములకు తగినట్లు పరిజనులు నిలిచియుందురు.)

(ప్రవేశించి)

**విదూషకుడు:-** "గౌతమ! తలవని తలంపుగా చిత్రపటమునందు దర్శనమిచ్చిన మాళవిక (నాకు) ప్రత్యక్షముగా కనబడునట్టి, ఉపాయమును ఆలోచింపుము" అని పూజ్యుడైన రాజు నన్ను ఆజ్ఞాపించినాడు. నేను కూడ ఆ ఉపాయమును పన్నితిని. ఇక (ఈ విషయమును) ఆయనకు విన్నవింతును.

**రాజు:-** (విదూషకునిచూచి) కార్యాంతరములో (రాజకార్యము కాని ప్రేమ వ్యవహారములలో) నాకు సహాయకుడైన ఇతడు నన్ను సమీపించినాడు.

**విదూషకుడు:-** (సమీపించి) పూజ్యుడవు నీవు వర్ధిల్లుదువు గాక.

**రాజు:-** (తలనాడించుచు) ఇచ్చట కూర్చొనుము.

(విదూషకుడు కూర్చొనును.)

**రాజా -** అపి కచ్చి దుపేయోపాయదర్శనే వ్యాపృతం తే ప్రజ్ఞాచక్షుః?

**విదూషకః -** ప్రయోగ సిద్ధిం పృచ్ఛ.

**రాజా -** కథమివ?

**విదూషకః -** (కర్ణే) ఏవ మివ (ఇత్యావేదయతి.)

**రాజా -** సాధు వయస్య! నిపుణ ముపక్రాంతమ్. ఇదానీం దురధిగమసిద్ధా వప్యస్మి న్నారంభే వయ మాశంసా మహే. కుతః?

**శ్లో॥** **అర్థం సప్రతిబన్ధం ప్రభు రధిగన్తుం సహాయవా నేవ।**
**దృశ్యం తమసి న పశ్యతి దీపేన వినా సచక్షురపి॥ 9**

**(నేపథ్యే)**

అల మలం బహు వికథ్య. రాజ్ఞః సమక్షమేవ
ఆవయోః అధరోత్తరం వ్యక్తి ర్భవిష్యతి.

**రాజా -** (ఆకర్ణ్య) సఖే! త్వ త్సునీతిపాదపస్య ఇదం పుష్ప ముద్భిన్నమ్!

**విదూషకః -** ఫలమపి ద్రక్ష్యసి.

(తతః ప్రవిశతి కఞ్చుకీ)

**రాజు -** సాధింపదగినదానిని సాధించు విషయములో నీ ప్రజ్ఞానేత్రమును ప్రయోగించితివా?

**విదూషకుడు:** "ప్రయోగము సిద్ధించినదా" అని అడుగుము.

**రాజు -** అది ఎట్లో?

**విదూషకుడు** (చెవిలో) ఈ విధముగా (అని నివేదించును )

**రాజు:-** మేలు మిత్రమా! నేర్పుగా పనిని ప్రారంభించితివి (సాధింపదగిన వస్తువు) దుర్లభమైనదయినను ఈ ప్రయత్నమున మా కిప్పుడు (ఫలితముపై) ఆశ కలుగుచున్నది ఏల యనగా

ఇతరుల సహాయమును తీసికొనినవాడు మాత్రమే అడ్డంకులతో కూడిన ప్రయోజనమును పొందగలుగును కన్నులు కలవా డైనను దీపము లేనిదే చీకటిలో ఎవ్వడును ఏ దృశ్యమును చూడలేడు కదా! **9**

(తెరవెనుకనుండి)

చాలు, చాలు, ఎక్కువగా నీ గొప్పలను చెప్పకొనకుము రాజుగారి సమక్షముననే మన ఇరువురి హెచ్చుతగ్గులు బయటపడునులే.

**రాజు:-** (విని) స్నేహితుడా! నీ సునీతి అను వృక్షమునకు ఇదిగో పువ్వు పుట్టినది.

**విదూషకుడు:-** (త్వరలోనే) ఫలమును కూడ చూతువుగాని!

(ఆతరువాత కంచుకి ప్రవేశించును.)

**కంచుకీ -** దేవ! అమాత్యో విజ్ఞాపయతి 'అనుష్ఠితా ప్రభో రాజ్ఞా' ఇతి. ఏతౌ పునః హరదత్త గణదాసౌ.

**శ్లో॥** ఉభా వభినయాచార్యౌ పరస్పరజయైషిణౌ।
త్వాం ద్రష్టు మిచ్ఛతః సాక్షా ద్భావావివ శరీరిణౌ. 10

**రాజా -** ప్రవేశయ తౌ.

**కంచుకీ -** య దాజ్ఞాపయతి దేవః. (ఇతి నిష్క్రమ్య తాభ్యాం సహ ప్రవిశ్య)

ఇత ఇతో భవంతౌ

**హరదత్తః -** (రాజానం విలోక్య) అహో! దురాసదో రాజమహిమా!

తథాహి

**శ్లో॥** న చ న పరిచితో న చాప్యరమ్యః
చకిత ముపైమి తథాపి పార్శ్వ మస్య।
సలిలనిధిరివ ప్రతిక్షణం మే
భవతి స ఏవ నవోనవో ఽయ మక్ష్ణోః॥ 11

**గణదాసః -** మహ త్ఖలు పురుషాకార మిదం జ్యోతిః తథాహి

**శ్లో॥** ద్వారే నియుక్త పురుషానుమత ప్రవేశః
సింహాసనాంతికచరేణ సహోపసర్పన్।

**కంచుకి** ''దేవా! ప్రభువుల ఆజ్ఞ అనుష్ఠింపబడినది'' అని మంత్రిగారు విన్నవించుచున్నారు. ఇక ఇరుగో హరదత్త గణదాసులు (తమ దర్శనమునకై వేచియున్నారు )

ఈ నాట్యాచార్యులు ఇరువురును ఒకరి నొకరు జయింపగోరు వారై భావములు ప్రత్యక్షముగా శరీరములను ధరించి వచ్చుచున్నవో అన్నట్టు వచ్చి, మిమ్ము దర్శింపగోరుచున్నారు. 10

**రాజు:-** వారిని ప్రవేశపెట్టుము

**కంచుకి.-** దేవరవారు ఆజ్ఞాపించినట్లే (అని బయటకు వెళ్ళి, వారిరువురిని వెంటబెట్టుకొని, మరల ప్రవేశించి)

మీ రిరువురు ఇటు ఇటు

**హరదత్తుడు:** (రాజును చూచి) ఓహో ఈ రాజుయొక్క తేజస్సు దరిచేరరానట్లు ఉన్నది కదా!

ఇదుగో

(ఈ రాజు) నాకు అపరిచితుడు కాడు అసుందరుడునూ కాడు. అయినను ఇతని వద్దకు బెదురుచునే సమీపించుచున్నాను. ఇతడు నాకు ఎంత పరిచితుడైనను నా కన్నులకు ఈయన సముద్రుని వలె ప్రతిక్షణము క్రొత్తక్రొత్తగా తోచుచున్నాడు 11

**గణదాసుడు.-** ఈ రాజు పురుషాకారములో ఉన్న గొప్ప జ్యోతి అని నాకు అనిపించుచున్నాడు అందువలననే

ద్వారము వద్ద నియమింపబడిన పురుషునిచేత (ప్రతిహారి చేత) లోనికి వెళ్ళుటకు అనుమతింపబడి, రాజుయొక్క సింహాసనమునకు దగ్గరగా ఉండు మరియొక పురుషునితో కలిసి

**తేజోభి రస్య వినివర్తిత దృష్టిపాతైః**
**వాక్యా ద్ధృతే పున రివ ప్రతివారితో ఽస్మి॥ 12**

**కంచుకీ -** ఏష దేవః. ఉపసర్పతాం భవన్తౌ.

**ఉభౌ -** (ఉపేత్య) విజయతాం దేవః.

**రాజా -** స్వాగతం భవద్భ్యాం. (పరిజనం విలోక్య) ఆసనే తావ దత్రభవతోః.

(ఉభౌ పరిజనోపనీతయోః ఆసనయో రుపవిష్టౌ)

**రాజా -** కి మిదమ్? శిష్యోపదేశకాలే యుగప దాచార్యయోః అత్రోపస్థానమ్.

**గణదాసః -** దేవ! శ్రూయతామ్. మయా సుతీర్థా దభినయవిద్యా శిక్షితా. దత్తప్రయోగ శ్చాస్మి. దేవేన దేవ్యా చ పరిగృహీతః

**రాజా -** బాఢం. జానే. తతః కిమ్?

**గణదాసః -** సో ఽహ మమునా హరదత్తేన ప్రధానపురుష సమక్షం 'నాయం మే పాదరజసాపి తుల్యః' ఇ త్యధిక్షిప్తః.

**హరదత్తః -** దేవ! అయ మేవ ప్రథమం పరివాదకరః. 'అత్రభవతః కిల మమ చ సముద్రపల్వలయో రివాంతరం' ఇతి.

రాజువద్దకు సమీపించుచు, కన్నులను మిర్మిట్లు కొలిపించు ఈ రాజుయొక్క మహాతేజస్సుచెత మాటల అవసరము లేకుండగనే మరల నా ప్రవేశము నివారింపబడినదో అన్న ట్లున్నది ఇప్పటి నా పరిస్థితి **12**

**కంచుకి** ఇరుగో ప్రభువులవారు మీ రిరువురు ఇక వారిని సమీపింతురు గాక

**ఇరువురు-** (సమీపించి) దేవరకు జయము. జయము.

**రాజు:** మీ ఇరువురకు స్వాగతము (పరిజనమును చూచి) ఈ పూజ్యు లిరువురకు ఆసనములు (తెండు )

(పరిజనము తెచ్చిన ఆసనములలో ఇరువురును కూర్చుందురు )

**రాజు-** ఇది ఏమి? శిష్యులకు ఉపదేశింపవలసిన సమయములో ఆచార్యు లిరువురు ఒక్కమారే ఇటు వచ్చినారు!

**గణదాసుడు -** దేవా! అవధరింపుడు నేను నాట్యశాస్త్రమును సుప్రసిద్ధుడైన గురువు వద్ద నేర్చితిని. శిష్యులకు నేర్పితిని కూడా. దేవరచేతను, దేవిచేతను స్వీకరింపబడితిని

**రాజు:-** అవును నా కీ విషయము (బాగుగా) తెలియును. ఇప్పుడు ఏమైనది?

**గణదాసుడు.-** అట్టి నేను, పెద్దల సమక్షమునందు, ఈ హరదత్తుని చేత "ఇతడు (ఈ గణదాసు) నా (హరదత్తునియొక్క) పాదధూళికి కూడా సాటి రాడు" అని అధిక్షేపింపబడితిని

**హరదత్తుడు -** దేవా! ఇతడే (గణదాసే) ముంచుగా తగువునకు దిగినాడు "సముద్రమునకును, నీటిగుంటకును ఉన్నంత భేదము

త దత్రభవాన్ ఇమం మాం చ శాస్త్రే, ప్రయోగే చ విమృశతు. దేవ ఏవ నౌ విశేషజ్ఞః ప్రాశ్నికః.

**విదూషకః -** సమర్థం ప్రతిజ్ఞాతమ్.

**గణదాసః -** ప్రథమః కల్పః. అవహితో దేవః శ్రోతు మర్హతి.

**రాజా -** తిష్ఠతు తావత్. పక్షపాత మత్ర దేవీ మన్యతే. త దస్యాః పండిత కౌశికీసహితాయాః సమక్షమేవ న్యాయ్యో వ్యవహారః.

**విదూషకః -** సుష్ఠు భవాన్ భణతి.

**ఉభౌ -** య ద్దేవాయ రోచతే.

**రాజా -** మౌద్గల్య! అముం ప్రస్తావం నివేద్య పండిత కౌశిక్యా సార్ధ మాహూయతాం దేవీ

**కంఞ్చుకీ -** యదాజ్ఞాపయతి దేవః (ఇతి నిష్క్రమ్య సపరివ్రాజికయా దేవ్యాసహ పునః ప్రవిశ్య) ఇత ఇతో భవతీ.

**దేవీ -** (పరివ్రాజికాం విలోక్య) భగవతి! హరదత్తస్య గణదాసస్య చ సంరంభం కథం పశ్యసి?

ఈయనకు (గణదాసునకును) నాకును (హరదత్తునకును) కలదు సుమా" అని నిందించినాడు కావున పూజ్యులైన తమరే ఈయనను, నన్నును శాస్త్రవిషయమునందును, ప్రయోగము నందును పరీక్షింతురుగాక! దేవరవారే మా ఇరువుర విద్యావిశేషమును తెలిసికొనగల పరీక్షాధికారులు.

**విదూషకుడు.-** ఇది సామర్థ్యమునకు యోగ్యమైన ప్రతిజ్ఞ

**గణదాసుడు·-** ఇది ఉత్తమమైన సూచన దేవరవారు శ్రద్ధగా వినవలెను

**రాజు:-** అది అట్లుండనిండు. ఈ విషయమున (నేనే నిర్ణయము చెప్పినచో) అది పక్షపాతనిర్ణయమని దేవి శంకింపవచ్చును. కనుక పండిత కౌశికీసహితఐన రాణిగారి సమక్షముననే తీర్పు జరుగుట న్యాయమై ఉండును.

**విదూషకుడు.-** తాము చక్కగా సెలవిచ్చినారు.

**ఇరువురు·-** దేవరవారి కిష్టమైనట్లే

**రాజు.-** మౌద్గల్యుడా! ఈ ప్రసంగమును నివేదించి, పండితకౌశికితో బాటు దేవిని పిలుచుకొని రమ్ము

**కంచుకి:** దేవరవారు ఆజ్ఞాపించినట్లే (అని నిష్క్రమించి, పరివ్రాజికతో కూడి వచ్చుచున్న దేవితో మరల ప్రవేశించి) దేవిగారు ఇటు

**దేవి:-** (పరివ్రాజికను చూచి) భగవతీ! హరదత్త గణదాసుల ఈ సంరంభము నీ కెట్లు తోచుచున్నది? ([illegible] ఎవ్వరో కావలెనని పెట్టిరి కాని, [illegible] ధారిణీదేవి అనుమానము)

**పరివ్రాజికా -** అలం స్వపక్షావసాదశంకయా. న పరిహీయతే ప్రతి ద్వంద్వితో గణదాసః.

**దేవీ -** యద్య ప్యేవం, తథాపి రాజపరిగ్రహో ఽస్య ప్రభుత్వ ముపహరతి.

**పరివ్రాజికా -** అధి రాజ్ఞీశబ్ద భాజన మాత్మాన మపి తావత్ చింతయతు భవతీ. పశ్య

**శ్లో॥** **అతిమాత్రభాసురత్వం పుష్యతి భానోః పరిగ్రహా దనలః।**
**అధిగచ్ఛతి మహిమానం చంద్రో ఽపి నిశాపరిగృహీతః॥ 13**

**విదూషకః -** అవిహా. అవిహా. ఉపస్థితా దేవీ పీఠమర్దికాం పండితకౌశికీం పురస్కృత్య తత్రభవతీ ధారిణీ

**రాజా -** పశ్యా మ్యేనాం. యైషా

**శ్లో॥** **మంగళాలంకృతా భాతి కౌశిక్యా యతివేషయా।**
**త్రయీ విగ్రహవత్యేవ సమ మధ్యాత్మవిద్యయా॥14**

**పరివ్రాజిక:-** నీ పక్షము ఓడిపోవునని శంకింపకుము ప్రతిపక్షికంటె గణదాసుడు (ఎందులోను) తీసిపోడు.

**దేవి.-** అట్లే అయినను, అతనికి (హరదత్తునకు) రాజాదరణము, ఆధిక్యమును తెచ్చి పెట్టును కదా!

**పరివ్రాజిక:-** (మీరేమి తక్కువవారా?) మహారాజ్ఞీ శబ్దమునకు యోగ్యురాలైన మీ (గొప్పతనమును) గూర్చికూడ కొంచెము ఆలోచించుడు చూడుడు

సూర్యుని ఆదరమువలన అగ్ని మిక్కిలి ప్రకాశమును పొందును అట్లే చంద్రుడు కూడ రాత్రియొక్క ఆదరమువలన మహిమను పొందును **13**

**విదూషకుడు-** ఆహా! పీఠమర్దిక (తార్పుడుకత్తె) ఐన పండిత కౌశికిని ముందుంచుకొని, పూజ్యురాలైన ధారిణీదేవి (నిన్ను) చేరవచ్చినది.

**రాజు.-** ఈమెను చూచున్నాను (పరివ్రాజికతో కూడిన) ఈమె (దేవి)

మంగళాలంకృతయైె యతివేషధారిణియగు ఆర్యకౌశికితో (పరివ్రాజికతో) కూడి వచ్చుచున్న ఈ దేవి, అధ్యాత్మవిద్యతో కూడిన, తూపుదాల్చిన, వేదవిద్యయా? అన్నట్లు వెలుగు చున్నది **14**

(మంగళాలంకరణము గృహిణి లక్షణము యతివేషము పరివ్రాజిక లక్షణము. ఇచ్చట. గృహిణి అయిన. ధారిణీదేవి కర్మప్రధానమైన వేదవిద్యగా ప్రతిపాదింపబడినది పరివ్రాజిక యైన కౌశికి జ్ఞానప్రధానమైన వేదాంతవిద్యగా ప్రతిపాదింప బడినది రాజుకు ధారిణీదేవి పైగల గౌరవమే అతనిచే ఆమె వేదవిద్య ఏమో అని ఊహింపజేసినది ఈ శ్లోకమునందు

**పరివ్రాజికా -** (ఉపేత్య) విజయతాం దేవః!

**రాజా -** భగవతి! అభివాదయే.

**పరివ్రాజికా -**

శ్లో॥ మహాసారప్రసవయోః సదృశక్షమయో ర్ద్వయోః।
ధారిణీ భూతధారిణ్యోః భవ భర్తా శరచ్ఛతమ్॥ 15



ధారిణీ భూతధారిణ్యోః భవ భర్తా శరచ్ఛతమ్ (1 15)

ఉత్ప్రేక్షాలంకార మున్నది. కౌశికి నిజమునకు పరివ్రాజిక కాదు. అయిదవ అంకములో ఆమెయొక్క స్వరూపము ప్రకటింప బడును. అందువలననే ఆ విషయమును ముందుగనే తెలిసికొనిన రాజు రాణితో కలిసి వచ్చుచున్న పరివ్రాజికను "యతివేషము=సన్యాసివేషమును వేసికొని వచ్చుచున్న" దనును.)

**పరివ్రాజిక:-** (సమీపించి) దేవరకు జయ మగుగాక!

**రాజు:-** భగవతీ! నమస్కరించుచున్నాను.

**పరివ్రాజిక:-** మహాసారమును ప్రసవించు నట్టివారును, సమానమైన క్షమాగుణము కలవారును అగు 1. ధారిణీదేవి, 2. భూతధారిణీదేవి (భూమి) అను ఇద్దరు స్త్రీలకు భర్తవై నూరేళ్ళు వర్ధిల్లుము. 15

("దారిణీ భూతధారిణీ" పదములకు (శ్లేషాలాంకార సామర్ధ్యమువలన) రెండేసి అర్థములను చెప్పి, ఇరువురు భేధభావము లేక ఒక్కరుగనే కలసిఉందు రను చక్కని భావమును కవి ఇచ్చట ప్రదర్శించినాడు. "మహాసార" శబ్దమునకు ధారిణీదేవి పరముగా 1. గొప్పబలముకల వసుమిత్రుడు అను కుమారుని కన్నది అని అర్థము. 2. భూతధారిణీ పరముగ మహాభూసారములైన మణులను కన్నది (రత్నగర్భ) అని అర్థము అట్లే "సదృశక్షమ" అన్న పదమునకు ధారిణీదేవి పరముగా భూదేవి అంతటి ఓర్పుకలది అని అర్థము భూతధారిణీ పరముగా సర్వమును సహించు భూదేవి అని అర్థము.)

**ధారిణీ -** జయతు జయ త్వార్యపుత్రః

**రాజా -** స్వాగతం దేవ్యై (పరివ్రాజికాం విలోక్య) భగవతి! క్రియతా మాసనపరిగ్రహః.

(సర్వే ఉపవిశన్తి.)

**రాజా -** భగవతి! అత్రభవతోః హరదత్త గణాదాసయోః పరస్పర విజ్ఞాన సంఘర్షిణోః భగవత్యా ప్రాశ్నికపద మధ్యాసితవ్యమ్.

**పరివ్రాజికా -** (సస్మితం) అల ముపాలంభేన పత్తనే సతి గ్రామే రత్న పరీక్షా?

**రాజా -** మా మైవమ్. పండిత కౌశికీ ఖలు భగవతీ. పక్షపాతినా వనయోః అహం దేవీ చ.

**ఉభౌ -** సమ్య గాహ దేవః. మధ్యస్థా భగవతీ నౌ గుణదోషతః పరిచ్ఛేత్తు మర్హతి.

**రాజా -** తేన హి ప్రస్తూయతాం వివాదః

**పరివ్రాజికా -** దేవ! ప్రయోగ ప్రధానం హి నాట్యశాస్త్రం కి మత్ర వాగ్వ్యవహారేణ?

**రాజా -** కథం వా దేవీ మన్యతే?

**ధారిణీ -** యది మాం పృచ్ఛసి త దేతయోః వివాద ఏవ న మే రోచతే.

**ధారిణి -** ఆర్యపుత్రులకు జయ మగుగాక

**రాజు.** దేవిగారికి స్వాగతము (పరివ్రాజికను చూచి) పూజ్యురాలా! ఆసనము నలంకరింపుము

(అందఱు కూర్చుందురు )

**రాజు -** భగవతీ! .విజ్ఞాన విషయుమున పరస్పరము పోటీపడి వివదించుకొనుచున్న , పూజ్యులైన ఈ హరదత్తగణ దాసులకు ప్రశ్నాధికారి పదవిని, (న్యాయమూర్తిగా ఉండు పదవిని) స్వీకరింపుము

**పరివ్రాజిక -** (చిరునవ్వుతో) పరిహాసము చాలును పట్టణ ముండగా రత్నపరీక్షను పల్లెయందు చేయింతురా?

**రాజు:-** కాదు అట్లుకాదు పూజ్యురాలైన మీరు పండిత కౌశికి కదా! పైగా దేవియును, నేనును, వీరిఎడ పక్షపాతము కలవారము

**ఇద్దరు -** దేవరవారు సముచితముగా మాట్లాడినారు. గుణదోషమును బట్టి ఈ భగవతి మధ్యస్థురాలై, మా మా పాండిత్యమును నిర్ణయింప నర్హురాలు

**రాజు:** అట్లయినచో మీ వివాదమును ప్రస్తావింపుడు

**పరివ్రాజిక -** దేవా! నాట్యశాస్త్రమునందు ప్రయోగమే ప్రధానము కదా!

వాగ్వాదముతో పని ఏమి?

**రాజు -** దేవిగా రేమనుకొనుచున్నారు ?

**ధారిణి:-** న న్నడిగినచో ఈ ఇరువురు వాదించుకొనుటే నా కిష్టము లేదు

**గణదాసః -** దేవి! న మాం సమానవిద్యతః పరిభవనీయం మవగంతుం అర్హసి.

**విదూషకః -** భవతి! పశ్యామః ఉరభ్రసంపాతమ్. కిం ముధ వేతనదానేన?

**ధారిణీ -** నను కలహప్రియో ఽసి.

**విదూషకః -** మైవమ్. అన్యోన్య కలహితయోః మత్తహస్తినోః ఏకతరస్మి న్ననిర్జితే కుత ఉపశమః?

**రాజా -** నను స్వాంగసౌష్ఠవాభినయ ముభయోః దృష్టవతీ భగవతీ.

**పరివ్రాజికా -** అథకిమ్?

**రాజా -** తదిదానీం అతఃపరం కి మాభ్యాం ప్రత్యాయ యితవ్యమ్?

**పరివ్రాజికా -** (సస్మితం) తదేవ వక్తుకామా ఽస్మి.

**శ్లో॥** **శిష్టాక్రియా కస్యచి దాత్మసంస్థా**
**సంక్రాంతి రన్యస్య విశేషయుక్తా।**
**య స్యోభయం సాధు స శిక్షకాణాం**
**ధురి ప్రతిష్ఠాపయితవ్య ఏవ॥ 16**

**విదూషకః -** శ్రుతం ఆర్యాభ్యాం భగవత్యా వచనమ్. ఏష పిండితార్థః. ఉపదేశ దర్శనా న్నిర్ణయః ఇతి.

**గణదాసుడు.-** దేవీ! నవమానవిద్యగల ఈ రెండవ ఆచార్యునివలన అవమానింపదగిన వానినిగా తలపకుడు

**విదూషకుడు.-** సరే కానిండు ఈ పొట్టేళ్ళ కుమ్ములాటను చూచెదము గాక! వీరికి ఊరికే జీత మిచ్చి పోషించు టెందుకు?

**ధారిణి:-** నీవు కలహప్రియుడవు కదా!

**విదూషకుడు-** అట్లుకాదు. ఒండొంటితో కలహించుకొను మదపుటేనుగులలో ఏదో ఒకటి ఓడిపోనిదే శాంతి ఎక్కడిది?

**రాజు:-** ఈ ఇరువురి స్వాంగసౌష్ఠవాభినయమును భగవతి (ఇదివరకే) చూచినది కదా!

**పరివ్రాజిక.-** మఱియేమి?

**రాజు:-** కనుక వీరింతకంటె (ఎక్కువగా) ఏమి ప్రదర్శించి నమ్మింప గలరు?

**పరివ్రాజిక:-** (నవ్వుచు) దానినే చెప్పగోరుచున్నాను.

ఒకనికి శాస్త్రజ్ఞానము తనవరకు మాత్రమే పరిమితమై, విశిష్టముగా నుండును మరొకనివద్ద శాస్త్రబోధనపద్ధతి విశేష యుక్తముగా నుండును, 1. శాస్త్రజ్ఞానమును 2. శాస్త్రబోధనపద్ధతి కూడ ఏ ఒక్కనివద్దనే బాగుగ ఉండునో అతడే శిక్షకులలో (గురువులలో) ఉత్తముడు. అతడే అగ్రగణ్యుడు అగును. **16**

**విదూషకుడు:-** పూజ్యులైన మీ ఇరువురును భగవతి యొక్క వచనమును వింటిరికదా! "ఉపదేశదర్శనమువలననే (తారతమ్య) నిర్ణయము జరుగుననునదే భగవతి మాటయొక్క సారాంశము.

**హరదత్తః -** పర మభిమతం నః.

**గణదాసః -** దేవి! ఏవం స్థితమ్

**ధారిణీ -** యదా పున ర్మందమేధా శిష్యా ఉపదేశం మలినయతి. తదానీ మాచార్యస్య దోషః?

**రాజా -** దేవి! ఏవ ముపపద్యతే. వినేతు రద్రవ్య పరిగ్రహో ఒపి బుద్ధిలాఘవం ప్రకాశయతి.

**ధారిణీ -** (స్వగతం) కథ మిదానీమ్? (గణదాసం విలోక్య జనాంతికం) అల మార్యపుత్ర స్యోత్సాహకారణం మనోరథం పూరయిత్వా। (ప్రకాశం) విరమ నిరర్థకా దారంభాత్.

**విదూషకః -** సుష్ఠు భవతీ భణతి. భో గణదాస! సంగీతకాపదేశేన సరస్వత్యుపాయనమోదకాని ఖాదతః కిం తే సులభనిగ్రహేణ వివాదేన?

**గణదాసః -** సత్యం. అయ మేవార్థో దేవీ వచనస్య. శ్రూయతాం అవసర ప్రాప్త మిదమ్.

**శ్లో॥ లబ్ధాస్పదో ఒస్మీతి వివాదభీరోః**
**తితిక్షమాణస్య పరేణ నిన్దామ్।**
**య స్యాగమః కేవల జీవికాయై**
**తం జ్ఞానపణ్యం వణిజం వదన్తి॥** **17**

**హరదత్తుడు** (ఈ పద్ధతి) మాకు మిక్కిలి ఇష్టము

**గణదాసుడు -** దేవీ! పరిస్థితి ఇట్లయి కూర్చున్నది!

**దారిణి -** ఒక వేళ మరి శిష్యురాలు మందబుద్ధియై గురూపదేశమును మలినపరిచినచో అప్పు డా దోషము ఆచార్యున కంటునాఏమి?

**రాజు -** దేవీ! నీవు అనుమానించి నట్లు కూడ జరుగవచ్చును అయోగ్యురాలిని శిష్యురాలుగా స్వీరించుటకూడ ఆచార్యుని తెలివితక్కువతనమునే ప్రకటించును

**దారిణి -** (తనలో) ఇప్పుడేమి చేయువలెను? (గణదాసును చూచి, జనాంతికముగా) ఆర్యపుత్రునకు ఉత్సాహకారణమైన ఈ కోర్కెను తీర్పకూడదు (ప్రకాశముగా) నిరర్థకమైన ఈ ప్రయత్నమును మానుము.

**దూషకుడు:-** పూజ్యురాలైన రాణి చక్కగా చెప్పినది ఓ గణదాసా! సంగీతపు నెపముతో సరస్వతీదేవికి నివేదించిన మోదకములను తినునట్టి నీకు, సులభముగ ఓడిపోవు ఈ వివాదముతో పనిఏమి?

**గణదాసుడు -** నిజము రాణిగారి మాటకు అర్ధము ఇదియే! అవసరప్రాప్తమై (సందర్భవశమున) వచ్చిన ఈ మాటను వినుము

''నేను కీర్తిప్రతిష్ఠలను గడించితిని'' అనుకొనుచు (తన ప్రజ్ఞాపాటవమును ప్రదర్శించుటకై ఏర్పరచిన పోటీలో) శాస్త్రచర్చలో పాల్గొనుటకు భయపడుచు, ఇతరులు వేసిన నిందను సహించి ఊరుకొనుచు, కేవలము జీవయాత్రకొఱకే విద్య నభ్యసించిన వానిని (పండితులు పెద్దలు) విద్యతో వ్యాపారముచేయు వర్తకునిగా పేర్కొనుచుందురు. (గణదాసు

**ధారిణీ -** అచిరోపనీతా తే శిష్యా. త దపరినిష్ఠితస్య ఉపదేశస్య అన్యాయ్యం ప్రదర్శనమ్.

**గణదాసః -** అత ఏవ మే నిర్బంధః.

**ధారిణీ -** తేన హి ద్వావపి భగవత్యై ఉపదేశం దర్శయతమ్

**పరివ్రాజికా -** దేవి! నైత న్న్యాయ్యమ్. సర్వజ్ఞస్యా ప్యేకాకిన నిర్ణయాభ్యుపగమో దోషాయ.

**ధారిణీ -** (జనాంతికం) మూఢే! మాం జాగ్రతీమపి సుప్తా మివ కరోషి.

(ఇతి సాసూయం పరావర్తతే)

(రాజా దేవీం పరివ్రాజికాయై దర్శయతి)

**పరివ్రాజికా -** (విలోక్య)

**శ్లో** **అనిమిత్త మిందువదనే! కి మత్రభవతః పరాఙ్ముఖీ భవసి**
**ప్రభవన్త్యో ఽపి భర్తృషు కారణకోపాః కుటుంబిన్యః॥ 18**

నాట్యమును వేదమను భావనతో చదువుటవలన విదూషకునిచే 'జ్ఞానపణ్యవణిజుడు' అని వేళాకోళము చేయబడి, మిక్కిలి బాధపడుచు వివాదమున కనుమతింపని రాణికి, అంగీకరింపు మను సూచనను వ్యంగ్యముగా ఈ శ్లోకము ద్వారా చేసినాడు.) **17**

**ధారిణి:-** నీ శిష్యురాలు కొద్దికాలమునుండియే నాట్యాభ్యాసము నారంభించినది కదా! కనుక అసంపూర్ణమైన, (అనుభవ రహితమైన) ప్రదర్శనము నిచ్చుట అన్యాయము.

**గణదాసుడు:-** కావుననే (వివాదవిషయమున) నా పట్టుదల.

**ధారిణి:-** అట్లయినచో (ఆచార్యులైన) మీ ఇరువురును మీ మీ పాండిత్యప్రకర్షను భగవతియగు ఆర్యకౌశికికి ప్రదర్శింపుడు.

**పరివ్రాజిక:-** దేవీ! ఇది న్యాయముకాదు. ఎంతటి సర్వజ్ఞున కైనను ఒంటరిగా న్యాయనిర్ణయాధికారము నందుట దోషకారణ మగును.

**ధారిణి:-** (జనాంతికముగా) మూఢురాలా! మేల్కొనియున్న నన్ను నిద్రించిన దానినిగా చేయుచున్నావు.

(అని అసూయతో పెడమొగము పెట్టును.)

(రాజు దేవిని పరివ్రాజికకు చూపించును.)

(చూచి)

**పరివ్రాజిక:-** ఓ ఇందువదనా! అకారణముగా ఈ పూజ్యుడైన మహారాజునకు ఎందుకు పరాఙ్ముఖివి అగుచున్నావు? ఎంతటి అధికారము కలిగియున్నను, ఇల్లాండ్రు కారణమున్నప్పుడే భర్తల ఎడ కోపవతు లగుదురు. **18**

**విదూషకః -** నను సకారణమేవ! ఆత్మనః పక్షో రక్షితవ్య ఇతి. (గణదాసం విలోక్య) నను దిష్ట్యా కోపవ్యాజేన దేవ్యా పరిత్రాతో భవాన్ న ఖలు సుశిక్షితో ఽపి సర్వః ఉపదేశదర్శనే నిష్ణాతో భవతి.

**గణదాసః -** దేవి! శ్రూయతామ్. ఏవం జనో గృహ్ణాతి. త దిదానీమ్.

**శ్లో** **వివాదే దర్శయిష్యామి క్రియాసంక్రాంతి మాత్మనః।**
**యది మాం నానుజానాసి పరిత్యక్తో ఽస్మ్యహం త్వయా॥19**

(ఆసనా దుత్థాతు మిచ్ఛతి )

**ధారిణీ -** (స్వగతం) కా గతిః? (ప్రకాశం) ప్రభవ త్యాచార్యః శిష్య జనస్య.

**గణదాసః -** చిర మపదే శంకితో ఽస్మి. (రాజాన మవలోక్య) అనుజ్ఞాతం దేవ్యా త దాజ్ఞాపయతు దేవః కతమస్మి న్నభినేయవస్తుని ఉపదేశం దర్శయిష్యామి?

**రాజా -** యత్రాదిశతి భగవతీ.

**పరివ్రాజికా -** కిమపి దేవ్యా మనసి వర్తతే తతః శంకితా ఽస్మి.

**ధారిణీ -** భణ విస్రబ్ధమ్. ప్రభవిష్యామి ఆత్మనః పరిజనస్య.

**విదూషకుడు.-** (ఆమె కోపము) సకారణమే సుమా! తన పక్షమును కాపాడుకొనవలెను కదా! (గణదాసును చూచి) (గణదాసా!) నీ అదృష్టవశమున కోపపువంకతో (దేవిచేత) నీవు రక్షింపబడితివి సుమా! ఎవ డెంతటి సుశిక్షితుడైనను, ప్రతివాడు తన ఉపదేశమును ప్రదర్శించుటయందు నిపుణుడుకాజాలడు కదా!

**గణదాసుడు -** దేవీ! వినుము. లోక మిట్లే భావించును. కనుక ఇప్పుడు

నేనీ! (పరీక్ష) వివాదమునందు నా విద్యోపదేశమును ప్రదర్శింతును, నీవు న న్ననుమతింపనిచో నన్ను విడిచివైచినట్లే (ఉద్యోగము నుండి విరమింతు నని భావము.) **19**

(ఆసనము నుండి లేవగోరును )

**దారిణి:** (తనలో) (ఇప్పుడు నా) గతియేమి? (ప్రకాశముగా) శిష్యజనుల వ్యవహారవిషయమునందు ఆచార్యుడే సర్వాధికారి

**గణదాసుడు:-** ఇంతవరకు తగని ప్రదేశమునందు అనుమానించితిని (రాజును చూచి) రాణిగారు అనుమతించినారు. కనుక ఏలినవారు ఆజ్ఞాపింపుడు విషయముగా ఏ వస్తువును గ్రహించి, నా అభినయోపదేశమును (ప్రదర్శింపదగిన విషయమును) ప్రదర్శింతును?

**రాజు -** భగవతి ఆదేశించిన విషయమునందు.

**పరివ్రాజిక-** దేవిగారి చిత్తమునందు ఏదో ఉన్నది అందువలన (అడుగుటకు) సందేహించుచున్నాను

**దారిణి:** నిస్సందేహముగా చెప్పుము. నా పరిజనము పై నా కధికార మున్నది కదా!

**రాజా -** మమచేతి బ్రూహి

**ధారిణీ -** భగవతి! భణేదానీమ్.

**పరివ్రాజికా -** దేవ! శర్మిష్ఠాయాః కృతిం చతుష్పదోద్భవం ఛలితం దుష్ప్రయోజ్య ముదాహరన్తి. తత్రైకార్థ సంశ్రయ ముభయోః ప్రయోగం పశ్యామః తావతా జ్ఞాయత ఏవాత్రభవతోః ఉపదేశాన్తరమ్.

**ఆచార్యౌ -** య దాజ్ఞాపయతి భగవతీ.

**విదూషకః -** తేన హి ద్వావపి వర్గౌ ప్రేక్షాగారే సంగీతరచనాం కృత్వా, అత్రభవతః దూతం ప్రేషయతమ్, అథవా మృదంగశబ్ద ఏవ నః ఉత్థాపయిష్యతి.

**రాజు:** `నా మీద కూడ అని చెప్పుము

**ధారిణి.-** బగవతీ! ఇప్పుడు చెప్పుము

**పరివ్రాజిక** దేవా! శర్మిష్ఠ రచించిన, నాల్గుపాదములు కల, "చలిత"మను నాట్యమును ప్రయోగించుట కష్టమని పెద్ద లందురు కనుక ఈ ఇరువురు ఆచార్యులయొక్క ప్రయోగమును ఒకే అర్ధమునందు ఛలితరూపమున అభినయింపజేసి, తిలకింతము అంతమాత్రము చేతనే ఈ ఇరువురు పూజ్యుల ఉపదేశములయందలి తారతమ్యము తెలియవచ్చును. (యయాతి భార్యలలో పెద్దది దేవయాని, చిన్నది శర్మిష్ఠ ఆమె యయాతిని ఒప్పించి, ఆయనకు భార్య అయిన ప్రేమసన్నివేశము మాళవికాగ్నిమిత్రుల ప్రేమకు సంకేతమైనది. కనుక ఆ సన్నివేశమె నాట్యపరీక్షకు అంశమైనది చతుష్పదం అను పదమునకు 1 నాల్గుపదములు కలది 2 నాల్గుచరణములు కలది అని అర్ధము మాళవిక చతుష్పద ప్రయోగమునే అభ్యసించుచున్నది. ఇరావతి నేర్చినదో లేదో తెలియదు కనుక మాళవికను గెలిపించుటకే ఈ అంశమున పరీక్ష జరిగినది )

**ఇద్దరు ఆచార్యులు.-** భగవతి ఆజ్ఞాపించినట్లే

**విదూషకుడు:-** అట్లయినచో `ఇరుపక్షముల వారును ప్రదర్శనమును దర్శించు స్ధలమునందు (రంగస్ధలమునందు) సంగీతరచనను (సహకార వాద్యములను ఏర్పరచుకొని) గావించి, ఈ పూజ్యునకు (రాజునకు) దూతద్వారా కబురు

**హరదత్తః -** తథా (ఇ త్యుత్తిష్ఠతి)

(గణదాసః ధారిణీం అవలోకయతి.)

**ధారిణీ -** (గణదాసం విలోక్య) న హి విజయ ప్రత్యర్థినీ అహ మార్యస్య. విజయీ భవ!

(ఆచార్యౌ ప్రస్థితౌ.)

**పరివ్రాజికా -** ఇత స్తావ దాచార్యౌ.

**ఉభౌ -** (పరివృత్య) ఇమౌ స్వః.

**పరివ్రాజికా -** నిర్ణయాధికారే బ్రవీమి. సర్వాంగసౌష్ఠవాభివ్యక్తయే విరల నేపథ్యయోః పాత్రయోః ప్రవేశో உస్తు.

**ఉభౌ -** నే దమ ప్యావయో రుపదేశ్యమ్. (ఇతి నిష్క్రాన్తౌ.)

**ధారిణీ -** (రాజాన మవలోక్య) యది రాజకార్యే ష్వ పీదృశ్యుపాయ నిపుణతా ఆర్యపుత్రస్య తతః శోభనం భవేత్.

**రాజా -** దేవి!

పంపుడు, లేదా మీ (ప్రదర్శనారంభ సూచకమగు) మృదంగశబ్దమే మమ్ము బయలుదేరదీయును

**హరదత్తుడు:-** అట్లే (ఆసనమునుండి లేచును )

(గణదాసు ధారిణి ముఖములోనికి చూచును )

**దారిణి:-** (గణదాసు వైపునకు చూచి) నేను ఆర్యుని విజయమునకు వ్యతిరేకు రాలినికాదు విజయము నందుకొనుము.

(ఆచార్యులిరువురు బయలుదేరుదురు.)

**పరివ్రాజిక:-** ఆచార్యు లిరువురు ఒకసారి ఇటు (వత్తురుగాక.)

**ఇద్దరు:-** (వెనుకకు తిరిగి) ఇదుగో (మీ ఎదుట) ఉన్నాము.

**పరివ్రాజిక:-** నిర్ణయాధికారమున నుండి చెప్పుచున్నాను (పోటీలలో పాల్గొను వ్యక్తుల) సర్వావయవములసౌష్ఠవము బాగుగా వ్యక్తమగుటకై మిక్కిలి తక్కువ అలంకరణములతో ఆయా పాత్రలు రంగప్రవేశమును చేయవలెను.

**ఇద్దరు:-** ఈ (చిన్న) విషయమును కూడ మా ఇరువురకు గుర్తు చేయవలసిన పని లేదు. (అని ఇరువురు బయలు దేరుదురు.)

**ధారిణి:-** (రాజును చూచి) ఆర్యపుత్రులకు రాజకార్య విషయముల యందు కూడ ఇటువంటి ఉపాయనిపుణత ఉన్నచో ఎంతో బాగుండెడిది.

**రాజు:-** దేవీ!

177. శ్లో॥ అల మన్యథా గృహీత్వా న ఖలు మనస్విని మయా ప్రయుక్త మిదమ్।
ప్రాయః సమానవిద్యాః పరస్పరయశః పురోభాగాః॥ 20

(నేపథ్యే మృదంగధ్వనిః. సర్వే కర్ణం దదతి.)

**పరివ్రాజికా** - హన్త. ప్రవృత్తం సంగీతకమ్ తథాహ్యేషా.

**శ్లో॥** జీమూతస్తనిత విశంకిభి ర్మయూరైః
ఉద్గ్రీవై రనురసితస్య పుష్కరస్య।
నిర్హ్రాదిన్యుపహితమధ్యమస్వరోత్థా
మాయూరీ మదయతి మార్జనా మనాంసి॥ 21

**రాజా** - దేవి! తస్యాః సామాజికాః భవామః

**ధారిణీ** - (స్వగతం) అహో! అవినయ ఆర్యపుత్రస్య.

(సర్వే ఉత్తిష్ఠన్తి.)

ఓ అభిమానవంతురాలా! నీవు ( ఈప్రదర్శన విషయమునందు నన్నుగూర్చి) మరొక విధముగా భావింపకుము. ఇది నా పన్నుగడ కాదు సుమా! సమాన విద్యగల విద్వాంసులు తరచుగా ఒండొరుల విద్యా విషయమునందు ఈర్ష్య కలిగిఉందురు కదా!-- **20**

(తెరవెనుకనుండి మృదంగ ధ్వని వినబడును. అందరు చెవి యొగ్గెదరు.)

**విదూషకుడు:-** అహో! సంగీతము ప్రారంభమైనది. అందువలననే ఇదుగో----

(ఈ మృందగ ధ్వనిని విని) మేఘగర్జన మనుకొని, మయూరములు మోములెత్తి, ఆకసమువంక చూచుచున్నవి. మరల ఆమేఘగర్జనలనే అనుకరించుచుమ్రోగు, పుష్కరములయొక్క నిర్హ్రాదినీ శబ్ధయుక్తమైన, మధుర స్వరమునుండి పుట్టిన, మయూరీమార్జన, మనస్సులను పరవశింపజేయు చున్నది. **21**

**రాజు:-** దేవి! మనము కూడ ఆ నాట్యప్రదర్శనమునకు సామాజికులము (ప్రేక్షకులము) అయ్యెదము. (రమ్ము)

**ధారిణి:-** (తనలో) అహో! 'ఆర్యపుత్రుని అవినయము! (దుండగము)

(అందరును లేచుదురు.)

**విదూషకః -** (అపవార్య) భోః ధీరం గచ్ఛ మా తత్రభవతీ ధారిణీ విసంవాదయిష్యతి.

**రాజా -**

**శ్లో. ధైర్యావలంబిన మపి త్వరయతి మాం మురజ**
**వాద్యరవో ఽయమ్।**
**అవతరతః సిద్ధిపథం శబ్దః స్వమనోరథస్యేవ॥22**

(ఇతి నిష్క్రాన్తాః.)

ఇతి మహాకవి శ్రీకాళిదాసవిరచితే
మాలవికాగ్నిమిత్రమ్ నామ సంస్కృతనాటకే
ప్రథమో ఽఙ్కః



విదూషకుడు

**విదూషకుడు.-** (అపవారించి) అయ్యా! నెమ్మదిగా నడువుము పూజ్యురాలైన ధారిణీదేవి నీ తొందరపాటును చూచి అనుమానింపకూడదు

**రాజు:-** ఎంతటి ధైర్యమును అవలంబించినను, ఈ మృదంగ వాద్యధ్వని, సిద్ధిమార్గములోనికి ప్రవేశించుచున్న నా కోర్కెయొక్క ధ్వనివలె (ముందుకు సాగుటకై) నన్ను త్వరపెట్టుచున్నది. **22**

(అందరు నిష్క్రమింతురు.)

**ఇది మహాకవి శ్రీకాళిదాసు రచించిన "మాళవికాగ్ని మిత్రమ్" అను సంస్కృతనాటకమునందలి ఒకటవ అంకమునకు "ప్రవచనప్రభాకర ఉపన్యాసకేసరి భాగవతరత్న" బిరుదాంకితుడైన బ్రహ్మశ్రీ గోళ్ళమూడి. వెంకట శ్రీహరి సుబ్రహ్మణ్యశర్మ వెలయించిన ఆంధ్రానువాదము.**



పరివ్రాజిక

శ్రీః

# మాలవికాగ్నిమిత్రమ్

## ద్వితీయో ఽఙ్కః

(తతః ప్రవిశతి సంగీతరచనాయాం కృతాయాం ఆసనస్థః సవయస్యో రాజా, ధారిణీ, పరివ్రాజికా. విభవతశ్చ పరివారః.)

**రాజా -** భగవతి! అత్ర భవతో రాచార్యయోః కతరస్య ప్రధమం ఉపదేశం ద్రక్ష్యామః?

**పరివ్రాజికా -** నను సమానే ఽపి జ్ఞానవృద్ధభావే వయోవృద్ధత్వాత్ గణదాసః పురస్కార మర్హతి.

**రాజా -** తేన హి మౌద్గల్య! ఏవమే వాత్రభవతో రావేద్య స్వ నియోగ మశూన్యం కురు.

**కఞ్చుకీ -** య దాజ్ఞాపయతి దేవః (ఇతి నిష్క్రాన్తః)

(ప్రవిశ్య)

శ్రీః

# మాళవికాగ్నిమిత్రము

## రెండవ అంకము

(అంతట సంగీతరచనము పూర్తికాగా, ఆసనములో కూర్చున్న రాజును, విదూషకుడును, ధారిణియును పరివ్రాజికయును, విభవముకొలది పరివారమును ప్రవేశింతురు )

**రాజు -** భగవతీ! పూజ్యులయిన ఈ ఆచార్యులలో ఎవరి ఉపదేశమును ముందుగా తిలకింతము?

**పరివ్రాజిక:-** పాండిత్య విషయమున సమానులే అయినను, జ్ఞాన వృద్ధుడగుటవలనను, వయసులో పెద్దవాడగుట వలనను (ఈ) గణదాసుడే పురస్కారమునకు (ముందుగా పరిశీలింపబడుటకు) తగినవాడు

**రాజు:-** అట్లయినచో మౌద్గల్యుడా! ఆ పూజ్యులిరువురకును పరివ్రాజిక చెప్పిన విధమును నివేదించి, నీ కర్తవ్యమును నెరవేర్చుకొనుము.

**కంచుకి:-** దేవరవా రాజ్ఞాపించినట్లే! (అని నిష్క్రమించును )

(ప్రవేశించి)

**గణదాసః -** దేవ! శర్మిష్ఠాయాః కృతి ర్లయమధ్యా చతుష్పదా. తస్యా శ్చతుర్ధవస్తునః ప్రయోగ మేకమనాః శ్రోతు మర్హతి దేవః.



నాట్యము చేయుచున్న మాలవిక

**గణదాసుడు.-** దేవా! శర్మిష్ఠ రచించిన ప్రబంధము మధ్యలయలో కూర్చ బడినది. నాలుగు పాదములుకలది దానియందలి చతుర్థపాద ప్రయోగమును ఏలినవారు ఏకాగ్రచిత్తముతొ విందురుగాక! (సంగీతశాస్త్రమునందు 'లయ' అను పదము సాంకేతికమైనది ''లయః సామ్యమ్'' అని నిర్వచనము లయ యనగా సామ్యము, సమతాలపాతముల నడిమి కాలము సమముగా నుండి, లయను పుట్టించును. లయ శ్రోతకు ఆహ్లాదమును కలిగించును. తాలము త్వరితమైనచో ఆ లయను ద్రుత మందురు. ఆ తాలము ఆలస్యమైనచో ఆ లయను విలంబితము అందురు. ద్రుతము విలంబితము కాని లయ మధ్యలయ. ''శృంగారహాస్యయో ర్మధ్యలయః కరుణే, విలంబితః, రౌద్రాద్భుత వీరబీభత్స భయానకేషు ద్రుతః'' అను సూత్రమును బట్టి ఈ శర్మిష్ఠ రచించిన ప్రబంధము మధ్యలయలో కూర్చబడినది.

''చతుర్థపాదప్రయోగమును . ఏకాగ్రచిత్తముతో విందురుగాక'' అను పదప్రయోగమునందు ఒక చమత్కారము కలదు ప్రస్తుతము కేవలవిద్యాపరీక్షయే కనుక నాల్గుపదములుకల ప్రబంధమున నాల్గవ పాదము మాత్రమే ప్రయోగింపబడుచున్నది కనుక దానిని ఏకాగ్రచిత్తముతో ప్రభువు వినవలెను అని గణదాసుని అభిప్రాయము ఈ నాల్గవ పాదమునందు శర్మిష్ఠను వ్యాజముగా ఉంచుకొని, మాళవిక తన హృదయము నావిష్కరించుచున్నది. ప్రదర్శనము చూడదగినది గదా! వినవలె ననుట యేమి? అను ప్రశ్నకు వ్యంగ్యముగా మాళవికయొక్క హృదయాభిప్రాయము వినదగినది'' అని భావము )

**రాజా -** ఆచార్యబహుమానా దవహితో ఽస్మి

(నిష్క్రాన్తో గణదాసః )

**రాజా -** (జనాంతికం) వయస్య!

**శ్లో॥** **నేపథ్యగృహగతాయా శ్చక్షు ర్దర్శనసముత్సుకం తస్యాః।**
**సంహర్తు మధీరతయా వ్యవసితమివ మే తిరస్కరిణీమ్॥1**

**విదూషకః -** (అపవార్య) భోః! ఉపస్థితం నయనమధు, సన్నిహిత మక్షికం చ. త దప్రమత్త ఇదానీం పిబ.

(తతః ప్రవిశతి ఆచార్య ప్రత్యవేక్షమాణాఙ్గసౌష్ఠవా మాలవికా.)

**విదూషకః-** (జనాంతికం) ప్రేక్షతాం భవాన్ న ఖల్వస్యాః ప్రతిచ్ఛందాదపి పరిహీయతే మధురతా

**రాజా -** (అపవార్య) వయస్య!

**శ్లో॥** **చిత్రగతాయా మస్యాం కాంతివిసంవాదశంకి మే**
**హృదయమ్।**
**సంప్రతి శిథిలసమాధిం మన్యే యేనేయ మాలిఖితా॥ 2**

**రాజు.-** ఆచార్యునిఎడ గల గౌరవమువలన శ్రద్ధగా ఉన్నాను

(గణదాసు నిష్క్రమించును )

**రాజు:-** (జనాంతికముగా) స్నేహితుడా!

నేపథ్య గృహమునందు (వేషరచనకు ఉయోగింపబడు గృహము) ఉన్న ఆ మాళవికను దర్శించుటయందు ఉత్కంఠితమైన నా నేత్రము ధైర్యమును కోల్పోయి, తెరను తొలగదోయుచున్నదా అన్నట్లున్నది 1

**విదూషకుడు:-** (అపవారించి) ఓయీ నయనమధువు చెంతనే ఉన్నది తేనెటీగ కూడ చెంతనే ఉన్నది కనుక ఇప్పుడు అప్రమత్తుడవై త్రావుము

(అంతట ఆచార్యునిచే పరిశీలింపబడుచున్న అంగసౌష్ఠవము కలదై, మాళవిక ప్రవేశించును )

**విదూషకుడు.-** (జనాంతికముగా) తాము చూడవచ్చును ఈమె రూపలావణ్యము ప్రతిచ్ఛందములోని దానికంటె (చిత్రపటములో ఉన్నదానికంటె) ఏ మాత్రము తీసిపోవుట లేదు సుమా!

**రాజు:-** (అపవారించి) మిత్రుడా!

చిత్రపటములో ఉన్న ఈమెనుగూర్చి, ఈమె అకారమునకును చిత్తరువునకును కొంచెము సౌందర్యభేదము ఉన్నదేమో అను అనుమానము నాకు కలిగినది (కాని ఈమెను ప్రత్యక్షముగా ఇప్పుడు చూచిన తరువాత) ఈ చిత్రమును చిత్రించినవాని మనస్సు ఈమె సౌందర్యవిషయమున చెదిరి, ఏకాగ్రత లేక,

**గణదాసః -** వత్సే! ముక్తసాధ్వసా సత్వస్థా భవ.

**రాజా -** (స్వగతం) అహో! సర్వస్థానానవద్యతా రూపస్య. తథాహి

**శ్లో** **దీర్ఘాక్షం, శరదిందుకాన్తి వదనం,బాహూ నతా వంసయోః**
**సంక్షిప్తం నిబిడోన్నతస్తన మురః ,పార్శ్వే ప్రమృష్టే ఇవ।**
**మధ్యః పాణిమితో, ఒమితం చ జఘనం, పాదా వరాలాంగులీ**
**ఛన్దోనర్తయితు ర్యథైవ మనసి శ్లిష్టం తథాస్యా వపుః॥ 3**

ఆమె సౌందర్యమును సమముగా, (సరిగా) చిత్రింపలేకపోయి నాడని నా కనిపించుచున్నది

(మాళవికను రంగస్థలముపై చూచి విదూషకుడు "ఆమె చిత్రమునందున్నంతటి సౌందర్యవతియే" అని భావింపగా, రాజు "ఈమె సౌందర్యమును చిత్రకారుడు చిత్తైకాగ్ర్యము లేక సరిగా చిత్రింపలేకపోయినాడు వాస్తవమునకు చిత్రములో కంటె మాళవిక అధికమైన సౌందర్యము కలది" అనుకొనినాడు) 2

**గణదాసుడు:-** చిరంజీవినీ! బెదురుటను మాని, ధైర్యమూని యుండుము.

(రాజుపై మాళవికకు గల ప్రేమచే బెదురుచుండుటను చూచి, ఆచార్యు డిట్లు ఆమెకు ధైర్యము నుపదేశించినాడు.)

**రాజు:-** (తనలో) ఆహా! ఈమె సౌందర్యము సర్వావయవముల యందును ఏదోషమును, వంకయును లేకున్నదికదా! అవునట్లే

ఈమె ముఖము నిడుదకన్నులు కలది, శరత్కాలపు చంద్రుని వెన్నెలవంటి కాంతితో ఆహ్లాదకరమైనది బాహువులు భుజములవద్ద వంగియున్నవి. ఈమె వక్షఃస్థలము కఠినమైన, ఎత్తైన స్తనములతో చిక్కనై యున్నది పార్శ్వములు (డొక్కలు) మెఱుగుపెట్టబడినవా అన్నట్లున్నవి. నడుము పిడికిలితో కొలువబడదగినంత సన్నగా ఉన్నది జఘనము (కొలతకు చిక్కనంత) విపులముగా నున్నది పాదముల వేళ్లు వంకరతిరిగి అందముగా నున్నవి (మెత్తముమీద) నాట్యాచార్యుడు తన మనుస్సులో (సాముద్రిక శాస్త్రప్రకారము) నర్తకియొక్క

(మాలవికా ఉపగానంకృత్వా, చతుష్పదంవస్తు గాయతి.)

**శ్లో** **దుర్లభః ప్రియో మే తస్మిన్ భవ హృదయ! నిరాశమ్**
**అహో అపాఙ్గో మే పరిస్ఫురతి కిమపి వామకః।**
**ఏష స చిరా ద్దృష్టః కథ ముపనేతవ్యో**
**నాథ! మాం పరాధీనాం త్వయి గణయ సతృష్ణామ్॥ 4**

(ఇతి యథారస మభినయతి)



నాథ! మాం పరాధీనాం త్వయి గణయ సతృష్ణామ్ (2 4)

శరీరము ఎట్లుండవలెనని భావించునో ఈమె శరీరము (సరిగా) అట్లే నిర్మితమైయున్నది 3

(మాళవిక) ఉపగానమును (గానమునకు ముందుగా చేయు రాగాలాపమును) గావించి, నాలుగు పాదములుగల గీతమును పాడును

నాకు ప్రియుడు దుర్లభుడు కనుక ఓ హృదయమా! వాని పై ఆశను పెట్టుకొనకుము. అహో! నా ఎడమక్రీగన్ను ఏలనో అదురుచున్నది! చిరకాలమునకు కనబడిన ఈతడు, సమీపింప నెట్లు శక్యుడగును? (ఈ సమస్యను తీర్చుటకై) నన్ను పరాధీనను గను, (నీపై) సాభిలాషనుగను తెలిసికొనుము. 4

(అని రసానుగుణముగా అభినయించును )

(రసానుగుణమునకు వ్యాఖ్య ఇది. రస మనగా ఇచ్చట భావము అని అర్థము అది సంచారి భావము, స్థాయిభావము అని రెండు రకములుగా నుండును. ఇచ్చట ప్రథమపాదమున ప్రియుని దుర్లభత్వము వలన, నిర్వేదమును అభినయింపవలెను రెండవ పాదమునందు ఎడమకన్ను అదురుటవలన రాబోవు శుభముచే 'హర్షమును' అభినయింపవలెను. ఈతని , చేరుట ఎట్లు? అను తృతీయ పాదమునందు 'చింత'ను అభినయింపవలెను పరాధీనత్వ స్మరణముచే దైన్యము' మొదలగు సంచారిభావములను అభినయింపవలెను అట్లే ప్రథమపాదమునందు అంతర్బాష్పనిః శ్వాసములు అను సాత్వికభావమును, ద్వితీయ పాదమునందు

*

**విదూషకః -** (అపవార్య) భో! వయస్య! చతుష్పదం వస్తు ద్వారీకృత్య, త్వ య్యుపస్థాపిత ఇవాత్మా అత్రభవత్యా.

**రాజా -** (జనాన్తికం) సఖే! ఏవమేవ మమాపి హృదయమ్. అనయా ఖలు.

**శ్లో॥** **జన మిమ మనురక్తం విద్ధి నాథేతి గేయే**
**వచన మభినయంత్యా స్వాంగ నిర్దేశపూర్వమ్।**
**ప్రణయగతి మదృష్ట్వా ధారిణీ సన్నికర్షాత్**
**అహ మివ సుకుమారప్రార్థనావ్యాజ ముక్తః॥ 5**

(మాలవికా గీతాన్తే నిష్క్రాన్తు మారబ్ధా.)

**విదూషకః -** భవతి తిష్ఠ. కిమపి వో విస్మృతః క్రమభేదః. తం తావ త్ప్రక్ష్యామి.

**గణదాసః -** వత్సే! క్షణమాత్రం స్థి త్వోపదేశవిశుద్ధా యాస్యసి.

(మాలవికా వివృత్య స్థితా.)

పులకోద్గమము లేక రోమాంచములను సాత్త్వికభావమును మూడవ పాదమున అధోముఖత్వ, మందనిఃశ్వాసములు అను సాత్త్వికభావమును, చతుర్థపాదమున అంగశైథిల్య వైవర్ణ్యములు అను సాత్త్వికభావమును ప్రదర్శించుటయే రసానుగుణాభినయ మగును )

**విదూషకుడు:** ఓయీ స్నేహితుడా! చతుష్పదమైన గీతమును ద్వారముగా చేసికొని, ఈ పూజ్యురాలు తనను నీ కర్పించుకొనుచున్నట్లున్నది

**రాజు:-** (జనాంతికముగా) నేనును అట్లే అనుకొనుచున్నాను. నిశ్చయముగా ఈమెచే

"నన్ను అనురక్తనుగా తెలిసికొనుము" అను ఈ గేయము నందు వాక్యమునకు తన శరీరమునే చూపుచు, అభినయించి, "ధారిణి సాన్నిధ్యమువలన నాప్రేమను ప్రకటించుటకు మరొక మార్గము లేక, ఈ సుకుమార గీతమునందలి ప్రార్థనమిషచే నన్ను నేనే నీకు నివేదించుకొనుచున్నాను " అని చెప్పినట్లు నేను భావించుచున్నాను 5

(మాళవిక గీతాంతమునందు వెడలిపోజూచును )

**విదూషకుడు.-** పూజ్యురాలా! నిలుము. నీవేదో ఒక క్రమభేదమును (అభినయక్రమ విశేషమును) మఱచినట్లున్నది. దాని నిప్పుడు ప్రశ్నింతును

**గణదాసుడు:-** అమ్మాయీ! క్షణకాలము నిలిచి, ఉపదేశమున విశుద్ధురాలివై వెళ్లుదువుగాని!

(మాళవిక మరలి, నిలుచును.)

**రాజా -** (స్వగతం) అహో! సర్వాస్వవస్థాసు చారుతా శోభాన్తరం పుష్యతి. తథాహి

**శ్లో॥** **వామం సంధిస్థిమితవలయం న్యస్య హస్తం నితంబే**
**కృత్వా శ్యామావిటపిసదృశం స్రస్త ముక్తం ద్వితీయమ్।**
**పాదాంగుష్ఠాలులితకుసుమే కుట్టిమే పాతితాక్షం**
**నృత్యా దస్యాః స్థిత మతితరాం కాంత మృజ్వాయతార్థమ్॥ 6**

**ధారిణీ -** నను గౌతమవచనమపి ఆర్యః హృదయే కరోతి?

**గణదాసః -** దేవి! మా మైవమ్. దేవప్రత్యయాత్ సంభావ్యతే సూక్ష్మదర్శితా గౌతమస్య. పశ్య

**శ్లో॥** **మందో ఽ ప్యమందతా మేతి సంసర్గేణ విపశ్చితః।**
**పంకచ్ఛిదః ఫలస్యేవ నికషే ణావిలం పయః॥ 7**

(విదూషకం విలోక్య) త చ్ఛృణుమో వివక్షిత మార్యస్య.

**విదూషకః -** గణదాసం (విలోక్య) కౌశికీం తావ త్పృచ్ఛ. పశ్చా ద్యో మయా క్రమభేదో లక్షితః తం భణిష్యామి.

**గణదాసః -** భగవతి! యథాదృష్ట మభిధీయతాం గుణో వా దోషోవేతి.

**రాజు.-** (తనలో) అహో ఏమి ఈమె సౌందర్యము? సర్వావస్థల యందును ఈమె అందము క్రొత్తసొబగుల నీనుచునే యున్నది అందువలననే

మణికట్టు వద్ద జారిపోకుండా నిలిచియున్న వలయముకల, ఎడమచేతిని పిఱుదుపై నుంచి, ప్రియంగులతను పోలిన, రెండవ చేతిని క్రిందికి జారవిడిచి, కాలిబొటనవ్రేలితో పూవులను చిమ్ముచు, రత్నకుట్టిమముపై (నేలపై) చూపులను నిలిపి, క్రింది సగపు శరీరమును తిన్నగా ఉండునట్లు నిలిచిన ఈమె భంగిమ, నృత్యముచేసినప్పటికంటె ఇప్పుడే మిగుల రమణీయముగా నున్నది 6

**ధారిణి:-** గౌతముని మాటను కూడ ఆర్యుడు లెక్కపెట్టుటయా?

**గణదాసుడు:-** దేవీ! అట్లుకాదు. ప్రభువునకు అప్తుడు కనుక గౌతమునకు కూడ సూక్ష్మదర్శిత సంభావ్యమే యగును. చూడుము

ఇందుపుగింజ సంపర్కముచే బురదనీరు నిర్మలమగునట్లు పండితుని సంపర్కమువలన మందుడు (అజ్ఞాని ) కూడ జ్ఞాని కాగలడు 7

(విదూషకుని చూచి) ఆర్యుడు చెప్పదలచిన దానిని విందుము.

**విదూషకుడు .-** (గణదాసును చూచి) ముందుగా కౌశికిని అడుగుము నేను కనిపెట్టిన క్రమభేదమును తరువాత చెప్పెదును

**గణదాసుడు :-** భగవతీ! ప్రయోగమునందలి గుణమో దోషమో మీరు చూచినదానిని చూచినట్లు చెప్పుడు

**పరివ్రాజికా** - యథా దృష్టం సర్వ మనవద్యమ్. యతః

**శ్లో॥** అంగై రంతర్నిహితవచనైః సూచితః సమ్య గర్థః,
పాదన్యాసో లయ మనుగతః, తన్మయత్వం రసేషు।
శాఖాయోనిః మృదు రభినయ, స్తద్వికల్పానువృత్తౌ
భావో భావం నుదతి, విషయా ద్రాగబంధః స ఏవ॥

**గణదాసః** - దేవః కథం మన్యతే?

**రాజా** - గణదాస! వయం స్వపక్షశిథిలాభిమానాః సంవృత్తాః.

**గణదాసః** - అద్య నర్తయితాస్మి.

**శ్లో॥** ఉపదేశం విదు శ్శుద్ధం సంత స్త ముపదేశినః।
శ్యామాయతే న విద్వత్సు యః కాంచన
మివాగ్నిషు॥ 9

**ధారిణీ** - దిష్ట్యా పరీక్షకారాధనేన అర్యో వర్ధతే.

**గణదాసః** - దేవి! త్వత్పరిగ్రహో ఽపి మే వృద్ధిహేతుః. (విదూషకం విలోక్య) గౌతమ! వదేదానీం య త్తే మనసి వర్తతే.

**పరివ్రాజిక :-** నేను చూచిన ప్రకారము సర్వము నిర్దుష్టము ఏలయన

**పరివ్రాజిక .-** వచనగర్భితములైన అవయవములచే అర్థము బాగుగా సూచింపబడినది లయ ననుసరించి, పాదన్యాసము సాగినది రసములయందు తన్మయత్వము వ్యక్తమైనది శాఖాంగముల వలన (కరచరణాద్యవయవముల్వలన) పుట్టిన అభినయము లలితముగా నున్నది. ఆ అభినయ వికల్పక్రమమునందు (మార్పులయందు) ఒక భాగము ఇంకొక భాగమును విషయమునుండి తొలగించుచున్నది అయినను రంజనపాటవము (రంజింపచేయు శక్తి) నిర్వికల్పముగనే ఉన్నది 8

**గణదాసుడు :-** ఏలినవా రేమనుకొనుచున్నారు?

**రాజు :-** గణదాసా! మే మిప్పుడు స్వపక్షమున అభిమానము సడలిన వారమైతిమి (ఇరావతియొక్క ప్రదర్శన మక్కరలేదని భావము.)

**గణదాసుడు .-** నే నీనాడు (నిజముగా) నాట్యాచార్యుడ నైతిని.

ఆచార్యుని ఏ యుపదేశము అగ్నులయందు పడిన కాంచనమువలె, విద్వాంసుల పరీక్షలకు లోనై, నల్లపడదో (మలినము నందదో) అట్టి ఉపదేశమే విశుద్ధమైనదని విద్వాంసు లంగీకరింతురు 9

**ధారిణి :-** అదృష్టవశమున పరీక్షకుల మెప్పును పొంది, ఆర్యుడు వర్ధిల్లు చున్నాడు.

**గణదాసుడు :-** దేవీ! తమ అనుగ్రహమే నాకు వృద్ధిహేతువు. (విదూషకుని చూచి) గౌతముడా! నీ మనస్సునం దేమున్నదో ఇప్పుడు చెప్పుము.

**విదూషకః -** ప్రథమోపదేశదర్శనే ప్రథమం బ్రాహ్మణపూజా కర్తవ్యా. సా నను వో విస్మృతా.

**పరివ్రాజికా -** అహో ప్రయోగాభ్యంతరః ప్రశ్నః!

(సర్వే ప్రహసితాః మాలవికాపి స్మితం కరోతి )

**రాజా -** (స్వగతం) ఉపాత్తసార శ్చక్షుషా మే స్వవిషయః. యదనేన

**శ్లో॥ స్మయమాన మాయతాక్ష్యాః**
**కించి దభివ్యక్తదశనశోభి ముఖమ్।**
**అసమగ్రలక్ష్య కేసర**
**ముచ్ఛ్వసదివ పంకజం దృష్టమ్॥ 10**

**గణదాసః -** మహాబ్రాహ్మణ! న ఖలు ప్రథమం నేపథ్య సవనమిదమ్. అన్యథా కథం త్వాం అర్చనీయం నార్చయిష్యామః?

**విదూషకః -** మయా నామ ముగ్ధచాతకేనేవ శుష్కఘనగర్జితే అంతరిక్షే జలపాన మిష్టమ్.

**పరివ్రాజికా -** ఏవమేవ.

**విదూషకః -** భగవతి! తేన హి పండితపరితోషప్రత్యయా నను మూఢాజాతిః. యది భగవత్యా శోభనం భణితం, తత ఇద మస్యై పారితోషికం ప్రయచ్ఛామి.

**విదూషకుడు .-** ఉపదేశమును మొట్టమొదటిసారిగా ప్రదర్శించునప్పుడు బ్రాహ్మణపూజ చేయవలసియున్నది దానిని మీరు మరువలేదా?

**పరివ్రాజిక :-** అహో! అభినయ విషయమునందు ఇది ఎంత గొప్ప ప్రశ్న!

(అందఱు పకపక నవ్వుదురు మాళవిక చిరునవ్వు నవ్వును.)

**రాజు -** (తనలో) నా నేత్రము స్వవిషయమునుండి సారమును గ్రహించినది. ఏలయన, ఈ కంటికి

కొంచెముగా బయటపడిన దంతములచే సుందరమైన ఈ విశాలనేత్రయొక్క చిరునవ్వులు చిందించు ముఖము పూర్తిగా కనబడని కేసరములు గలిగి, వికసించుచున్న కమలమువలె నాకు కనబడుచున్నది. **10**

**గణదాసుడు :-** మహాబ్రాహ్మణుడా! ఇది మొదటి అభినయ యాగము కాదు కదా! కానిచో అర్చింపదగిన నిన్ను అర్చింపక ఎట్లుందుము?

**విదూషకుడు :-** నీరసగర్జనగల ఆకాశమున తెలివి తక్కువవానకోయిలవలె నేనును నీరు ద్రావగోరితిని.

**పరివ్రాజిక :-** అచ్చముగా అట్లే

**విదూషకుడు ·-** భగవతీ! అట్లయినచో పండితుల సంతోషమును ప్రమాణముగా గ్రహించునది గదా మూఢజాతి. భగవతీ! (అభినయము) ప్రశస్తముగా ఉన్నచో ఇదిగో ఈమెకు పారితోషికమును సమర్పించుచున్నాను

(ఇతి రాజ్ఞో హస్తా త్కటక మాకర్షతి.)

**ధారిణీ -** తిష్ఠ తావత్. గుణాంతర మజానన్ కిం నిమిత్తం త్వ మాభరణం దదాసి?

**విదూషకః -** పరకీయ మితి కృత్వా!

**ధారిణీ -** (ఆచార్యం విలోక్య) అర్య గణదాస! నను దర్శితోప దేశా తే శిష్యా.

**గణదాసః -** వత్సే! ఏహి. గచ్ఛావ ఇదానీమ్.

(సహాచార్యేణ నిష్క్రాన్తా మాలవికా.)

**విదూషకః -** (జనాన్తికం) ఏతావానేవ మే మతివిభవో భవంతం సేవితుమ్.

**రాజా -** (జనాన్తికం) అల మలం పరిచ్ఛేదేన. అద్యహి

**శ్లో॥** **భాగ్యాస్తమయ మివాక్ష్ణోః,**
**హృదయస్య మహోత్సవావసానమివ।**
**ద్వారపిధానమివ ధృతేః,**
**మన్యే తస్యా స్తిరస్కరిణీమ్॥ 11**

**విదూషకః -** (జనాంతికం) సాధు. త్వం దరిద్ర ఆతుర ఇవ వైద్యే నోపనీయమానం ఔషధం ఇచ్ఛసి

(ప్రవిశ్య)

(అని రాజు చేతినుండి కంకణమును లాగును )

**ధారిణి** :- కొంచె ముండుము. గుణతారతమ్యము నెఱుంగకుండ ఈ ఆభరణమును ఏకారణముగా ఈమె కిత్తువు?

**విదూషకుడు** .- ఇతరునిది కదా అని!

**దారిణి** .- (ఆచార్యుని చూచి) ఆర్యుడా! గణదాసుడా! నీ శిష్యురాలు ఉపదేశమును ప్రదర్శించినట్లేకదా!

**గణాసుడు** .- వత్సా! రమ్ము ఇక బయలుదేరుదము

(ఆచార్యునితో గూడి మాళవిక నిష్క్రమించును.)

**విదూషకుడు** :- (జనాంతికముగా) మిమ్ము సేవించుటకు నా బుద్ధిసంపద ఇంత మాత్రమే!

**రాజు** :- (జనాంతికముగా) చాలు,చాలు, నీబుద్ధిసంపదకు పరిమితి పెట్టకుము ఇప్పుడు

ఆ మాళవిక నా కనుమరుగగుటను, నా నేత్రముయొక్క భాగ్యాస్తమయము వలెను, హృదయముయొక్క మహోత్సవపు చివరిఘడియ వలెను, ధైర్యముయొక్క ద్వారమును మూయుటను వలెను భావించుచున్నాను 11

**విదూషకుడు** :- ధనహీనుడైన రోగివలె నీవు వైద్యుడే మందును తెచ్చి ఈయవలెనని కోరుకొనుచున్నావు.

(ప్రవేశించి)

**హరదత్తః -** దేవ! మదీయ మిదానీం ఉపదేశ మవలోకయితుం క్రియతాం ప్రసాదః.

**రాజా -** (స్వగతం) అవసితో మే దర్శనార్థః (దాక్షిణ్యం అవలమ్బ్య, ప్రకాశం) హరదత్త! నను పర్యుత్సుకా ఏవ వయమ్.

**హరదత్తః -** అనుగృహీతో ఉస్మి.

(నేపథ్యే)

**వైతాళికః -** జయతు జయతు దేవః. ఉపారూఢో మధ్యాహ్నః. తథాహిః

**శ్లో॥** పత్రచ్ఛాయాసు హంసా ముకులితనయనా దీర్ఘికా పద్మినీనాం
సౌధా న్యత్యర్థతాపా ద్వలభిపరిచయద్వేషి పారావతాని।
బిందూత్క్షేపాన్ పిపాసుః పరిసరతి శిఖీ భ్రాంతిమద్వారియంత్రం
సర్వై రుస్రైః సమగ్రై స్త్వమివ నృపగుణై ర్దీప్యతే సప్తసప్తిః॥
12

**విదూషకః -** అవిహా! అవిహా! బ్రాహ్మణస్య భోజనవేలా సంవృత్తా. అత్రభవతో ఉపి సంవృత్తా. ఉచిత వేలాతిక్రమేణ చికిత్సకాః దోష ముదాహరన్తి. హరదత్త! కిం ఇదానీం త్వం భణసి?

**హరదత్తుడు :-** దేవా! ఇప్పుడు నా యువదేశమును తిలకించుట కనుగ్రహమును ప్రసాదింపుడు

**రాజు :-** (తనలో) నేను చూడవలసిన ప్రయోజనము పూర్తియైనది. (దాక్షిణ్యము నవలంబించి, ప్రకాశముగా) హరదత్తుడా! మేము ప్రదర్శనమును తిలకించుటకు ఉత్సాహము కలవారమై ఉన్నాము.

**హరదత్తుడు :-** అనుగ్రహింపబడితిని.

(తెరవెనుకనుండి)

**వైతాళికుడు :-** ఏలినవారికి జయము జయము ఇది మధ్యాహ్నవేళ అయినది అట్లే కదా

క్రీడా సరస్సులయందలి పద్మపత్రముల నీడలయందు హంసలు కన్నులు మూసికొని (విశ్రాంతి తీసుకొను)చున్నవి. మిక్కిలి తాపముచే భవనముల ముంజూరులయందు నివసించుటకు పావురము లిష్టపడకున్నవి. పైకెగజిమ్ముచున్న నీటిబిందువులను త్రావగోరిన నెమలి, గిరగిర తిరుగుచున్న జలయంత్రమును చేరుచున్నది పైకి ప్రసరించు సకల రాజగుణములతో నీవు ప్రకాశించునట్లు, సూర్యుడు కూడ తన కిరణనికురుంబముతో ప్రకాశించుచున్నాడు. 12

**విదూషకుడు :-** అయ్యో! అయ్యో! బ్రాహ్మణునకు భోజనవేళ అయినది. పూజ్యులైన నీకును (భోజనవేళ) అయినది. భోజనవేళ నతిక్రమించి భోజనము చేసినచో (ఆరోగ్య) దోష మేర్పడు నని వైద్యులు పేర్కొనుచుందురు హరదత్తా! నీ విప్పు డేమందువు?

**హరదత్తః -** నాస్తి మే వచనావకాశో ఽత్ర.

**రాజా -** (హరదత్త మవలోక్య) తేన హి త్వదీయ ముపదేశం శ్వో ద్రక్ష్యామః. విశ్రామ్యతాం భవాన్.

**హరదత్తః -** య దాజ్ఞాపయతి దేవః.

(ఇతి నిష్క్రాన్తః.)

**ధారిణీ -** నిర్వర్తయ త్వార్యపుత్రో మజ్జనవిధిమ్.

**విదూషకః-** భవతి! విశేషేణ భోజనం త్వరయ.

**పరివ్రాజకా -** (ఉత్థాయ) స్వస్తి భవతే.

(ఇతి సపరిజనా దేవ్యా సహ నిష్క్రాన్తా.)

**విదూషకః -** భోః న కేవలం రూపే, శిల్పే ఽపి అద్వితీయా మాలవికా.

**రాజా -** వయస్య!

**శ్లో॥** **అవ్యాజ సుందరీం తాం విజ్ఞానేన లలితేన యోజయతా।**
**పరికల్పితో విధాత్రా బాణః కామస్య విషదిగ్ధః॥ 13**

కిం బహునా, చింతయితవ్యో ఽ స్మి తే.

**విదూషకః -** భవతా ప్యహమ్. దృఢం విపణి కందురివ మే ఉదరాభ్యంతరం దహ్యతే.

**హరదత్తుడు :-** ఏమనుటకైనను నా కిచ్చుట అవకాశమే లేదు.

**రాజు :-** (హరదత్తునిచూచి) అట్లయినచో నీ ఉపదేశమును రేపు దర్శింతుము. నీవు విశ్రాంతిని తీసికొనుము.

**హరదత్తుడు .-** ఏలినవా రాజ్ఞాపించినట్లే

(అని నిష్క్రమించును )

**దారిణి '-** ఆర్యపుత్రుడు స్నానవిధిని నిర్వర్తింతురు గాక!

**విదూషకుడు :-** దేవీ! విశేషించి, భోజనపు ఏర్పాటును త్వరగాచేయుము.

**పరివ్రాజిక :-** (లేచి) మీకు శుభ మగునుగాక!

(అని పరిజనసహితయై దేవితోపాటు నిష్క్రమించును.)

**విదూషకుడు :-** ఓయీ! రూపమునందే కాదు, శిల్పమునందుకూడ (నాట్య విద్యయందు కూడ) మాళవిక యీడులేనిదే.

**రాజు :-** స్నేహితుడా!

సహజసుందరియైన ఆమెను సుకుమారమైన (నాట్య) విద్యతో సంయోగపరిచిన ఆ బ్రహ్మ, విషముపూసిన బాణమును మన్మథునకు నమకూర్చినాడు (సర్వసమ్మోహకారిణియైన మాళవిక మన్మథబాణమే అని అభిప్రాయము) 13

పెక్కేల! నీకు విచారింపబడదగిన వాడనైతిని.

**విదూషకుడు :-** నీకు నేనును అట్లే! (చింతింపబడదగిన వాడను.) అంగడిలోని పెనము వలె నా కడుపులోపల తీవ్రముగా కాలుచున్నది

**రాజా -** ఏవమేవ భవాన్ సుహృదర్థే త్వరతామ్.

**విదూషకః -** గృహీతం వచనమ్. కింతు మేఘావలీ నిరుద్ధ జ్యోత్స్నేవ పరాధీనదర్శనా తత్రభవతీ మాలవికా. భవానపి సూనోపరిచరో గృధ్ర ఇవ ఆమిషలోలుపో భీరుకశ్చ. తస్మా దనాతుర ఇవ కార్యసిద్ధిం ప్రార్థయమానో మే రోచసే.

**రాజా -** సఖే! కథ మనాతురో భవిష్యామి. యదా

**శ్లో -సర్వాంతఃపురవనితా వ్యాపార ప్రతినివృత్త హృదయస్య।**
**సా వామలోచనా మే స్నేహ స్యైకాయనీభూతా॥ 14**

(ఇతి నిష్క్రాన్తా స్సర్వే.)

ఇతి మహాకవి శ్రీకాళిదాసవిరచితే
మాలవికాగ్నిమిత్రమ్ నామ సంస్కృతనాటకే
ద్వితీయోఽఙ్కః



గణదాసుడు

**రాజు :-** అట్లే నీవు నీ మిత్రుని విషయమున త్వరపడవలెను.

**విదూషకుడు :-** ఆ మాటను ఒప్పుకొంటిని. కాని, మేఘములచే నిరోధింపబడిన వెన్నెల వలె ఆ మాళవికదర్శనము నేడు పరాధీనమైయున్నది నీవు కూడ కసాయి కొట్టుమీద తిరుగు పిరికి గ్రద్దవలె మాంసముపై ఆశ కలవాడవు కనుక నీవు కార్యసిద్ధి నర్థించుచున్న అనాతురుని వలె నాకు మిక్కిలి నచ్చియున్నావు.

**రాజు :-** స్నేహితుడా! అనాతురుడను ఎట్లు కాగలను? ఏలయన

అంతఃపురమునందలి అందరు స్త్రీలతోడి సంబంధము
నుండి మరలిన హృదయముగల నాయొక్క ప్రేమకు ఆ
సుందరనయనయే ప్రధానమైన ఆటపట్టైనది కదా!
**14**

(అని అందరు నిష్క్రమింతురు )

**ఇది మహాకవి శ్రీకాళిదాసు రచించిన "మాళవికాగ్ని మిత్రమ్" అను సంస్కృతనాటకమునందలి రెండవ అంకమునకు "ప్రవచనప్రభాకర ఉపన్యాసకేసరి భాగవతరత్న" బిరుదాంకితుడైన బ్రహ్మశ్రీ గోళ్ళమూడి. వెంకట శ్రీహరి సుబ్రహ్మణ్యశర్మ వెలయించిన ఆంధ్రానువాదము.**



హరదత్తుడు

శ్రీః

# మాలవికాగ్నిమిత్రమ్

## తృతీయో ఽఙ్కః

(తతః ప్రవిశతి పరివ్రాజికాయాః పరిచారికా సమాహితికా.)

**సమాహితికా -** ఆజ్ఞప్తాస్మి భగవత్యా 'సమాహితికే! దేవ్యాః ఉపాయనార్థం బీజపూరకం గృహీత్వాఽఽగచ్ఛ' ఇతి. త ద్యావత్ ప్రమదవనపాలికాం మధుకరికా మన్విష్యామి. (పరిక్రమ్య అవలోక్యచ) ఏషా తపనీయాశోక మవలోకయంతీ మధుకరికా తిష్ఠతి. యావ దేనా ముపసర్పామి.

(తతః ప్రవిశ త్యుద్యానపాలికా.)

**సమాహితికా -** (ఉపసృత్య) మధుకరికే! అపి సుఖ స్తే ఉద్యాన వ్యాపారః?

**మధుకరికా -** అహో! సమాహితికా! సఖి! స్వాగతం తే.

**సమాహితికా -** హలా! భగవ త్యాజ్ఞాపయతి 'అరిక్తపాణినా అస్మా దృశజనేన దేవీ ద్రష్టవ్యా. తద్బీజపూరకేణ శుశ్రూషయితుం ఇచ్ఛామి ఇతి.

శ్రీః

# మాళవికాగ్నిమిత్రము

## మూడవ అంకము

(అంతట పరివ్రాజికయొక్క పరిచారికయగు సమాహితిక ప్రవేశించును )

**సమాహితిక :-** "సమాహితికా! దేవికి కానుక ఇచ్చుటకు మాదీఫలమును తీసికొని రమ్ము" అని భగవతి న న్నాజ్ఞాపించినది. కనుక ఇప్పుడు ఉద్యానవనపాలికయగు మధుకరికను వెదకుదును. (ముందకు నడిచి ,చూచి) అదుగో మధుకరిక! బంగారపు టశోకమును చూచుచున్నది. ఇంక ఈమెను సమీపింతును.

(అంతట ఉద్యానవనపాలిక ప్రవేశించును.)

**సమాహితిక :-** మధుకరికా ! నీ తోటపని సుఖముగా ఉన్నదా?

**మధుకరిక :-** ఓహో ! సమాహితికయా? సఖీ! నీకు స్వాగతము.

**సమాహితిక :-** చెలీ! " మావంటివారు దేవిని వట్టిచేతులతో కాక ఏదో ఒక కానుకను పట్టుకొని దర్శింపవలెను. కనుక మాదీఫలముతో ఆమెను సేవింపగోరుచున్నాను" అని భగవతి యగు పరివ్రాజిక నన్ను ఆజ్ఞాపించినది.

**మధుకరికా -** సన్నిహితమేవ బీజపూరకమ్. కథయ తావ దన్యోన్య సంఘర్షితయోః నాట్యాచార్యయోః ఉపదేశం దృష్ట్వా కతరో భగవత్యా ప్రశంసితః.

**సమాహితికా -** ద్వావపి కిలాగమినౌ, ప్రయోగనిపుణౌ చ. కిం తు శిష్యాగుణవిశేషణ ఉన్నమితో గణదాసః.

**మధుకరికా -** అథ మాలవికాగతం కౌలీనం కిమితి శ్రూయతే ?

**సమాహితికా -** బలవ త్ఖలు సాభిలాషో తస్యాం భర్తా. కేవలం దేవ్యాః ధారిణ్యాః చిత్తం రక్ష న్నాఽఽ త్మనః ప్రభుత్వం సందర్శయతి. మాలవికాప్యేషు దివసేషు అనుభూత ముక్తేవ మాలతీమాలా మ్లాయమానా లక్ష్యతే. అతః పరం న జానే. విసృజ మామ్.

**మధుకరికా -** ఏత చ్ఛాఖావలంబి బీజపూరకం గృహాణ.

**సమాహితికా -** (గృహీత్వా) హలా! త్వమపి ఇతః పరం పేశలతరం సాధుజనశుశ్రూషాయాః ఫలం ప్రాప్నుహి.

(ఇతి ప్రస్థితా.)

**మధుకరికా -** సఖి! సమమేవ గచ్ఛావః అహమ ప్యస్య చిరాయమాణ కుసుమోద్గమస్య తపనీయాశోకస్య దోహద నిమిత్తం దేవ్యై నివేదయామి.

**మధుకరిక :-** మాదీఫలము దగ్గరనే ఉన్నది లెమ్ము. పరస్పరము కలహించిన నాట్యాచార్యులిద్దరి ఉపదేశమును తిలకించి, భగవతి ఎవరిని ప్రశంసించినదో కొంచెము చెప్పుము.

**సమాహితిక :-** ఇరువురు కూడ శాస్త్రజ్ఞులు, ప్రయోగనిపుణులును. కాని శిష్యురాలి గుణవిశేషముచేత గణదాసు ఉన్నమితుడు (గొప్పవాడు) అయినాడు.

**మధుకరిక :-** మరి మాలవికను గురించిన వదంతి ఏమని వినబడుచున్నది?

**సమాహితిక :-** ప్రభువు ఆమెయందు గాఢముగా అభిలాషగలిగియున్నాడు సుమా! కేవలము ధారిణీదేవి మనస్సును మన్నించుచు తన అధికారమును ప్రదర్శింపకున్నాడు. ఈ మధ్యకాలమున మాళవిక కూడ అనుభవించి విడిచిన మాలతీమాల వలె పాలిపోయి కనబడుచున్నది. ఇంతకు మించి నాకు తెలియదు. (మాదీఫలము నిచ్చి) నన్ను పంపింపుము.

**మధుకరిక :-** ఈ కొమ్మనుండి వ్రేలాడు మాదీఫలమును తీసికొనుము.

**సమాహితిక :-** (తీసికొని) చెలీ! నీవు కూడ ఇంతకంటె మృదుతరమైన సాధుజనశుశ్రూషాఫలమును పొందుము.

(అని బయలు దేరును )

**మధుకరిక :-** సఖీ! ఇరువురము కలిసియే పోవుదము. నేను కూడ మొగ్గతొడుగుట కాలస్యమగుచున్న ఈ తపనీయాశోకమునకు (బంగారపు అశోకమునకు) దోహదక్రియను గురించి (వెంటనే పూలను పూయించు ప్రక్రియను గురించి ) దేవికి విన్నవింతును.

**సమాహితికా -** యుజ్యతే. అధికారః ఖలు తే.

(ఇతి నిష్క్రాన్తే.)

## ఇతి ప్రవేశకః

(తతః ప్రవిశతి కామయమానావస్థో రాజా విదూషకశ్చ.)

**రాజా -** (ఆత్మానం విలోక్య)

శ్లో. **శరీరం క్షామం స్యా దసతి దయితాలింగనసుఖే**
**భవే త్సాస్రం చక్షుః క్షణమపి న సా దృశ్యత ఇతి।**
**తయా సారంగాక్ష్యా త్వ మసి న కదాచి ద్విరహితం**
**ప్రసక్తే నిర్వాణే హృదయ పరితాపం వ్రజసి కిమ్?** **1**

**విదూషకః -** అలం భవతో ధీరతా ముజ్ఝిత్వా పరిదేవితేన. దృష్టా ఖలు మయా మాలవికాయాః ప్రియసఖీ వకులావలికా. శ్రావితా చార్థం యత్ భవతా సందిష్టమ్.

**రాజా -** తతః కి ముక్తవతీ?

**విదూషకః -** విజ్ఞాపయ భట్టారకమ్ "అనుగృహీతాస్మి అనేన నియోగేన. కింతు సా తపస్వినీ దేవ్యా అధికతరం రక్ష్యమాణా నాగరక్షితో మణిరివ న సుఖం సమాసాదయితవ్యా. తథాపి ఘటయిష్యామి" ఇతి.

**సమాహితిక** :- మంచిది. అది నీపని కదా!

(అని నిష్క్రమింతురు.)

## ఇది ప్రవేశకము

(అంతట మదనావస్థలో నున్న రాజును, విదూషకుడును ప్రవేశింతురు.)

**రాజు** :- (తన్ను చూచుకొని)

ప్రియురాలి ఆలింగనసుఖము లేనందువలన శరీరము కృశించినది క్షణకాలమైనను ఆమె కనబడదు గదా యని నేత్రము కన్నీళ్ళతో నిండియున్నది. హృదయమా! ఆ మృగాక్షితో నీవు ఎన్నడును విరహితమవు కాలేదు. పరమానందము , లభించి యుండియు నీవు పరితాపమును పొందెదవేల? (ఈ శ్లోకమునందు చిత్తాసంగము అను మన్మథావస్థయును, కృశత్వము అను విరహావస్థయును. అశ్రువు అను సాత్వికావస్థయును సూచితములైనవి.) 1

**విదూషకుడు** :- నీవు ధీరత్వమును విడిచి, వలవించినది చాలును. మాళవికయొక్క ప్రియసఖియగు వకుళావలిక నాకు కనబడినది కదా! నీవు చెప్పిన విషయమును కూడా వినిపించితిని.

**రాజు** :- అప్పు డేమన్నది?

**విదూషకుడు** .- పూజ్యునకు విన్నవింపుము. "ఈ నియోగముచే (అజ్ఞచే) అనుగ్రహింపబడితిని కాని ఆ దీనురాలు దేవిచే అతిజాగ్రత్తగా రక్షింపబడుచు, నాగరక్షితమైన మణివలె సుఖముగా

**రాజా -** భగవన్! సంకల్పయోనే! ప్రతిబంధవత్స్వపి విషయే ష్వభినివేశ్య తథా ప్రహరసి యథా జనో ఽయం న కాలాంతరక్షమో భవతి.
(సవిస్మయం)

శ్లో. **క్వ రుజా హృదయ ప్రమాథినీ**
**క్వచ తే విశ్వసనీయ మాయుధమ్ ।**
**మృదు తీక్ష్ణతరం య దుచ్యతే**
**తదిదం మన్మథ దృశ్యతే త్వయి. ॥** **2**

**విదూషకః -** నను భణామి తస్మి న్నాధనీయే కార్యే కృతో మ యోపాయోపక్షేపః ఇతి. తత్పర్యవస్థాపయ త్వత్రభవా నాత్మానమ్.

**రాజా -** అథేమం దివసశేషం ఉచిత వ్యాపార విముఖేన చేతసా క్వను ఖలు యాపయామి?

**విదూషకః -** అద్యైవ నను ప్రథమావతార సుభగాని రక్తకురవకాణి ఉపాయనం ప్రేష్య, నవవసంతావతారవ్యపదేశేన ఇరావత్యా నిపుణికాముఖేన ప్రార్థితః 'ఇచ్ఛామి ఆర్యపుత్రేణ సహ డోలాధిరోహణ మనుభవితుం ఇతి. భవతా ప్యస్యై ప్రతిజ్ఞాతమ్. త త్ప్రమదవనమేవ గచ్ఛావః.

**రాజా -** న క్షమ మిదమ్

సమీపింప శక్యముగాకున్నది. ఐనప్పటికి సాధింపగలను" అని.

**రాజు** - ఓ భగవానుడా! సంకల్పయోనీ! (మన్మధుడా!) ప్రతిబంధములు కల (అడ్డంకులుగల) విషయమునందు అభినివేశమును కలిగించి, ఈతడు క్షణకాలపు ఆలస్యమును కూడ సహింపలేనివాడగునట్లు కొట్టుచున్నావు. (ఆశ్చర్యముతో)

నాహృదయమును బాధించు ఈ బాధఎక్కడ? విశ్వసనీయమైన (కఠినముకాని) నీ యాయుధ మెక్కడ? ఏది మృదువైనదో అదే మిగుల పదునైనది" అని పెద్దలు చెప్పిన మాట ఓ మన్మధుడా! ఇప్పు డిట్లు నీ విషయమున నిజమైనది 2

**విదూషకుడు** :- "సాధింపవలసిన ఆ కార్యవిషయముననే (ఇప్పటికే) ఉపాయ ప్రయోగమును చేసియుంటి" నని చెప్పుచునే ఉన్నాను కదా! కనుక నీవు మనస్సును కుదుటపఱచుకొనవలెను.

**రాజు** - మరి ఉచితవ్యాపారముల పట్ల విముఖమైన మనస్సుతో ఈ మిగిలిన పగటిభాగమును ఎచ్చట గడుపుదునో కదా?

**విదూషకుడు** :- క్రొత్తగా వసంతము వచ్చిన దన్న మిషతో తొలిపూత యగుటచే రమణీయములైన ఎఱ్ఱగోరింటపూలను కానుకగా పంపి, ఇరావతి ఈనాడే నిపుణిక ద్వారా ఇట్లు ప్రార్థించినది కదా! "ఆర్యపుత్రునితో కలిసి, ఉయ్యాలలూగు ఉత్సవమును ఆనందింప గోరుచున్నాను" అని నీవు కూడ ఆమెకు మాట నిచ్చినావు. కనుక ప్రమదవనమునకే పోవుదము

**రాజు** :- ఇది సాధ్యము కాదు.

**విదూషకః -** కథమివ?

**రాజా -** వయస్య! నిసర్గనిపుణాః స్త్రియః. కథం మా మన్య సంక్రాంతహృదయ ముపలాలయంత మపి తే సఖీ న లక్షయిష్యతి? అతః పశ్యామి.

శ్లో. **ఉచితః ప్రణయో వరం విహంతుం**
**బహవః ఖండనహేతవో హి దృష్టాః ।**
**ఉపచారవిధి ర్మనస్వినీనాం**
**న తు పూర్వాభ్యధికోఽపి భావశూన్యః ॥** 3

**విదూషకః -** నార్హతి భవాన్ అంతఃపుర స్థితం దాక్షిణ్యం ఏకపదే పృష్ఠతః కర్తుమ్.

**రాజా -** (విచింత్య) తేన హి. ప్రమదవన మార్గ మాదేశయ.

**విదూషకః -** ఇత ఇతో భవాన్.

( ఉభౌ పరిక్రామతః )

**విదూషకః -** వసంతః ఖలు పవనబలచలితాభిః పల్లవాంగుళీభిః త్వరయతీవ భవంతం ప్రమదవనం ప్రవిశ త్వితి.

**విదూషకుడు :-** ఏలనో?

**రాజు :-** మిత్రమా! స్త్రీలు స్వాభావికముగా (సహజ) నిపుణలు, నేను ఆమెను ఉపలాలన చేయుచున్నప్పటికిని నీ సఖి నన్ను అన్య సంక్రాంతహృదయునిగా ఎట్లు గుర్తింపకుండును? అందు వలన నా కిట్లుతోచుచున్నది

(ఇరావతియొక్క) ప్రార్థనను భంగపఱచుటయే ప్రస్తుతమునకు మంచిది. ఆలోచించినచో ఆమె కోర్కెను కాదనుటకు కారణములు చాల కనబడును ఇరావతి అభిమానవతి. నా అన్యమనస్కతను గుర్తించినచో కోపపరవశురాలగును భావ శూన్యమైన ఉపచారముచే ఆమెకు కోపము తెప్పించుట కంటె ఆమె కోర్కెను కాదని ఆమెకు కోపమును తెప్పించుటే కొంత మంచిపని. 3

**విదూషకుడు :-** అంతఃపురస్త్రీలపట్ల ఉండవలసిన దాక్షిణ్యమును (సర్వసమభావమును) ఒక్కసారిగా త్రోసివేయుట నీకు తగదు.

**రాజు :-** (ఆలోచించి) అట్లయినచో ప్రమదవనమునకు దారిని చూపుము.

**విదూషకుడు :-** తమరు ఇటు, ఇటు.

(ఇరువురు ముందకు సాగుదురు.)

**విదూషకుడు :-** ఈ వసంతుడు గాలికి కదలాడు చివురాకులను వేళ్ళతో ప్రమద వనములోనికి ప్రవేశింపుమని పిలిచి నిన్ను త్వరపెట్టు చున్నాడా అనిపించుచున్నది

**రాజా -** (స్పర్శం రూపయిత్వా) అభిజాతః ఖలు వసంతః

సఖే! పశ్య

**శ్లో** ఉన్మత్తానాం శ్రవణసుభగైః కూజితైః కోకిలానాం
సానుక్రోశం మనసిజరుజః సహ్యతాం పృచ్ఛతేవ ।
అఙ్గే చూతప్రసవసురభి ర్దక్షిణో మారుతో మే
సాంద్రస్పర్శః కరతల ఇవ వ్యాపృతో మాధవేన. ॥ 4

**విదూషకః -** ఏహి. ప్రవిశ. నిర్వృతి లాభాయ.

( ఉభౌ ప్రవిశతః )

**విదూషకః -** భో వయస్య! అవధానేన దృష్టిం దేహి. ఏత త్ఖలు భవంత మివ విలోభయితుకామయా ప్రమదవన లక్ష్మ్యా యువతీవేషలజ్జాపయితృకం వసంత కుసుమనేపథ్యం గృహీతమ్.

**రాజా -** నను విస్మయా దవలోకయామి.

**శ్లో** రక్తాశోకరుచా విశేషితగుణో బింబాధరాలక్తకః
ప్రత్యాఖ్యాత విశేషకం కురవకం శ్యామావదాతారుణమ్ ।

**రాజు :-** (స్పర్శను అభినయించి) ఈ వసంతుడు ఉన్నత వంశసంజాతుడు సుమా!

చెలికాడా! చూడుము

మదించిన కోకిలల శ్రవణసుభగములైన కూజితములచే (బంధువులను పరామర్శించునట్లు) ఈ వసంతుడు జాలిగా "మన్మథబాధను సహింపగలుగుచున్నావా? అని కుశల ప్రశ్నలు వేయుచున్నట్లున్నది " అట్లే ఈ వసంతుడు, మామిడి పూలతో సుగంధభరితమైన మలయమారుతమును ఆప్యాయముతో కూడిన స్పర్శగల హస్తతలము వలె చేసికొనుచు నా శరీరమును తాకి, పులకింపజేయుచున్నట్లున్నది. 4

**విదూషకుడు :-** రమ్ము సుఖము అను లాభమును పొందుటకై (ఈ వనములోనికి) ప్రవేశింపుము.

(ఇరువురు ప్రవేశింతురు )

**విదూషకుడు :-** మిత్రమా! శ్రద్ధగా ఇటు చూడుము. నిన్ను వలపింపజేయ గోరుచున్నదా అన్నట్లు ప్రమదవనలక్ష్మి, స్త్రీల అలంకరణమును సిగ్గిల్ల జేయుచు ఈ వసంత పుష్పాలంకారమును ధరించినది

**రాజు :-** నిజముగా ఆశ్చర్యముతో చూచుచున్నాను.

**విదూషకుడు :-** (ఈ వనమునందలి) రక్తాశోకవృక్షముల కాంతి దొండపండు వంటి క్రిందిపెదవియందలి లత్తుక [illegible] రాగము) గుణమును అతిశయించు [illegible]



**ఆక్రాన్తా తిలకక్రియాపి తిలకై ర్లగ్నద్విరేఫాంజనైః**
**సావజ్ఞేవ ముఖప్రసాధనవిధౌ శ్రీ ర్మాధవీ యోషితామ్. 5**

(ఇ త్యుద్యానశోభాం నిర్వర్ణయతః.)
(తతః ప్రవిశతి పర్యుత్సుకా మాలవికా.)

**మాలవికా -** అవిజ్ఞాత హృదయం భట్టారక మభిలషంతీ ఆత్మనో ఽపి తావ ల్లజ్జే. కుతో విభవః స్నిగ్ధస్యసఖీజనస్య ఇమం వృత్తాంత మాఖ్యాతుమ్. న జానే అప్రతీకార గురుకాం వేదనాం కియత్కాలం మదనో మాం నేష్యతీతి. (కతిచి త్పదాని గత్వా) కుత్ర ను ప్రస్థితాస్మి. (విచింత్య) ఆః సందిష్టాస్మి దేవ్యా "గౌతమచాపలా ద్దోలాపరిభ్రష్టాయాః సరుజో మే చరణః త్వం తావ ద్గత్వా తపనీయాశోకస్య దోహదం నిర్వర్తయ. యది స పంచరాత్రాభ్యంతరే కుసుమం దర్శయతి. తతః తుభ్యం (ఇత్యంతరా నిఃశ్వస్య) అభిలాషాపూరయి తృకం ప్రసాదం దాస్యామి'' ఇతి. త ద్యావ న్నియోగభూమిం ప్రథమం గతా భవామి. యావ దనుపదం మమ చరణాలంకారహస్తయా

రంగుగల కురవకపుష్పము (స్త్రీల) చెక్కిళ్ళయందలి పత్రభంగములను (బుగ్గలపై వేసుకొను అలంకరణరేఖలను) తిరస్కరించుచున్నది. తుమ్మెదలనెడు కాటుక అంటిన తిలకపుష్పములు స్త్రీల తిలకపు తీరును కూడ అతిక్రమించుచున్నవి. (కనుక) ఈ వసంతలక్ష్మి స్త్రీల ముఖాలంకరణ విధానవిషయమునందు తిరస్కారభావము కలదా అన్నట్లున్నది. 5

(అని ఇద్దరు ఉద్యానసౌందర్యమును తిలకింతురు )

(ఆ తరువాత ఉత్కంఠితయైన మాళవిక ప్రవేశించును.)

**మాళవిక :-** ప్రభువుయొక్క అభిప్రాయమును తెలిసికొనకుండగనే ఆతని నభిలషించుచున్నదాననై నా విషయమున నేనే సిగ్గుపడుచున్నాను ఈ నా ప్రేమవృత్తాంతమును ప్రియసఖీజనమునకు చెప్పుటకు ధైర్య మెక్కడిది? ప్రతిక్రియ లేని గొప్పబాధకు మన్మధుడు ఇంక నన్నెంత కాలము గుఱిచేయునో ఎఱుగలేకున్నాను (కొన్ని అడుగులు నడిచి) నే నిప్పు డెచ్చటికి బయలు దేరితిని? (ఆలొచించి) అవును దేవిచే ఆజ్ఞాపింపబడితిని ''గౌతముని చిలిపితనమువలన ఊయలనుండి జారిపడిన నా పాదము నొప్పి పెట్టుచున్నది. నీ విప్పుడు నాకు మారుగా ఉద్యానవనములోనికి వెళ్ళి, రక్తాశోకవృక్షమునకు దోహదక్రియను జరిపింపుము. అది ఐదురాత్రులలో పూత పట్టెనా! అప్పుడు నీకు, (అని మధ్యలో నిట్టూర్చి) అభిలాషను పూర్తిచెయు బహుమానము నిత్తును'' అని కనుక ఇప్పుడు ముందుగా నాకా జ్ఞాపింపబడిన ప్రదేశమునకే పోయెదను, పాదాలంకారసామగ్రిని చేతబట్టుకొని

వకులావలికయా ఆగంతవ్యమ్, పరిదేవయిష్యే తావ ద్విస్రబ్ధం ముహూర్తకమ్.

(ఇతి పరిక్రామతి.)

**విదూషకః -** (దృష్ట్వా) హీ, హీ, ఇయం ఖలు సీధుపానోద్వేజితస్య మత్స్యండి కోపనతా.

**రాజా -** అయే! కి మేతత్?

**విదూషకః -** ఏషా ఖలు నాతిపరిష్కృతవేషా, ఉత్సుకే వైకాకినీ మాలవికా అదూరే వర్తతే.

**రాజా -** (సహర్షం) కథం మాలవికా?

**విదూషకః -** అథ కిమ్?

**రాజా -** శక్య మిదానీం జీవిత మవలంబితుమ్.

**శ్లో.** **త్వ దుపలభ్య సమీపగతాం ప్రియాం**
**హృదయ ముచ్ఛ్వసితం మమ విక్లబమ్।**
**తరువృతాం పథికస్య పిపాసతః**
**సరిత మారసితాదివ సారసాత్.** ॥ 6

అథ క్వ తత్ర భవతీ?

**విదూషకః -** ఏషా తరురాజిమధ్యా న్నిష్క్రాంతా ఇత ఏవ పరివర్తమానా దృశ్యతే.

వకుళావలిక నా వెనువెంటనే వచ్చువరకు ఇప్పు డొక క్షణకాలము పాటు విశ్రాంతిగా విలపించుకొందును

(అని పరిక్రమించును.)

**విదూషకుడు :-** (చూచి) హీ హీ (అని నవ్వుచు) కల్లుత్రాగి మొగము మొత్తినవానికి పటికబెల్లము దొరికినది సుమా! (కల్లునకు పటికబెల్లము విరుగుడు అని పెద్ద లందురు. ఇరావతిని కల్లుగను, మాళవికను పటికబెల్లముగను ఇట విదూషకుడు వర్ణించినాడు.)

**రాజు :-** ఓహో! ఏమిది?

**విదూషకుడు .-** ఇదుగో! కొద్దిపాటి వేషమును ధరించి, ఉత్కంఠిత వలె ఒంటరిగా మాళవిక దగ్గరలోనే ఉన్నది.

**రాజు :-** (సంతోషముతో) ఏమీ? మాళవికయా

**విదూషకుడు :-** మరిఏమి?

**రాజు .-** ఇప్పుడు ప్రాణములను నిలుపుకొనుట శక్యమే!

చెట్లచే చుట్టబడి కనుమరుగైన నదిని, దప్పికగొనియున్న బాటసారి తెలిసికొని ఊరడిల్లినట్లు, దుఃఖితమైన నా హృదయము ప్రియురాలు చేరువనే ఉన్నదని, నీవలన తెలిసికొని, ఊరడిల్లుచున్నది 6

మఱి ఆమె ఎక్కడ?

**విదూషకుడు :-** ఇదుగో చెట్లగుంపులలోనుండి వెలువడి ఇటేవచ్చుచున్నట్లు కనబడుచున్నది

**రాజా** - (విలోక్య సహర్షం) వయస్య! పశ్యా మ్యేనామ్

**శ్లో.** **విపులం నితంబదేశే, మధ్యే క్షామం, సమున్నతం కుచయోః।**
**అత్యాయతం నయనయోః, మమ జీవిత మేత దాయాతి॥ 7**

సఖే! పూర్వస్మా దవస్థాంతరం ఉపారూఢా తత్ర భవతీ.

తథాహి

**శ్లో.** **శరకాండ పాండుగండస్థలేయ మాభాతి పరిమితాభరణా।**
**మాధవపరిణతపత్రా కతిపయ కుసుమేవ కుందలతా॥ 8**

**విదూషకః** - ఏషాపి భవానివ మదనవ్యాధినా పరామృష్టా దృశ్యతే.

**రాజా** - సౌహార్ద మేవం పశ్యతి.

**మాలవికా** - అయం స లలితదోహదాపేక్షీ అగృహీత కుసుమనేపథ్యో మాం ఉత్కంఠితా మనుకరోతి అశోకః. యావ దస్య ప్రచ్ఛాయశీతలే శిలాపట్టకే నిషణ్ణా ఆత్మానం వినోదయామి.

**విదూషకః** - శ్రుతం భవతా? ఉత్కంఠితాస్మీతి అత్ర భవతీ మంత్రయతే.

**రాజా** - నైతావతా ప్రసన్నతర్కం భవంతం మన్యే కుతః

**రాజు :-** (చూచి సంతోషముతో మిత్రమా) ఈమెను చూచుచున్నాను

ఈమె జఘనప్రదేశమున విపులమైనది. మధ్యప్రదేశమున (నడుము) చిక్కియున్నది. కుచయుగమున ఎత్తైనది కళ్ళుజంటలో అతివిశాలమై ఈ నాజీవితము ఇటే వచ్చుచున్నది 7

స్నేహితుడా! ఈమె పూర్వము కంటె భిన్నమైన అవస్థను పొంది యున్నది

ఎట్లనగా

తెల్లుకాడవలె తెల్లనైన చెక్కిళ్ళు గలిగి, కొద్దిగా ఆభరణములను ధరించిన ఈమె, వసంతకాలమునందు పండిన ఆకులుగలిగి, కొద్దిపూలను మాత్రమే పూచిన మల్లెతీగె వలె శోభిల్లుచున్నది.8

**విదూషకుడు :-** ఈమె కూడ నీ వలెనే ప్రేమవ్యాధిగ్రస్తురాలిగా కనబడుచున్నది

**రాజు :-** స్నేహమున కట్లే కనబడును.

**మాళవిక :-** సుకుమారమైన దోహదక్రియను అపేక్షించుచు, పుష్పాలంకరణము లేని, ఈ అశోకవృక్షము ఉత్కంఠితనైన నన్నే అనుకరించుచున్నది. దీని దట్టమైన నీడలో శిలాఫలకముపై కూర్చుండి, మనస్సును దుఃఖమునుండి మరలించుకొందును

**విదూషకుడు :-** వింటివా? నేను ఉంత్కంఠితురాలనై ఉన్నానని ఈమె పలుకుచున్నది.

**రాజు :-** ఇంతమాత్రముచేతనే నీ ఊహ సరియని (నిర్మలమైనదని) నే ననుకొనను, ఏలయనగా

శ్లో. **వోఢా కురవకరజసాం**
**కిసలయపుటభేదశీకరానుగతః ।**
**అనిమిత్తోత్కంఠా మపి**
**జనయతి మనసో మలయవాతః ॥ 9**

(మాలవికా ఉపవిష్టా.)

**రాజా -** సఖే! ఇతస్తావత్, ఆవాం లతాంతరితౌ భవావః.

**విదూషకః -** ఇరావతీ మివ అదూరే ప్రేక్షే.

**రాజా -** న హి కమలినీం దృష్ట్వా గ్రాహ మవేక్షతే మతంగజః.

( ఇతి విలోకయన్ స్థితః. )

**మాలవికా -** హృదయ! నిరవలంబా దతిభూమిలంఘినో మనోరథా ద్విరమ. కిం మా మాయాసయసి?

(విదూషకో రాజాన మవేక్షతే )

**రాజా -** ప్రియే! పశ్య వామతాం స్నేహస్య

శ్లో. **ఔత్సుక్యహేతుం వివృణోషి న త్వం**
**తత్త్వావబోధైకఫలో న తర్కః ।**
**తథాపి రంభోరు కరోమి లక్ష్యం**
**ఆత్మాన మేషాం పరిదేవితానామ్॥ 10**

ఈ మలయమారుతము, కురవకపుష్పముల పుప్పొడిని తనలో కలుపుకొని, చిగురు మొగ్గలు విరిసి చిందిన, తుంపురులతో కూడినదై, జనుల మనస్సులకు ఏ కారణము లేకుండగనే ఉత్కంఠను కలిగించుచున్నది. **9**

(మాళవిక కూర్చొనును.)

**రాజు :-** చెలికాడా! ఇటు రమ్ము. మన మిరువురము ఈ పూదీవల చాటున దాగిఉందము

**విదూషకుడు :-** సమీపమున ఇరావతి కనబడుచున్నట్లున్నది.

**రాజు .-** పద్మలతను చూచిన ఏనుగు మొసలిని గణింపదు గదా!

(అని చూచుచు నుండును.)

**మాళవిక :-** హృదయమా! నిరాధారమై, హద్దు మీరిపోవుచున్న ఈ మనోరథమునుండి విరమింపుము నన్నాయాసపెట్టెద వేల?

(విదూషకుడు రాజువంక చూచును.)

**రాజు :-** ప్రియురాలా! ప్రేమయొక్క వక్రత్వమును చూడుము.

నీవు నీ ఉత్కంఠకు కారణమును వెల్లడింపకున్నావు. యధార్థమును మాత్రమే బయటపెట్టుట తర్కముయొక్క ప్రయోజనము కాదు. అయినను ఓ రంభోరూ! (అరిటి బోదెలవంటి అందమైన తొడలు కలదానా!) ఈ దుఃఖములకు నన్నే లక్ష్యముగా గావించుకొనుచున్నాను. **10**

**విదూషకః -** సాంప్రతం భవతః నిస్సంశయం భవిష్యతి. ఏషా అర్పిత మదనసందేశా వివిక్తే ఏనాం వకులావలిః ఉపగతా.

**రాజా -** అపి స్మరే దస్మ దభ్యర్థనామ్?

**విదూషకః -** కి మిదానీ మేషా దాస్యాఃదుహితా తవ గురుకం సందేశం విస్మరతి? అహ మపి తావ న్న విస్మరామి

(ప్రవిశ్య చరణాలంకారహస్తా వకులావలికా)

**వకులావలికా -** అపి సుఖం సఖ్యాః?

**మాలవికా -** అహో! వకులావలికా! స్వాగతం తే! ఉపవిశ.

**వకులావలికా -** (ఉపవిశ్య) హలా! త్వ మిదానీం దేవ్యా యోగ్యతయ నియుక్తా. తస్మా దేకం తే చరణ ముపనయ. యాః త్సాలక్తకం సనూపురం కరోమి

**మాలవికా -** (స్వగతం) హృదయ! అలం సుఖితతయా ఉపస్థితో ఽయం విభవ ఇతి. కథ మిదానీం ఆత్మానం మోచయేయమ్? అథవా ఏతదేవ మే తావ న్మృత్యుమండనం భవిష్యతి.

**వకులావలికా -** కిం విచారయసి? ఉత్సుకా ఖల్వస్య తపనీయాశోకస్య కుసుమోద్గమే దేవీ.

**విదూషకుడు :-** ఇప్పుడే నీ అనుమానము తీఱిపోగలదు తాము ప్రేమ సందేశమునిచ్చి పంపిన వకుళావలిక ఏకాంతమున ఇదుగో ఈమెను చేరవచ్చినది.

**రాజు :-** ఈమె మా ప్రార్థనను గుర్తుంచుకొనునా?

**విదూషకుడు :-** ఈ దాసీపుత్రి గొప్పదైన మీ సందేశమును ఇప్పుడు మరచునా? (మరువదు.) ఇప్పటికి నేనే మరవలేదు.

(చరణముల కలంకరింపవలసిన వస్తువును చేతబట్టుకొని, వకులావలిక ప్రవేశించి).

**వకుళావలిక :-** చెలికి సుఖమా?

**మాళవిక :-** అబ్బో! వకులావలికయా? నీకు స్వాగతము. కూర్చుండుము.

**వకుళావలిక :-** (కూర్చుండి) చెలీ! నీవు యోగ్యురాలవగుటచే, దేవిచే ఇప్పుడు (ఈ అశోకవృక్షమునకు దోహదక్రియను నిర్వర్తించుటకై) నియుక్తురాలి వైతివి. కనుక నీ పాదమును నా వద్దకు చాచుము. ఇప్పుడే దీనికి పారాణిని పూసి, అందెను తొడుగుదును

**మాళవిక :-** (తనలో) హృదయమా ఈ వైభవము లభించినది కదా యని ఆనందింపకుము. ఇప్పుడు ఈ రాణి బారినుండి ఎట్లు తప్పించుకొందును? లేనిచో ఇదియే నాకు మృత్యుమండనము (మరణించినవారికి చేయు అలంకారము) అగును

**వకుళావలిక :-** ఏమి ఆలోచించుచున్నావు? ఈ బంగారపుటశోకము, పూత పట్టవలెనని దేవి ఉబలాటపడుచున్నది కదా!

**రాజా** - కథ మశోకదోహద నిమిత్తో ఉయ మారంభః?



**రాజు :-** ఏమీ! ఈ ప్రయత్నమంతయు అశోకవృక్షమునకు దోహదము చేయుటకొఱకా? (ఈ క్రింది చెట్లకు అకాలమునందు త్వరగా పుష్పింపజేయుటకు చేయబడు క్రియనే దోహదక్రియ అందురు. అవి

"స్త్రీణాం స్పర్శాత్ ప్రియంగు ర్వికసతి,
వకుల స్సీధుగండూషసేకాత్,
పాదాఘాతా దశోక, స్తిలకకురవకౌ
వీక్ష ణాలింగనాభ్యామ్।
మందారో నర్మవాక్యాత్, పటుమృదు
హసనా చ్చంపకో, వక్త్రవాతాత్
చూతో, గానా న్నమేరుః వికసతి, చ పురో
నర్తనాత్ కర్ణికారః"॥

1. ప్రియంగులత, అందమైన స్త్రీలు తనను స్పృశించుటచేత వికసించును 2.వకులవృక్షము (పొగడచెట్టు) అందమైన స్త్రీలు, తాంబూలమును వేసికొని బాగుగా నమిలి తనపై ఉమ్మివేసినచో పూయును. 3. అశోకవృక్షము అందమైన స్త్రీ, చక్కగా అలంకరించుకొని పాదముతో తన్నినచో పుష్పించును. 4 తిలక వృక్షము సుందరిచేత చూడబడియు, 5. కురవకవృక్షము అందమైన స్త్రీచే ఆలింగింపబడియు పూయును. 6 మందార వృక్షము అందమైన స్త్రీచే నర్మవాక్యములు పలుకబడి పూయును. 7 మృదువుగా బిగ్గరగా నవ్వుటచే చంపకము వికసించును, 8. అందమైన స్త్రీ, నోటితో గాలిని ఊదుటవలన చూతవృక్షము పుష్పించును. 9 నమేరువృక్షము గానముచేత పుష్పించును అట్లే 10 కర్ణికారవృక్షము అందమైన స్త్రీ ఆ చెట్టున కెదుట నృత్యముచేయుట వలన దోహదమునంది, పుష్పించును.)

**విదూషకః -** కిం ను ఖలు జానాసి త్వం "మమ కారణాత్ దేవీ ఇమా మంతఃపుర నేపథ్యేన యోజయిష్యతి" ఇతి.

**మాలవికా -** హలా! మర్షయేదానీమ్ (ఇతి పాద ముపహరతి.)

**వకులావలికా -** అయి! శరీర మసి మే. (నాట్యేన చరణసంస్కార మారభతే.)

**రాజా -**

శ్లో. **చరణాంత నివేశితాం ప్రియాయాః**
**సరసాం పశ్య వయస్య రాగరేఖామ్ ।**
**ప్రథమా మివ పల్లవప్రసూతిం**
**హరదగ్ధస్య మనోభవ ద్రుమస్య ॥ 11**

**విదూషకః -** చరణానురూపః ఖలు తత్ర భవత్యా అధికారః ఉపక్షిప్తః.

**రాజా -** సమ్య గభిహితం భవతా

**శ్లో. నవకిసలయరాగే ణార్ద్రపాదేన బాలా**
**స్ఫురితనఖరుచా ద్వౌ హంతు మర్హ త్యనేన ।**
**అకుసుమిత మశోకం, దోహదాపేక్షయా వా**
**ప్రణమితశిరసం వా కాంత మార్ద్రాపరాధమ్ ॥ 12**

**విదూషకః -** ప్రహరిష్యతి ఖలు తత్రభవతీ త్వా మపరాద్ధమ్.

**రాజా -** మూర్ధ్నా ప్రతిగృహీతం వచః, సిద్ధదర్శినో బ్రాహ్మణస్య.

**విదూషకుడు .** "నా కొరకే ఈ ధారిణీదేవి ఈ మాళవికకు అంతఃపురాలంకరణమును చేయించుచున్న" దనుకొనుచున్నావు కాబోలును

**మాళవిక :-** చెలీ! ఇప్పటికి క్షమింపుము! (అని తన పాదమును అందించును.)

**వకుళావలిక :-** చెలీ! నీవు నా శరీరమవుకదా! (నాట్యముతో చరణాలంకరణము నారంభించును.)

**రాజు :-** మిత్రమా! శివునిచే కాల్చబడిన, మన్మధుడు అను వృక్షము యొక్క తొలిచిగురాకును బోలిన, ప్రియురాలి పాదము నందుంచిన సరసమైన ఈ రాగరేఖను చూడుము. 11

**విదూషకుడు :-** (సుందర సుకుమార మైన ఈ ) పాదమునకు తగిన పనినే దేవి అప్పగించినది

**రాజు .-** నీవు చక్కగా చెప్పితివి.

లేతచిగురాకు వలె ఎఱ్ఱనై, పారాణిచే తడికలదై, మెఱియుచున్న గోళ్ళుకల, పాదముతో ఈ బాల,1. దోహదాపేక్షతో వికసింపకయున్న ఈ అశోకవృక్షమును గాని, 2. అపరాధము చేసి పట్టుబడి, తలవంచుకొనియున్న ప్రియుని తలను గాని, ఈ రెంటిని తన్నుటకు తగియున్నది. 12

**విదూషకుడు :-** అపరాధివైన నిన్ను పూజ్యురాలు తప్పక తాడింపగలదు

**రాజు :-** సిద్ధిదర్శనుడైన బ్రాహ్మణుని మాటను శిరసా ప్రతిగ్రహించుచున్నాను

(తతః ప్రవిశతి యుక్తమదా ఇరావతీ చేటీ చ.)

**ఇరావతీ-** సఖి! నిపుణికే శృణోమి బహుశో మదఃకిల స్త్రీ జనస్య విశేషమండన మితి. అపి సత్యోఽయం లోకవాదః.

**నిపుణికా -** ప్రధమం లోకవాద ఏవ, సాంప్రతం సత్యః సంవృత్త.

**ఇరావతీ -** అలం మయిస్నేహేన. కధయ కుత ఇదానీ మవగతం 'దోలాగృహం ప్రధమ మాగతో భర్తా?' ఇతి.

**నిపుణికా -** భట్టిన్యా అఖండితా త్ప్రణయాత్.

**ఇరావతీ -** అలం సేవయా. మధ్యస్థతాం పరిగృహ్యా భణ.

**నిపుణికా -** నను వసంతోపాయన లోలుపే నార్యగౌతమేన కథితమ్. త్వరతాం భట్టినీ.

**ఇరావతీ -** (అవస్థా సదృశం పరిక్రమ్య) సఖి! మదేన క్లామ్యంతీ మాం ఆర్యపుత్రదర్శనే హృదయం త్వరయతి. చరణౌ పున ర్మార్గే న ప్రసరతః.

(అంతట మత్తిల్లియున్న ఇరావతియును, ఆమె చెలికత్తెయును ప్రవేశింతురు )

**ఇరావతి :-** చెలీ ! నిపుణికా ! "స్త్రీజనమునకు మదము అలంకార విశేష మగును" అని పలుమార్లు విన్నాను ఈ లోకవాదము సత్యమేనా?

**నిపుణిక :-** మొదట లోకవాదము మాత్రమే! ఇప్పుడు అది నిజమే అయినది

**ఇరావతి :-** నా పట్ల గల స్నేహముచాలులే! ప్రభువువారు ముందుగనే డోలాగృహములోనికి ప్రవేశించినారని నీకెట్లు తెలిసినదో చెప్పుము.

**నిపుణిక :-** భట్టిని యొక్క అఖండితమైన ప్రేమ వలన

**ఇరావతి .-** ఉపచార వాక్యములు చాలును. మధ్యస్థత్వమును వహించి చెప్పుము

**నిపుణిక :-** వసంతనైవెద్యముకొఱకు ఉవ్విళ్ళూరుచున్న, ఆర్యగౌతముని చేత చెప్పబడినది సుమా! భట్టిని త్వరపడును గాక!

**ఇరావతి .-** (తన అవస్థకు తగినట్లు పరిక్రమించి)మత్తుచేసోలుచున్న నన్ను నా హృదయము, ఆర్యపుత్రదర్శనమునకై త్వరపెట్టుచున్నది మరి నా కాళ్లు మాత్రము దారిన ముందుకు సాగకున్నవి.

**నిపుణికా -** నను సంప్రాప్తే స్వో డోలాగృహమ్.

**ఇరావతీ -** నిపుణికే! నాత్రార్యపుత్రో దృశ్యతే.

**నిపుణికా-** నను భట్టి న్యవలోకయతు. పరిహాస నిమిత్తం కుత్రాఽపి గూఢేన భర్త్రా భవితవ్యమ్. ఆవామ పీదం ప్రియంగులతాపరిక్షిప్తం అశోకశిలాపట్టకం ప్రవిశావః.

(ఇరావతీ తథా కరోతి.)

**నిపుణికా-** (పరిక్రమ్య విలోక్య) అవలోకయతు భట్టినీ. చూతాంకురం విచిన్వత్యో రావయోః పిపీలికాభి ర్దష్టమ్

**ఇరావతీ -** కి మివైతత్.

**నిపుణికా** ఏషా వకులావలికా. అశోకపాదపచ్ఛాయాయాం మాలవికాయాః చరణాలంకారం నిర్వర్తయతి.

**ఇరావతీ** (శంకాం రూపయిత్వా) అభూమి రియం మాలవికాయాః. కథ మత్ర తర్కయసి?

**నిపుణికా** తర్కయామి దోలాపరిభ్రష్టయా సరుజచరణయా దేవ్యా అశోకదోహదాధికారే మాలవికా నియుక్తేతి. అన్యథా కథం దేవీ స్వయంధారితం నూపురయుగలం పరిజనస్య అభ్యనుజ్ఞాస్యతి?

**ఇరావతీ** మహతీ ఖల్వస్యాః సంభావనా.

**రాజు** - మిత్రమా! ఇటు చూడు చూడు

తడిగానున్న, పారాణితో కూడిన ఆమె పాదమును నోటిగాలితో ఊది, ఎండింపజేయుచు సేవించుటకు ఇప్పుడు నాకు ప్రశస్తమైన అవకాశము లభించినది **13**

**విదూషకుడు** :- నీకు అంతతహతహ ఏల? చిరకాలము అనుభవింపదగిన ఈ అవకాశము నీకు అచిరకాలముననే రాబోవుచున్నది

**వకుళావలిక** : చెలీ! నీ చరణము ఎఱ్ఱనితామర వలె ప్రకాశించుచున్నది ఎల్లప్పుడు నీ బర్తఒడిలో ఉండుదానవు కమ్ము

(ఇరావతి నిపుణికముఖములోనికి చూచును.)

**రాజు** .- ఇది నాకు ఆశీర్వచనము

**మాళవిక** - చెలీ! అసంగతముగా (అనుచితముగా) ఆలోచింపకుము

**వకుళావలిక** ·- ఆలోచింపవలసిన మాటనే తలిచితిని

**మాళవిక** - నేను నీ కిష్టురాలను కదా!

**వకుళావలిక** :- నాకు మాత్రమే కాదు

**మాళవిక** - మఱి ఇంకెవరికో?

**వకుళావలిక** :- గుణములయం దనురాగముగల ప్రభువునకు కూడా.

**మాళవిక** .- అసత్యమును భావించుచున్నావు అది (ప్రేమ) నా(మనసు)లో లేదు

**నిపుణికా** కిం నాన్విష్యతే భర్తా?

**ఇరావతీ** సఖి! న మే చరణౌ అగ్రతః ప్రవర్తేతే. మనో ఽపి కి మపి వికారయతి. ఆశంకితస్య తావ దంతం గమిష్యామి. (మాలవికాం నిర్వర్ణ్య ఆత్మగతం) స్థానే ఖలు కాతరం మే హృదయమ్.

**వకులావలికా** (మాలవికాయై చరణం దర్శయంతీ) అపి రోచతే తే ఽయం రాగరేఖావిన్యాసః?

**మాలవికా** ఆత్మన శ్చరణగత ఇతి లజ్జే ఏనం ప్రశంసితుమ్. కథయ కేనవా ప్రసాధనకలాయా మభివినీతా ఽసి?

**వకులావలికా** అత్ర ఖలు భర్తుః శిష్యాస్మి.

**విదూషకః** త్వర స్వేదానీం గురుదక్షిణాయై.

**మాలవికా** దిష్ట్యా న గర్వితాసి.

**వకులావలికా** ఉపదేశానురూపే చరణే లబ్ధ్వా ఇదానీం గర్వితా భవిష్యామి. (ఆత్మగతం) హంత! సిద్ధం మే దూత్యం. (రాగం విలోక్య, ప్రకాశం) సఖి! ఏకస్య తే చరణస్యావసితో రాగనిక్షేపః. కేవలం ముఖమారుతో లంభయితవ్యః. అథవా ప్రవాతమేవ ఏత త్థానమ్

**విదూషకుడు :-** ప్రభువును వెదకవేమి?

**ఇరావతి .-** చెలీ ! నా పాదములు ముందునకు సాగుట లేదే. మనస్సుకూడ ఏదో వికారమును పొందుచున్నది. ఈ అనుమానముయొక్క పర్యవసానమును (అంతును) చూతునుగాక ! నా హృదయము పిరికిది యగుటకూడ సహజమే!

**వకుళావలిక :-** (మాళవికకు పాదమును చూపుచు) ఈ పారాణిపూతతీరు నీకు నచ్చినదా?

**మాళవిక .-** (ఈ అలంకారము) నాపాదములయం దున్నది కనుక దీనిని ప్రశంసించుటకు సిగ్గుపడుచున్నాను. ఈ అలంకరణ శిల్పమును ఎవరి వద్ద నేర్చుకొంటివి?

**వకుళావలిక :-** ఈ విషయమున దేవరవారి శిష్యురాలనైతిని.

**విదూషకుడు :-** గురుదక్షిణ(నిచ్చుట)కై త్వరపడుమమ్మా!

**మాళవిక :-** అదృష్టవశమున నీవు గర్వపడకున్నావు.

**వకుళావలిక .-** నేర్చుకొనిన కళకు తగిన చరణములు దొరుకుటవలన ఇప్పుడు గర్వింపగలను. (తనలో) అబ్బో నా దౌత్యము నెఱవేరినది (ఎఱ్ఱరంగునుచూచి, ప్రకాశముగా) చెలీ! నీ చరణములలో ఒక దానికి రంగువేయుట పూర్తిఅయినది. (రంగు ఆరుటకై) కేవలము నోటి గాలి మాత్రమే ఊదవలసియున్నది. అక్కరలేదులే! ఈ ప్రదేశమున గాలి ఎక్కువగనే ఉన్నది.

**శ్లో.** **భావజ్ఞానానంతరం ప్రస్తుతేన**
**ప్రత్యాఖ్యానే దత్తయుక్తోత్తరేణ।**
**వాక్యేనేయం స్థాపితా స్వే నిదేశే**
**స్థానే ప్రాణాః కామినాం దూత్యధీనాః॥ 14**

**ఇరావతీ** సఖి! ప్రేక్షస్వ, కారితైవ వకులావలికయా ఏతస్మిన్ పదం మాలవికా

**నిపుణికా** భట్టిని! నిర్వికారస్యా ప్యుత్సుకతాజనక ఉపదేశః.

**ఇరావతీ** స్థానే ఖలు శంకితం మే హృదయమ్ గృహీతార్థా అనంతరం చింతయిష్యామి.

**వకులావలికా** ఏష ద్వితీయో ఽపి తే నిర్వృత్తపరికర్మా చరణః యావత్ ద్వావపి సనూపురౌ కరోమి (ఇతి నాట్యేన నూపురయుగళ మాముచ్య) హలా, ఉత్తిష్ఠ, అనుతిష్ఠ ఇదానీం దేవ్యా అశోకవికాసయితృకం నియోగమ్.

(ఉభే ఉత్తిష్ఠతః)

**ఇరావతీ** శ్రుతం దేవ్యా నియోగ ఇతీదానీమ్.

**వకులావలికా** ఏష ఉపారూఢరాగః ఉపభోగక్షమః పురతః తే తిష్ఠతి.

**మాలవికా** (సహర్షం) కిం భర్తా?

**నిపుణిక .** మన మిరువురము డోలాగృహమునకు చేరితిమి కదా!

**ఇరావతి :-** నిపుణికా! ఇచ్చట ఆర్యపుత్రుడు కనబడుట లేదే!

**నిపుణిక -** భట్టినీ ! సరిగా చూతురుగాక! లేదా పరిహాసమునకై ప్రభువు ఎందైనను దాగియుండెనేమో! మనము కూడ ప్రియంగులతలతో చుట్టబడిన ఈ అశోకవృక్షపు క్రింది భాగమునకు ప్రవేశింతము

(ఇరావతి అట్లే చేయును.)

**నిపుణిక -** (కొంత నడిచి, చూచి) భట్టిని ఇటు చూతురుగాక! మామిడి చిగురులను వెదకుచున్న మనలను చీమలు కుట్టినవి.

**ఇరావతి .-** ఇది ఏమిటో?

**నిపుణిక -** ఇదుగో వకుళావలిక అశోక వృక్షపు నీడలో మాళవికయొక్క కాలికి అలంకరణము చేయుచున్నది

**ఇరావతి ·** (అనుమానమును నటించి) ఇది మాలవికకు చేరరానిచోటుకదా! నీ వీ విషయమున ఏమనుకొనుచున్నావు?

**నిపుణిక :-** ఊయలనుండి పడి, కాలు నొచ్చినదేవి, అశోకవృక్షమునకు దోహదక్రియను నిర్వర్తింపుమని మాళవికను ఆజ్ఞాపించి యుండునని యూహించుచున్నాను కానిచో తాను ధరించిన అందెల జతను పరిజనము ధరించుటకు దేవి ఎట్లనుమతించును?

**ఇరావతి -** (ఈ మాళవికకు) ఇది గొప్ప గౌరవము సుమా!

**వకులావలికా** సత్యం త్వయి నాస్తి. భర్తుః కృశేషు దరపాండురేషు దృశ్యతే ఽంగేషు.

**నిపుణికా** ప్రథమ గణితమివ హతాశాయా ఉత్తరమ్.

**వకులావలికా** "అనురాగో ఽనురాగేణ పరీక్షితవ్య" ఇతి సుజన వచనం ప్రమాణీకురు.

**మాలవికా** కి మాత్మనః ఛందేన మంత్రయసే?

**వకులావలికా** నహి. నహి. భర్తుః ఖల్వేతాని ప్రణయ మృదుకాని అక్షరాణి బింబాంతరితాని.

**మాలవికా** సఖి! దేవీం చింతయిత్వా న మే హృదయస్య ప్రభవిష్యామి.

**వకులావలికా** ముగ్ధే! భ్రమరసంబాధో భవిష్యతీతి వసంతావతార సర్వస్వం కిం న చూతప్రసవో ఽవతంసయితవ్యః.

**మాలవికా** త్వం తావ ద్దుర్జాతే మమాత్యంతసహాయినీ భవ.

**వకులావలికా** విమర్దసురభిః వకులావలికా ఖ ల్వహమ్!

**రాజా** సాధు వకులావలికే! సాధు.

**వకుళావలిక -** నిజముగా (ప్రేమ) నీలో లేదు. చిక్కి ఇంచుక పాలిపోయిన ప్రభువుయొక్క అవయవములయందు కనబడుచున్నది.

**నిపుణిక .-** ఈ హతాశురాలియొక్క సమాధానము, ముందే సిద్ధము చేసికొని వచ్చినట్లున్నది

**వకుళావలిక ·-** "అనురాగమును అనురాగముచేతనే పరీక్షింపవలెను" అను సుజనుల వాక్యమును ప్రమాణముగా తీసికొనుము.

**మాళవికా :-** ఏమీ! నీ ఇష్టమునుబట్టి మాట్లాడుచున్నావా?

**వకుళావలిక -** కాదు, కాదు, ప్రణయ సుకుమారమైన ఈ పలుకులు దేవర వారివే! వేఱొకచోటి నుండి వినబడుచున్నవి.

**మాళవిక .-** చెలీ! దేవిని తలచుకొని, నా హృదయమును దృఢపఱచుకొన లేక పోవుచున్నాను

**వకుళావలిక ·-** ముద్దరాలా! తుమ్మెద బాధకలుగునని వసంతర్తువునకు సర్వస్వమైన మామిడిపువ్వును చెవిపై అలంకరించుకొన కుందురా?

**మాళవిక ·-** మఱి (నాకు కలిగిన) ఈ ఇబ్బందిలో ఇంక నీవే నాకు గొప్పతోడు కావలెను

**వకుళావలిక :-** మర్దించిన కొలది పరిమళించు వకులావలికను సుమా నేను!

**రాజు :-** మేలు వకులావలికా! మేలు.

**రాజా** సఖే! పశ్య పశ్య

**శ్లో.** **ఆర్ద్రాలక్తక మస్యాశ్చరణం ముఖమారుతేన వీజయితుమ్।**
**ప్రతిపన్నః ప్రథమతరః సంప్రతి సేవావకాశో మే ॥ 13**

**విదూషకః** కుత స్తే ఽనుశయః, చిరం భవత్యై తదనుభవితవ్యం అచిరేణ

**వకులావలికా** సఖి! అరుణశతపత్రమివ శోభతే చరణమ్ సర్వథా భర్తు రంకపరివర్తినీ భవ

(ఇరావతీ నిపుణికాముఖ మవేక్షతే )

**రాజా** మ మేయ మాశీః

**మాలవికా** హలా! మా అవినితం మన్త్రయస్వ.

**వకులావలికా** మంత్రయితవ్య మెవ మయా మంత్రితమ్

**మాలవికా** ప్రియా ఖల్వహం తవ.

**వకులావలికా** న కేవలం మమ.

**మాలవికా** కస్య వాన్యస్య?

**వకులావలికా** గుణేష్వభినివేశినో భర్తు రపి.

**మాలవికా** అలీకం మంత్రయసి, ఏతదేవ మయి నాస్తి

**మాళవిక** - చెసిన దోహదక్రియకు ఫలము సత్యమని నిరూపించుటకై ఈ అశోకవృక్షము ఇంతవరకు పూలుపూయక, మనకు ప్రతికూలముగా ఉన్నది. (ఈ వృక్షమునకు) మనము చేసిన సమ్మానము సఫలమైనచొ ఎంత బాగుండును?

**వకుళావలిక** :- సఖీ నీదొషము లేదు ఇటువంటి చరణసంస్కారమును పొందియు పూతపట్టుటలో ఆలసించినచో ఈ అశోకమే గుణహీన మగును

**రాజు** - ఓ అశోకమా! ఈ తలొదరిచే ఘల్లు ఘల్లని మ్రోగునూపురములు కల, నవపద్మసుకుమారమైన, పాదముచె సమ్మానింపబడియు, వెంటనే మొగ్గలు తొడుగవేని, లలితకాముకులకు సాధారణముగా లభించు ఈ దోహదమును వృధాగా పొందినట్లగును! **17**

మిత్రమా! (ప్రత్యక్షముగా) మాటాడుటకు అవకాశము కలుగునట్లు ప్రవేశింపగోరుచున్నాను.

**విదూషకుడు** .- రమ్ము ఈమెను పరిహాసము చేయుదును

(ఇరువురును ప్రవేశింతురు.)

**నిపుణిక** :- భట్టిని! ప్రభువు ఇక్కడికే ప్రవేశించుచున్నాడు

**ఇరావతి** :- ఇట్లగునని ఇంతకు ముందే నా హృదయ మనుకొనినది

**విదూషకుడు** :- (సమీపించి) పూజ్యురాలా! ప్రభువుగారి ప్రియమిత్రమైన ఈ అశొకవృక్షమును, ఎడమకాలితో తన్నుట యుక్తమేనా?

**వకులావలికా** (సస్మితం) న తావ ద్భర్తా. ఏష అశోకశాఖావలంబీ-పల్లవగుచ్ఛకః. అవతంసయ తావ దేనమ్.

(మాలవికా విషాదం నాటయతి.)

**విదూషకః** అపి శ్రుతం భవతా?

**రాజా** సఖే! పర్యాప్త మేతావతా కామినామ్,

**శ్లో.** **అనాతురోత్కంఠితయోః ప్రసిద్ధ్యతా**
**సమాగమేనాపి రతి ర్న మాం ప్రతి ।**
**పరస్పరప్రాప్తి నిరాశయో ర్వరం**
**శరీరనాశో ఽ పి సమానురాగయోః ॥ 15**

(రచిత పల్లవావతంసా మాలవికా సలీల మశోకతాడనాయ పాదం ప్రహిణోతి )

**రాజా** వయస్య! పశ్య.

**శ్లో.** **ఆదాయ కర్ణకిసలయ మస్మా దియ మత్ర చరణ మర్పయతి।**
**ఉభయోః సదృశ వినిమయా దాత్మానం వంచితం మన్యే.॥ 16**

**వకుళావలిక :-** (చిఱునవ్వుతో) భర్త కాదు ఇదుగో అశోకవృక్షపు కొమ్మనుండి వ్రేలాడుచున్న చిగురుగుత్తి దానిని చెవిపై అలంకరించు కొనుము

**మాళవిక :-** (మాళవిక విషాదమును నటించును )

**విదూషకుడు :-** దేవరవారు వింటిరా?

**రాజు -** సఖుడా! కాముకులకు ఇంత మాత్రము చాలును.

ఒకరు అనాతురుడును, మరొకరు ఉత్కంఠితయును అయిన మా జంటకు ఇప్పుడు కలయిక సిద్ధించినను (దానివలన) నా కిప్పుడు సంతోషము కలుగదు పరస్పర ప్రాప్తిపట్ల నిరాశులైన తుల్యానురాగులకు శరీరనాశ మైనను కొంత మేలే! **15**

(అశోకపల్లవమును అవతంసకముగా దాల్చి, మాళవిక సవిలాసముగా అశోకవృక్షమును తాడించుటకై పాదమును చాచును )

**రాజు .-** స్నేహితుడా! చూడుము

ఈ వృక్షమునుండి ఈమెకర్ణకినలయమును చెవిలో ఉంచుకొను చిగురాకును తీసికొని, ఈమె ఆ వృక్షముమీద తన పాదము నుంచుచున్నది. (ఈవిధముగా) ఒండొరులకు తగిన వానిని వీరిరువురు ఇచ్చిపుచ్చుకొనుటవలన, నన్ను వంచితునిగా భావించుకొనుచున్నాను. **16**

(మాలవికా లజ్జాం రూపయతి.)

**ఇరావతీ** (సానూయం) అహో! నవనీతకల్పహృదయ ఆర్యపుత్రః.

**మాలవికా** వకులావలికే! ఏహిం అనుష్ఠిత మాత్మనో నియోగమ్ దేవ్యై నివేదయావః.

**వకులావలికా** తేన హి విజ్ఞాపయ భర్తారం విసృజేతి.

**రాజా** భద్రే! యాస్యసి. మమ తావ దుత్పన్నావసర మర్థిత్వం శ్రూయతామ్.

**వకులావలికా** అవహితా శ్రుణు. ఆజ్ఞాపయతు భర్తా

**రాజా**

**శ్లో.** **ధృతిపుష్ప మయ మపి జనో బధ్నాతి న తాదృశం**
**చిరా త్ప్రభృతి ।**
**స్పర్శామృతేన పూరయ దోహద మస్యా**
**ప్యనన్యరుచేః॥ 19**

**ఇరావతీ** (సహసోపసృత్య) పూరయ! పూరయ! అశోకః కుసుమమ్ దర్శయతి వా న వా? అయం పునః పుష్యతి ఫలతి చ!

(సర్వే ఇరావతీం దృష్ట్వా సంభ్రాంతాః )

**రాజా** (అపవార్య) వయస్య, కా ప్రతిపత్తి రిదానీమ్

బావమును పసికట్టిన అనంతరము ప్రస్తావనచేసి, (మాటను) త్రోసిపుచ్చినపుడు తగుసమాధానమును చెప్పి, మాటచేత ఈ మెను నీకు వశవర్తినిని గావించుకొంటివి కాముకుల ప్రాణములు దూతికల అధీనములనుట యుక్తమే 14

**ఇరావతి** - చెలీ! చూడుము. వకుళావలిక . మాళవికను రాజు యందు తగుల్కొలుపనే కొలిపినది

**నిపుణిక :-** భట్టిని! నిర్వికారులకు కూడ ఆసక్తిని కలిగించునట్టిదీ ఉపదేశము.

**ఇరావతి** · నా హృదయము శంకితమగుట ఉచితముగనే ఉన్నది విషయమును తెలిసికొని, తరువాత ఆలోచింతును.

**వకుళావలిక** ·- ఇదిగో నీ రెండవపాదమునకు కూడ అలంకరణము పూర్తి అయినది ఇప్పుడు రెండింటికిని అందెలను తొడుగుదును. (అని అందెలను తొడుగుచున్న ట్లభినయించి) చెలీ! లెమ్ము, అశోకమును వికసింపజేయు దేవియొక్క ఆజ్ఞను ఇంక అనుష్ఠింపుము

(ఇద్దఱు లేతురు)

**ఇరావతి :-** "దేవిగారి ఆజ్ఞ అను మాటను ఇప్పుడు వింటివా?

**వకుళావలిక :-** ఇదుగో! అతిశయముగా రాగము కలిగి, ఉపభోగింపదగి నీ ఎదుట కనబడుట లేదా?

**మాళవిక :-** (సంతోషముగా) ఏమీ? భర్తయా?

**ఉభౌ** అహో !భర్తా !

**విదూషకః** వకులావలికే! గృహీతార్థయా త్వయా అత్రభవతీ ఈదృశ మవినయం కుర్వతీ కస్మాత్ న నివారితా. (మాలవికా భయం రూపయతి.)

**నిపుణికా** భట్టిని! పశ్య. కిం ప్రవృత్త మార్యగౌతమేన!

**ఇరావతీ** కథం బ్రహ్మబంధు రన్యథా జీవిష్యతి?

**వకులావలికా** ఆర్య! ఏషా దేవ్యా నియోగ మనుతిష్ఠతి. ఏతస్మి న్నతిక్రమే పరవతీయమ్. త త్ర్పసీదతు భర్తా.

(ఇతి ఆత్మనా సహైనాం ప్రణిపాతయతి.)

**రాజా** యద్యేవ మనపరాద్ధాసి. భద్రే! ఉత్తిష్ఠ (హస్తేన గృహీత్వా ఏనాం ఉత్థాపయతి.)

**విదూషకః** యుజ్యతే దేవ్యత్ర మానయితవ్యా.

**రాజా** (విహస్య)

**శ్లో.** **కిసలయమృదో ర్విలాసిని! కఠినే నిహితస్య**
**పాదపస్కంధే**
**చరణస్య న తే బాధా సంప్రతి వామోరు**
**వామస్య॥ 18**

**ఇరువురు :-** (కంగారుతో ) అమ్మో! ప్రభువులవారు!

**విదూషకుడు :-** వకులావలికా! విషయము తెలిసిన నీ వయినను, ఇట్టి అపచారమును చేయుచున్న ఈమెను ఏల నివారింపవైతివి?

(మాలవిక భయమును ప్రదర్శించును )

**నిపుణిక·** భట్టిని! ఆర్యగౌతము డేమి యారంభించినాడో చూడుము

**ఇరావతి :-** ఈభ్రష్టబ్రాహ్మణుడు వేరెట్లు జీవింపగలడు?

**వకుళావలిక :-** అయ్యా! ఈమె దేవిగారి ఆజ్ఞను అనుసరించినది. ఈ నేరము నం దీమె అస్వతంత్రురాలు కనుక, ప్రభువులవారు మన్నింతురు గాక!

(అని తనతో గూడ మాళవికను రాజుకు మ్రొక్కించును.)

**రాజు :-** అట్లయినచో నీవు అనపరాధినివే! కల్యాణీ! లెమ్ము (మాళవికను చేతితో పట్టుకొని లేవదీయును.)

**విదూషకుడు .-** మంచిది ఈ విషయమున దేవి మన్నింపదగినది (గౌరవింపదగినది )

**రాజు :-** (నవ్వి)

వామోరూ! (అందమైన తొడలు కలదానా!) విలాసినీ! కఠినమైన ఈ వృక్షస్కంధముపై ఉంచిన నీ ఈ కిసలయములవలె మృదువైన వామపాదమునకు ఇప్పుడు నొప్పికలుగలేదు కదా?

**మాలవికా** వామః ఖల్వేష అశోకః యో వ్యంజకం ప్రమాణీకృత్య కుసుమోద్గమం న దర్శయతి. అపినా మావయ్యోః సంభావనా సఫలా భవేత్?

**వకులావలికా** హలా! నాస్తి తే దోషః. అయ మేవ నిర్గుణః అశోకః యది కుసుమోద్గమనమంధరో భవే ద్య స్తే ఈదృశం చరణసంస్కారం లబ్ధ్వా.

**రాజా**

శ్లో. **అనేన తనుమధ్యయా ముఖరనూపురారావిణా**
**నవాంబురుహకోమలేన చరణేన సంభావితః।**
**అశోక! యది సద్య ఏవ ముకులై ర్న సంపత్స్యసే**
**ముధా వహసి దోహదం లలితకామిసాధారణమ్॥17**

సఖే! వచనావకాశపూర్వకం ప్రవేష్టు మిచ్ఛామి

**విదూషకః** ఏ హ్యేనాం పరిహాసయిష్యామి

( ఉభౌ ప్రవేశం కురుతః )

**నిపుణికా** భట్టిని! భర్తా త్రైవ ప్రవిశతి

**ఇరావతీ** ఏవం ప్రథమం మమ చింతితం హృదయేన.

**విదూషకః** (ఉపసృత్య) భవతి! యుక్తం నామ అత్రభవతః ప్రియవయస్యః అశోక,ః వామపాదేన తాడయితుమ్?

(మాళవిక సిగ్గును ప్రదర్శించును.)

**ఇరావతి :-** (అసూయతో) ఔరా! ఆర్యపుత్రుడు వెన్నవంటి (మృదు) హృదయము కలవాడు!

**మాళవిక :-** వకుళావలికా రమ్ము! మన నియోగము ననుష్ఠించితి మని దేవికి నివేదింతుము.

**వకుళావలికా :-** అట్లయితే "సెలవిండని" ప్రభువునకు విన్నవింపుము.

**రాజు .-** కల్యాణీ! వెళ్లుదువుగాని. అవసరము లభించినది కనుక నా ప్రార్థనను కొంచెము వినుము.

**వకుళావలిక :-** శ్రద్ధగా వినుము. ప్రభువులవా రాజ్ఞాపింతురు గాక

**రాజు :-** చిరకాలముగా ఈ జనుడు కూడ అటువంటి
ధైర్యపుష్పమును వహింపకున్నాడు. అన్య మేదియు
రుచింపని, ఈతనికి కూడ నీ స్పర్శామృతముచే దోహదము
నెఱవేర్పుము. 19

**ఇరావతి :-** (త్వరగా సమీపించి) నేఱవేర్చు, నేఱవేర్చు. అశోకము పూలుపూయునో లేదో కాని, ఈయన మాత్రము పుష్పించును. ఫలించును కూడా.

(అందఱు ఇరావతిని చూచి తొట్రుపడుదురు )

**రాజు :-** (అపవారించి) మిత్రమా! ఇప్పుడు ఉపాయ మేమి?

**విదూషకః** కి మన్యత్ ? జంఘాబలమేవ।

**ఇరావతీ** వకులావలికే! సాధు త్వయోపక్రాంతమ్. మాలవికే! త్వ మిదానీం కురు సఫలప్రార్థన మార్యపుత్రమ్.

**ఉభౌ** ప్రసీదతు భట్టినీ. కే ఆవాం, భర్తుః ప్రణయ పరిగ్రహస్య? (ఇతి నిష్క్రాన్తే)

**ఇరావతీ** అహో అవిశ్వసనీయాః పురుషాః. మయా ఖల్వాత్మనో వంచనావచనం ప్రమాణీకృత్య వ్యాధగీతిరక్తయా హరిణ్యేవ, అశంకితయా ఏత న్న విజ్ఞాతమ్.

**విదూషకః** (జనాంతికం) భోః ప్రతిపద్యస్వ కమి పుృత్తరమ్. కర్మ గృహీతేన కుంభీలకేన సంధిచ్ఛేదనే శిక్షితో ఽ స్మీతి వక్తవ్యం భవతి.

**రాజా** సుందరి! న మే మాలవికయా కశ్చి దర్థః. మయా త్వం చిరయసీతి కథంచి దాత్మా వినోదితః.

**ఇరావతీ** విశ్వసనీయో ఽసి! న మయా విజ్ఞాత మీదృశం వినోదవస్తు ఆర్యపుత్రేణోపలబ్ధ మితి. అన్యథా మందభాగినీ ఏవం న కుర్యామ్.

**విదూషకః** మా తావ త్తత్రభవతో దాక్షిణ్య స్యోపరోధం కురు. సమాపత్తిదృష్టేన దేవ్యాః పరిజనేన సంకథాపి

**విదూషకుడు** - వే రేమున్నది? పిక్కబలమే!

**ఇరావతి :-** వకులావలికా ! చక్కగా ప్రారంభించితివి! మాలవికా! నీ విప్పుడు అర్యపుత్రుని ప్రార్థనను సఫలముచేయుము.

**ఇరువురు :-** భట్టిని అనుగ్రహింతురుగాక! ప్రభువుయొక్క ప్రణయమును పరిగ్రహించుటకు మే మెవ్వరము? (అని నిష్క్రమింతురు.)

**ఇరావతి :-** ఔరా! మగవారు నమ్మదగినవారు కాదుకదా! నీ కపటపు మాటలను నమ్మి, వేటగాని పాటయం దనురక్తయైన ఆడులేడివలె, అశంకితనైన నేను, ఈ విషయమును తెలిసికొనలేకపోతిని.

**విదూషకుడు :-** (జనాంతికముగా) ఓయీ! ఇప్పుడేదో ఒకటి బదులు చెప్పుము కన్నమువేయుచు పట్టుబడిన దొంగ, కన్నముత్రవ్వుటను నేర్చుకొనుచున్నానని చెప్పవలసియుండును.

**రాజు:-** సుందరీ! మాలవికతో నాకేమియు పనిలేదు . నీవు ఆలస్యము చేయుచున్నావు కదా అని ఏదో విధముగా వినోదించుచుంటిని.

**ఇరావతి :-** నమ్మదగిన వాడివే ! ఇట్టి వినోదవస్తువు అర్యపుత్రునకు లభించినదని నాకు తెలియదు. తెలిసియున్నచో మందభాగ్యురాలను ఇట్లు చేసియుండను

**విదూషకుడు :-** ప్రభువులవారి దాక్షిణ్యమునకు భంగము కలిగింపకుము. యాదృచ్ఛికముగా గనబడిన దేవిగారియొక్క పరిజనముతో సంభాషించుటయే అపరాధముగా నిరూపితమైనచో, నీవే ఈ

యద్యపరాధః స్థాప్యతే, అత్ర త్వ మేవ ప్రమాణమ్.

**ఇరావతీ** నను సంకథా నామ భవతు, కిమి త్యాత్మానం ఆయాసయిష్యామి. (ఇతి రుష్టా ప్రస్థితా.)

**రాజా** (అనుసరన్) ప్రసీదతు భవతీ.
(ఇరావతీ రశనాసంధానితచరణా వ్రజత్యేవ.)

**రాజా** సుందరి! న శోభతే ప్రణయిజన నిరపేక్షతా.

**ఇరావతీ** శఠ! అవిశ్వసనీయో ఽ సి.

**రాజా**

**శ్లో.** **శఠ ఇతి మయి తావ దస్తు తే**
**పరిచయవ త్యవధీరణా ప్రియే।**
**చరణపతితయా న చండి తాం**
**విసృజసి మేఖలయాపి యాచితా॥ 20**

**ఇరావతీ** ఇయ మపి హతాశా త్వా మేవ అనుసరతి.
(ఇతి రశనా మాదాయ రాజానం తాడయితు మిచ్ఛతి.)

**రాజా** వయస్య! ఏషా ఇరావతీ.

**శ్లో** బాష్పాసారా హేమకాంచీగుణేన
శ్రోణీబింబా దవ్యపేక్షాచ్యుతేన।

విషయమున ప్రమాణము

**ఇరావతి :-** సంభాషణమే కావచ్చును. నన్ను నేనేల ఆయాసపెట్టుకొన వలెను? (అని కోపముతో బయలుదేరును.)

**రాజు :-** (అనుసరించుచు) దేవి క్షమించునుగాక!

(ఇరావతి మొలనూలు కాళ్ళకు తగుల్కొన్నను వెళ్ళుచునే ఉండును )

**రాజు :-** సుందరీ! అనురక్తునిపట్ల నిరాదరణ నీకు తగదు సుమా!

**ఇరావతి :-** శరుడా! నమ్మరానివాడ వైనావు.

**రాజు :-** ప్రియా! పరిచితుడనైన నాయెడ "శరుడు" అన్న ఈ తిరస్కారమును అట్లుండ నిమ్ము పాదములపైపడిన ఈ మొలనూలిచే యాచింపబడినను, ఓ కోపశీలా! దానిపై నీ వా తిరస్కారమును విడువకున్నావు. 20

**ఇరావతి :-** ఈ హతాశ (మొలనూలు కూడ) నిన్నే అనుసరించుచున్నది.

(అని మొలనూలును తీసికొని, రాజును కొట్టగోరును.)

**రాజు :-** సఖుడా! ఈ ఇరావతి

బాష్పవర్షము కురియుచు. నితంబమండలమునుండి యాదృచ్ఛికముగా జారిన బంగారుమొలత్రాటితో ఈ చండి

**చండీ చండం హంతు మభ్యుద్యతా మాం**
**విద్యుద్దామ్నా మేఘరాజీవ వింధ్యమ్. 21**

**ఇరావతీ** కిం మా మేవ భూయో ఽ ప్యపరాద్ధాం కరోషి.

(ఇతి రశనాం హస్తేనా వలంబతే )

**రాజా**

**శ్లో.** **అపరాధిని మయి దండం సంహరసి కి ముద్యతం కుటిలకేశి!**
**వర్ధయసి విలసితం త్వం దాసజనా యాత్ర కుప్యసిచ.22**

(ఆత్మగతం) నూన మిదానీ మనుజ్ఞాతమ్.

(ఇతి పాదయోః పతతి.)

**ఇరావతీ** న ఖల్విమౌ మాలవికాచరణౌ యౌ తే విశేషేణ హర్ష దోహదం పూరయిష్యతః.

(ఇతి నిష్క్రాంతా సహ చేట్యా.)

**విదూషకః** ఉత్తిష్ఠ. కృతప్రసాదో ఽసి.

**రాజా** (ఉత్థాయ ఇరావతీ మపశ్యన్) కథం గతైవ ప్రియా?

విద్యుల్లతతో మేఘరాజి వింధ్యపర్వతమును కొట్టునట్లు నన్ను తీవ్రముగా తాడించుటకు సిద్ధమగుచున్నది. 21

**ఇరావతి :-** ఏమీ? మరల నన్నే అపరాధిని చేయుదురా?

(అని మొలనూలిని చేతితో పట్టుకొనును.)

**రాజు :-** ఓకుటిలకుంతలా! అపరాధినైన నా పై ఎత్తిన దండమును ఏల ఉపసంహరింతువు? ఈ దాసునిపై కోపించి, నీవు నీ విలాసమును పెంపొందించుకొనుచున్నావు. 22

(తనలో) ఇప్పు డిది అనుమతింపబడినదే కదా!

(అని పాదముపై బడును.)

**ఇరావతి :-** నీకు విశేషముగా హర్షదోహదమును కలిగించుటకు ఇవి మాళవిక చరణములు కావు సుమా!

(అని చేటితోకూడి నిష్క్రమించును.)

**విదూషకుడు :-** లెమ్ము, దయచూపబడితివి.

**రాజు :-** (లేచి, ఇరావతిని కానక) ఏమీ! ప్రియురాలు వెళ్ళిపోయినదా?

**విదూషకః** వయస్య! దిష్ట్యాఅనేనా వినయేన అప్రసన్నా గతైషా. తావ దావాం శీఘ్రమేవ వాపసరావః యావ దంగారక ఇవ సా అనువక్రం న కరోతి.

**రాజా** అహో మదనస్య వైషమ్యమ్.

**శ్లో.** మన్యే ప్రియాహృతమనా: తస్యాః
ప్రణిపాతలంఘనం సేవామ్।
ఏవం హి ప్రణయవతీ సా శక్య ముపేక్షితుం
కుపితా.॥ 23

( ఇతి పరిక్రమ్య నిష్క్రాన్తా స్సర్వే.)

ఇతి మహాకవి శ్రీకాళిదాసవిరచితే మాలవికాగ్నిమిత్రం
నామ సంస్కృతనాటకే
తృతీయో௨ఙ్కః



ఇరావతి

**విదూషకుడు :-** మిత్రమా! మన అదృష్టవశమున ఈ అపరాధముచేత ఆమె కోపముతోడనే వెడలిపోయినది. అంగారకునివలె ఆమె తిరుగు నడక పట్టకముందే త్వరగా మనము తొలగిపోవుదము.

**రాజు :-** ఔరా! మన్మధునియొక్క వైపరీత్యము!

ప్రియురాలిచే హృతచిత్తుడనైన నేను ఈమె చేసిన ప్రణిపాత తిరస్కారమును ఉపకారముగానే భావించుచున్నాను. ఇట్లు భావించినచో ఈమెను ఉపేక్షింప శక్యమగును **23**

(అని ముందుకు నడిచి, అందరు నిష్క్రమింతురు.)

**ఇది మహాకవి శ్రీకాళిదాసు రచించిన "మాళవికాగ్ని మిత్రమ్" అను సంస్కృతనాటకమునందలి మూడవ అంకమునకు "ప్రవచనప్రభాకర ఉపన్యాసకేసరి భాగవతరత్న" బిరుదాంకితుడైన బ్రహ్మశ్రీ గోళ్ళమూడి. వెంకట శ్రీహరి సుబ్రహ్మణ్యశర్మ వెలయించిన ఆంధ్రానువాదము.**



నిపుణిక

శ్రీః

# మాలవికాగ్నిమిత్రమ్

## చతుర్థో ఉఙ్కః

(తతః ప్రవిశతి పర్యుత్సుకో రాజా ప్రతీహారీ చ.)

**రాజా** (ఆత్మగతమ్)

శ్లో తా మాశ్రిత్య శ్రుతిపథగతా మాశయా బద్ధమూలః
సంప్రాప్తాయాం నయనవిషయం రూఢరాగప్రవాలః।
హస్తస్పర్శైః కుసుమిత ఇవ వ్యక్తరోమోద్గమత్వాత్
కుర్యా త్క్లాన్తం మనసిజతరు ర్మాం రసజ్ఞం ఫలస్య॥ 1

(ప్రకాశం) సఖే! గౌతమ!

శ్రీః

# మాళవికాగ్నిమిత్రము

## నాల్గవ అంకము

(అంతట ఉత్కంఠితుడైన రాజును, ప్రతీహారియును ప్రవేశింతురు.)

**రాజు :-** (తనలో)

( ప్రథమాంకమున వసులక్ష్మి ద్వారా "ఈమె మాళవిక" అను మాటను విని) నా చెవినబడిన ఆమె పేరును ఆశ్రయించి, నా ప్రేమవృక్షము ఆశతో వేరూనినది. (ద్వితీయాంకము నందు మాళవిక అభినయప్రదర్శనకాలమునందు) నా కంటపడగనే అనురాగరూపమున చివురును తొడిగినది (తృతీయాంకమునందు మొదటి సారిగా ఆమె నాకు ప్రణమిల్లి నపుడు నే నామెను లేవనెత్తబోవు ప్రయత్నములో) ఆమె హస్తస్పర్శచే స్పష్టమైన పులకాంకురము ఏర్పడుట వలన పుష్పించినదా? అన్నట్లున్నది. (ఆమెతోడి పునః సంగమమునకై) పరితప్తుడనైన నన్ను, మనసిజకల్పవృక్షము తత్ఫలరసజ్ఞుని గావించు గాక! (మా వివాహము సానుకూలఫలప్రద మగును గాక! అని రాజు ఆశించుచున్నాడు ) 1

(ప్రకాశముగా) స్నేహితుడా! గౌతముడా!

**ప్రతీహారీ** జయతు. జయతు. భర్తా. అసన్నిహితో గౌతమః.

**రాజా** (ఆత్మగతం) ఆమ్. మాలవికా వృత్తాంతజ్ఞానాయ మయా ప్రేషితః.

(ప్రవిశ్య)

**విదూషకః** వర్ధతాం భవాన్.

**రాజా** జయసేనే! జానీహి తావ త్త్వ దేవీ ధారిణీ; కథం వా సరుజచరణత్వా ద్వినోద్యతే? ఇతి.

**ప్రతీహారీ** య ద్దేవ ఆజ్ఞాపయతి.

(ఇతి నిష్క్రాన్తా.)

**రాజా** గౌతమ! కో వృత్తాన్తః తత్రభవత్యాః తే సఖ్యాః.

**విదూషకః** యో బిడాలగృహీతాయాః పరభృతికాయాః.

**రాజా** (సవిషాదం) కథమివ?

**విదూషకః** సా ఖలు తపస్వినీ తయా పింగళాక్ష్యా సారభాండ భూగృహే మృత్యుముఖే ఇవ నిక్షిప్తా.

**రాజా** నను మత్సంపర్క ముపలభ్య.

**విదూషకః** అథ కిమ్?

**ప్రతీహారి .-** ప్రభువులకు జయము. జయము. గౌతముడు సమీప ప్రాంతమునందు లేడు

**రాజు .-** (తనలో) అవును. మాలవికావృత్తాంతమును తెలిసికొనుటకై నేనే పంపితిని.

(ప్రవేశించి)

**విదూషకుడు :-** పూజ్యుడు వర్ధిల్లుగాక

**రాజు :-** జయసేనా! ధారిణీదేవి ఎచ్చట నున్నదో, కాలునొప్పివలన ఎట్లు ప్రొద్దుపుచ్చుచున్నదో కొంచెము తెలిసికొనుము

**ప్రతీహారి .-** దేవర ఆజ్ఞాపించినట్లే

(అని నిష్క్రమించును.)

**రాజు .-** గౌతమా! పూజ్యురా లైన నీ సఖియొక్క వృత్తాంత మేమి?

**విదూషకుడు :-** పిల్లిచే పట్టుకొనబడిన కోకిల పరిస్థితి ఎట్టిదో అట్టిదే!

**రాజు :-** (విషాదముతో) ఎట్లో?

**విదూషకుడు :-** మృత్యుముఖములో ఉంచబడినట్లు ఆ దీనురాలు (మాళవిక) ఆ పింగళాక్షి చేత (పిల్లికళ్ళవంటి కళ్ళుగల. ధారిణిచేత) ఆభరణభాండములుండు భూగృహమునందు ఉంచబడినది.

**రాజు :-** నాతోడి సంబంధమును తెలిసి కాబోలు.

**విదూషకుడు :-** మరేమి?

**రాజా** గౌతమ! క ఏవం విముఖో ఽస్మాకం యేన చండీకృతా దేవీ?

**విదూషకః** శృణోతు భవాన్. పరివ్రాజికా మే కథయతి. భోః హ్యః కిల తత్రభవతీ ఇరావతీ రుజాక్రాంతచరణాం దేవీం సుఖపృచ్ఛికా గతా.

**రాజా** తత స్తతః ?

**విదూషకః** తతః సా దేవ్యా పృష్టా 'కిం ను నావలోకిత ఆత్మనో వల్లభః' ఇతి. తత స్తయా మంత్రితం కుతో వ ఉపచారః? య త్పరిజనే తే సంక్రాంతం వల్లభత్వమ్. జానంత్యపి పృచ్ఛసి.

**రాజా** నిర్భేదాదృతే ఽపి మాలవికాయా మయ ముపన్యాసః శంకయతి. తత స్తతః?

**విదూషకః** తత స్తయా అనుబధ్యమానయా భవతో ఽ వినయ మంతరేణ పరిగతార్థా కృతా దేవీ.

**రాజా** అహో దీర్ఘరోషతా తత్ర భవత్యాః. అతః పరం కథయ.

**విదూషకః** అతః పరం కిం? మాలవికా వకులావలికా చ నిగడపద్యో అదృష్ట సూర్యపాదం పాతాలవాసం నాగకన్యకే ఇవానుభవతః.

**రాజా** కష్టం. కష్టమ్.

**రాజు :-** గౌతమా! మాకు ప్రతికూలుడై, దేవికిట్లు మాపై కోప మెక్కించిన వా డెవ్వడో?

**విదూషకుడు :-** తమరు వినుడు. నిన్న ఆ ఇరావతి, కాలునొచ్చియున్న దేవిని, "ఇప్పుడు సుఖముగానున్నదా" అని అడుగవచ్చినదని పరివ్రాజిక నాకు చెప్పినది.

**రాజు :-** తరువాత! తరువాత?

**విదూషకుడు :-** ఆ తరువాత " మనోవల్లభుని చూచితివా" అని దేవి ఆమె నడిగినది. అప్పుడు ఇరావతి "ఇంక నీ ఉపచార మెందులకు? వల్లభత్వము నీ పరిజనమునందు సంక్రమించినదని ఎఱిగి యుండియు అడుగుచున్నావు"

**రాజు :-** స్పష్టముగా చెప్పకయే ఈ ప్రసంగము మాళవికయందు శంకను కలిగించుచున్నది. తరువాత తరువాత?

**విదూషకుడు :-** ఆ తరువాత బలవంతపెట్టబడినదై నీ అపచారమును గురించి సర్వము దేవికి తేటపరచినది.

**రాజు :-** అహా! అమె ఎంత దీర్ఘరోషమును వహించినది? ఆ తరువాత చెప్పుము

**విదూషకుడు :-** ఆపైన ఏమున్నది? మాళవికయును, వకుళావలికయును కాళ్ళకు సంకెలలు పడి నాగకన్యలవలె సూర్యకిరణము కూడ చొరరాని, పాతాళగృహమునందు వసించుచున్నారు.

**రాజు :-** కటకటా!

శ్లో **మధురస్వరా పరభృతా భ్రమరీచ విబుద్ధచూత సంగిన్యౌ।**
**కోటర మకాల వృష్ట్యా ప్రబల పురోవాతయా ఽ గమితే॥**
**2'**

వయస్య! అప్యత్ర కస్యచి దుపక్రమస్య గతిః స్యాత్?

**విదూషకః** కధం భవిష్యతి? య త్సారభాండగృహే వ్యాపృతా మాధవికా దేవ్యా సందిష్టా. 'మమాంగుళీయ ముద్రికా మదృష్ట్వా న మోక్తవ్యా త్వయా హతాశా మాలవికా వకులావలికాచ' ఇతి.

**రాజా** (నిఃశ్వస్య, సపరామర్శం) సఖే! కి మత్ర ప్రతికర్తవ్యమ్?

**విదూషకః** (విచిన్త్య) అ స్త్యత్రోపాయః

**రాజా** క ఇవ?

**విదూషకః** (స దృష్టిక్షేపం) కో ప్యదృష్టః శృణోతి. త త్కర్ణే తే కధయామి. (ఉపశ్లిష్య కర్ణే) ఏవమివ.

(ఇత్యావేదయతి.)

**రాజా** (సహర్షం) సుష్ఠు చింతితమ్. ప్రయుజ్యతాం సిద్ధయే.

(ప్రవిశ్య)

**రాజు :-** ఉపచార నిర్బంధము చాలు చాలు..

మధురభాషిణీ! నూపురముతో వియోగమునకు తగనిదియును, సువర్ణపీఠముపై విశ్రమించునదియును, బాధతో నొచ్చి యున్నదియు అగు నీ చరణమును, మరియును నన్నును, బాధింప తగదు సుమా! 3

**ధారిణి .-** ఆర్యపుత్రులకు జయము. జయము.

**పరివ్రాజిక -** దేవరకు విజయము సిద్ధించుగాక.

**రాజు :-** (పరివ్రాజికకు ప్రణమిల్లి, కూర్చుండి)దేవీ! నొప్పి సహింప శక్యముగా నున్నదా?

**ధారిణి :-** నాకు కొంచెము విశేషము (మార్పు) కనబడుచున్నది.

(అంతట బొటనవేలికి జందెమును చుట్టుకొని, కలవరపాటుతో విదూషకుడు ప్రవేశించును.)

**విధూషకుడు :-** పూజ్యులు నన్ను రక్షించు గాక! రక్షించు గాక! సర్పరూపమున ఉన్న మృత్యువుచే కరువబడితిని (అందరు దుఃఖము నొందుదురు.)

**రాజు :-** కటకటా! నీ వెక్కడ తిరిగితివి?

**విదూషకుడు :-** దేవిని దర్శింతునని, ఆచారార్థమయిన పూలను సేకరించుట కొరకు ప్రమదవనమునకు పోయితిని.

**ప్రతీహారీ** దేవ! ప్రవాతశయనే నిషణ్ణా దేవీ రక్తచందన ధారిణా పరిజన హస్తగతేన చరణేన, భగవత్యాః కథాభిః వినోద్యమానా తిష్ఠతి.

**రాజా** అస్మత్ప్రవేశయోగ్యో ఽ యమవసరః.

**విదూషకః** తత్ గచ్ఛతు భవాన్. అహ మపి దేవీం ప్రేక్షితుం అరిక్తపాణిః భవిష్యామి.

**రాజా** జయసేనాయా స్తావ త్సంవేద్య గచ్ఛ.

**విదూషకః** తథా (కర్ణే) ఏవ మివ భవతి!

(ఇతి నిష్క్రాన్తః)

**రాజా** జయసేనే! తేన హి ప్రవాతశయనమార్గ మాదేశయ.

**ప్రతీహారీ** ఇత ఇతో దేవః.

(తతః ప్రవిశతి శయనస్థా దేవీ, పరివ్రాజికా, విభవతశ్చ పరివారః.)

**ధారిణీ** భగవతి! రమణీయా కథా. తత స్తతః?

**పరివ్రాజికా** (సదృష్టిక్షేపం) అతః పరం పునః కథయిష్యామి. అత్రభవాన్ విదిశేశ్వరః సంప్రాప్తః.

**ధారిణీ** అహో భర్తా!

(ఇ త్యుత్థాతు మిచ్ఛతి.)

**ప్రతీహారి .-** దేవా! రక్తచందనమును అద్దుకొనిన పరిజనముయొక్క చేతిలో కాలునుంచి, (నొక్కించుకొనుచు) బాగుగా గాలివీచునట్టి ప్రదేశమునందున్న, పక్కపైనుండి, భగవతితోడి సల్లాపముతో వినోదించుచున్నది.

**రాజు :-** ఇది మేము ప్రవేశించుటకు తగినఅదను.

**విదూషకుడు .-** కనుక తాము బయలుదేరుడు. నేను కూడా దేవిని దర్శించటకు (ఒట్టిచేతులతోకాక) ఏదైన చేతబట్టుకొని వత్తును

**రాజు :-** జయసేనకు తెలియపఱచి మరి వెళ్ళుము.

**విదూషకుడు .-** అట్లే (చెవిలో) ఈ విధముగా నమ్మా!

(అని నిష్క్రమించును )

**రాజు :-** జయసేనా! అట్లయిన ప్రవాతశయనమునకు మార్గమును చూపుము.

**ప్రతిహారి .-** ఏలినవారు ఇటు, ఇటు.

(అంతట ప్రక్కమీదనున్న దేవియును , పరిచారికయును , విభవమునకొలది పరిజనమును ప్రవేశింతురు.)

**ధారిణి :-** భగవతీ! రమణీయమైన కథ! తరువాత! తరువాత?

**పరివ్రాజిక :-** అటు నిటు చూచి, అటుతరువాతి (కథను) మరల చెప్పెదను. ప్రభువు విదేశేశ్వరుడు చేరవచ్చినాడు.

**ధారిణి .-** ఓహో! ఆర్యపుత్రుడా!

(అని లేవబోవును.)

(ఇతి విషవేగం రూపయతి.)

**ధారిణీ** (ఉపసృత్య) హాహా దర్శితం అశుభం వికారేణ. హలా! అవలంబధ్వ మేనమ్.

(పరిజనః ససంభ్రమ మవలంబతే )

**విదూషకః** (రాజానం విలోక్య) భోః భవతో బాల్యాదపి ప్రియవయస్యో ఽస్మి. తద్విచార్య అపుత్రాయా మే జనన్యా యోగక్షేమం వహ.

**రాజా** మా భైషీః, అచిరాత్ త్వాం విషవైద్యః చికిత్సతే. స్థిరో భవ.

(ప్రవిశ్య)

**జయసేనా** దేవ! ఆజ్ఞాపితో ధ్రువసిద్ధి ర్విజ్ఞాపయతి. 'ఇహైవానీయతాం స గౌతమ' ఇతి.

**రాజా** తేన హి వర్షవరపరిగృహీత మేనం తత్రభవతః సకాశం ప్రాపయ.

**జయసేనా** తథా.

**విదూషకః** (దేవీం విలోక్య) భవతి! జీవేయం వా న వా. య న్మయా తత్ర భవంతం సేవమానేన తే ఽపరాద్ధం త న్మృష్యస్వ.

**ధారిణీ** దీర్ఘాయు ర్భవ.

వికసించిన చూతమునందానక్తలైన మధురమ్మైన కంఠస్వరములుకల కోకిలయును, భ్రమరియును, తుఫాను గాలితో కూడిన అకాలవృష్టిచే (ఏదో ఒక) చెట్టు తొర్రలోనికి తోయబడినవి. 2

మిత్రమా! ఈ విషయమునందు ఏదైన ప్రతిక్రియకు అవకాశమున్నదా?

**విదూషకుడు :-** ఎట్లుండగలదు? ఏలయన, ఆభదరణ గృహరక్షణమునకై నియమింపబడిన మాధవికతో దేవి "నా ఉంగరపుముద్రను చూడకుండ మాళవికను గాని, వకులావలికనుగాని నీవు విడిచిపెట్టగూడదు" అని చెప్పినది.

**రాజు :-** (నిట్టూర్చి, ఆలోచించి) మిత్రమా! దీనికి ప్రతిక్రియ ఏమి?

**విదూషకుడు :-** ఇందు కుపాయ మున్నది.

**రాజు :-** ఎట్టిదో!

**విదూషకుడు :-** (అటునిటు చూచి) ఎవ్వడేని దాగియుండి వినునేమో! కనుక నీ చెవిలో చెప్పెదను. (సమీపించి, చెవిలో) ఇదుగో ఇట్లు.

**విదూషకుడు :-** (అని చెప్పును.)

**రాజు :-** (హర్షముతో) చక్కగా నాలోచించితివి. (ఉపాయమును) ప్రయోగించి, సిద్ధినిపొందుము.

(ప్రవేశించి)

**ధారిణీ** హాధిక్, హాధిక్ న న్వహమేవ బ్రాహ్మణస్య జీవితసంశయే నిమిత్తం జాతాస్మి.

**విదూషకః** తస్మి న్నశోకస్తతబకస్య కారణా న్మయా ప్రసారితో దక్షిణహస్తః. తతః కోటరవినిర్గతేన సర్పరూపిణా కాలేన దష్టో ఽ స్మి. న న్వేతే ద్వే దంశపదే.

(ఇతి దంశం దర్శయతి.)

**పరివ్రాజికా** తేన హి దంశచ్ఛేదః పూర్వ కర్మేతి శ్రూయతే. స తావ దస్య క్రియతామ్.

**శ్లో** **ఛేదో దంశస్య దాహోవా క్షతేర్వా రక్తమోక్షణమ్।**
**ఏతాని దష్టమాత్రాణా మాయుషః ప్రతిపత్తయః॥4**

**రాజా** సంప్రతి విషవైద్యానాం కర్మ. జయసేనే! ధ్రువసిద్ధిః క్షిప్ర మాహూయతామ్.

**ప్రతీహారీ** య ద్దేవ ఆజ్ఞాపయతి.

(ఇతి నిష్క్రాన్తా.)

**విదూషకః** అహో పాపేన మృత్యునా గృహీతో ఽ స్మి.

**రాజా** మా కాతరో ఽ భూః. అవిషో ఽ పి కదాచి ద్దంశో భవేత్.

**విదూషకః** కథం న భేష్యామి. సిమసిమాయంతి మే ఽ ఙ్గాని.

**ధారిణి :-** అయ్యయ్యో! ఈ బ్రాహ్మణుని ప్రాణసంకటమునకు నేనే కారణభూతురాలనైతిని.

**విధూషకుడు :-** అశోకపుష్పగుచ్ఛమును కోయుటకై నేను నా కుడిచేతిని చాచితిని, అంతలో తొఱ్ఱలోనుండి వెలువడిన, సర్పరూపమున నున్న యమునిచే కరువబడితిని. ఇవిగో రెండుకోరల కాట్లు.

(అని కాటును చూపును.)

**పరివ్రాజిక :-** అట్లయినచో కాటును కోసివేయుటే విషమునకు తొలి చికిత్స అని పెద్దలు చెప్పుదురు. ఇప్పు డీతని కాపని చేయుడు.

కాటును కోసివేయుటకాని, కాల్చివేయుటగాని, రక్తమును పిండివేయుటగాని విషమునకు (చికిత్సలు). కరువబడినవాని ప్రాణములను నిలుపుట కివియే ఉపాయములు. 4

**రాజు :-** ఇప్పుడు పని, విషవైద్యులదే. జయసేనా! ధ్రువసిద్ధిని వెంటనే పిలుచుకొని రమ్ము.

**ప్రతీహారి :-** ఏలినవా రాజ్ఞాపించినట్లే!

(అని నిష్క్రమించును.)

**విదూషకుడు :-** అయ్యో! పాపపు మృత్యువునకు చిక్కితినే.

**రాజు :-** భయపడకుము, ఒక్కొకప్పుడు విషములేని కాటుకూడా కావచ్చును.

**విదూషకుడు :-** భయపడ కెట్లుందును? నా అవయవములన్నియు చిమచిమ లాడుచున్నవి.

**రాజా** అల మల ముపచారయంత్రణయా.

**శ్లో** **అనుచితనూపురవిరహం నార్హసి తపనీయ పీఠికాలంబమ్।**
**చరణం రుజాపరీతం కలభాషిణి! మాం పీడయితుమ్॥ 3**

**ధారిణీ** జయతు. జయ త్వార్యపుత్రః.

**పరివ్రాజికా** విజయతాం దేవః.

**రాజా** (పరివ్రాజికాం ప్రణమ్య ఉపవిశ్య చ) దేవి! అపి సహ్యా తే వేదనా?

**ధారిణీ** అస్తి మే విశేషః.

(తతః ప్రవిశతి యజ్ఞోపవీత సంవీతాంగుష్ఠః సంభ్రాంతో విదూషకః.)

**విదూషకః** పరిత్రాయతాం పరిత్రాయతాం భవాన్ సర్పేణ మృత్యునా దష్టో ఽస్మి. (సర్వే విషణ్ణాః.)

**రాజా** కష్టం కష్టమ్. క్వ భవాన్ పరిభ్రాంతః?

**విదూషకః** దేవీం ద్రక్ష్యామీ త్యాచారపుష్పగ్రహణకారణాత్ ప్రమదవనం గతో ఽ స్మి.

**జయసేన :-** దేవా! విషవేగము తొలగి, గౌతముడు క్షణములో స్వస్థుడైనాడు

**ధారిణి :-** అదృష్టవశమున నిందనుండి తప్పించుకొంటిని.

**ప్రతీహారి :-** మరి ఇదుగో మంత్రి వాహతకుడు విన్నవించుచున్నాడు. "ఇప్పుడు మాట్లాడవలసిన కార్యము చాల కలదు కనుక దర్శనము ననుగ్రహింపగోరుచున్నాను" అని.

**ధారిణి :-** కార్యసిద్ధికొరకై ఆర్యపుత్రులు బయలుదేరుదురు గాక!

**రాజు :-** (లేచి) ఈ ప్రదేశమున ఎండతగులుచున్నది. ఈ నొప్పికి శీతలోపచారము మంచిది కావున ఈ సెజ్జను మరొక చోటికి మార్చదగును.

బాలికలారా! ఆర్యపుత్రుని మాటప్రకారము చేయుడు.

**పరిజనము :-** అట్లే! (అని దేవియును, పరివ్రాజికయును, పరిజనమును నిష్క్రమింతురు.)

**రాజు :-** జయసేనా! నన్ను రహస్యమార్గమున ప్రమదవనమునకు కొనిపొమ్ము.

**జయసేన :-** దేవా! ఇటు, ఇటు.

**రాజు :-** జయసేనా! గౌతముడు కార్యమును నెఱవేర్చినట్లే కదా!

**జయసేన :-** మఱేమి?

**రాజు :-** ఇష్టప్రాప్తికొఱకు ఇది ప్రత్యేకము, సమర్థము అయిన ఉపాయమని నిశ్చయించియు, కార్యసిద్ధిపట్ల పిరికితనమును వహించు నా మనస్సు అనుమానము కలదిఅయి, (సిద్ధిని)

(ఇతి నిష్క్రాంతౌ విదూషకః ప్రతీహారీ చ.)

**రాజా** ప్రకృతిభీరు స్తపస్వీ ధృవసిద్ధేరపి యథార్థనామ్నః సిద్ధిం న మన్యతే.

(ప్రవిశ్య)

**జయసేనా :** జయతు జయతు భర్తా. ధ్రువసిద్ధి ర్విజ్ఞాపయతి 'ఉదకుంభవిధానే సర్పముద్రితం కిమపి కల్పయితవ్యమ్. త దన్విష్యతాం' ఇతి.

**ధారిణీ** ఇదం సర్పముద్రిత మంగులీయకమ్. పశ్చా న్మమ హస్తే దేహ్యేతత్.
(ఇత్యంగులీయకం దదాతి. ప్రతీహారీ నాట్యేన గృహ్ణాతి.)

**రాజా** కర్మసిద్ధౌ ఆశు ప్రతిపత్తిం నయ.

**జయసేనా** య ద్దేవ ఆజ్ఞాపయతి.

(ఇతి నిష్క్రాన్తా.)

**పరివ్రాజికా** దేవ! యథా మే హృదయ మాచష్టే, తథా నిర్విషో గౌతమః.

**రాజా** భూయా దేవమ్.

(ప్రవిశ్య)

(అని విదూషకుడును, ప్రతీహారియును నిష్క్రమింతురు )

**రాజు .-** పాపము సహజముగానే ఈతడు పిరికివాడు, సార్థక నామధేయుడైన ధ్రువసిద్ధియొక్క కార్యసిద్ధిని కూడా అనుమానించుచున్నాడు.

(ప్రవేశించి)

**జయసేన :-** ప్రభువులకు జయము. జయము "ఉదకుంభ విధానమునందు సర్పచిహ్నముగల వస్తువేదేని సంపాదింపవలసియున్నది. కనుక అట్టిదానికై వెదకుడు" అని ధ్రువసిద్ధి విజ్ఞాపించు కొనుచున్నాడు.

**ధారిణి :-** ఇదుగో సర్పముద్రితమైన యుంగరము. దీనిని తరువాత నా చేతికే ఇమ్ము.

(అని ఉంగరము నిచ్చును. ప్రతీహారి స్వీకరించునట్ల భినయించును.)

**రాజు :-** కార్యసిద్ధి అయినవెంటనే నాకు తెలియజేయుము.

**జయసేనా :-** ఏలినవా రాజ్ఞాపించినట్లే.

(అని నిష్క్రమించును.)

**పరివ్రాజిక :-** దేవా! నా హృదయము చెప్పుచున్నట్లుగా గౌతముడు విషముక్తుడు కాగలడు.

**రాజు :-** అట్లే అగుగాక!

(ప్రవేశించి)

**రాజా** (సహర్షం) తత స్తతః?

**విదూషకః** తత్ శ్రుత్వా దేవ్యా ఇరావతీచిత్తం రక్షంత్యా, రాజా కిల మోచయతి ఇత్యహం సందిష్టోఽస్మి ఇతి. తతో యుజ్యతే ఇతి తయా సంపాదితోఽర్థః

**రాజా** (విదూషకం పరిష్వజ్య) సఖే! ప్రియో ఽహం ఖలు తవ.

**శ్లో** **న హి బుద్ధి గుణేనైవ సుహృదా మర్థదర్శనమ్।**
**కార్యసిద్ధి పథః సూక్ష్మః స్నేహేనా ప్యుపలభ్యతే॥** 6

**విదూషకః** త్వరతాం భవాన్. సముద్రగృహకే సఖీసహితాం మాలవికాం స్థాపయిత్వా భవంతం ప్రత్యుద్గతో ఽస్మి.

**రాజా** అహ మేనాం సంభావయామి. గచ్ఛాగ్రతః

**విదూషకః** ఏ త్వేతు భవాన్ (పరిక్రమ్య) ఇదం సముద్రగృహకమ్.

**రాజా** (సాశంకం) వయస్య! ఏషా కుసుమాపచయ వ్యగ్రహస్తా సఖ్యా స్తే ఇరావత్యాః పరిచారికా చంద్రికా సంనికృష్ట మాగచ్ఛతి. ఇత స్తావ దావాం భిత్తిగూఢౌ భవావః.

**విదూషకః** అహో! కుంభీల్లకైః కాముకైశ్చ పరిహరణీయా చంద్రికా.

(ఉభౌ యథా సమర్థితం కురుతః.)

(అని విషవేగమును నటించును.)

**ధారిణి :-** సమీపించి, ఈ వికారము అమంగళమును సూచించుచున్నది. సేవికలారా! ఇతనిని పట్టుకొనుడు.

(పరిజనులు వేగిరపాటుతో పట్టుకొందురు )

**విదూషకుడు :-** (రాజును చూచి) ఓయీ! నేను నీకు బాల్యమునుండియు ప్రియసఖుడను. కనుక నీవు ఆలోచించి, పుత్రహీనయైన నా జననియొక్క యోగక్షేమములను కనిపెట్టియుండుము.

**రాజు :-** భయపడకుము, త్వరలోనే నీకు విషవైద్యుడు చికిత్స చేయును. ధైర్యముగా నుండుము

(ప్రవేశించి)

**జయసేన :-** దేవా! తమ ఆజ్ఞను విని, ధ్రువసిద్ధి "ఆ గౌతముని ఇక్కడికే తీసికొని రండు" అని విన్నవించుచున్నాడు.

**రాజు :-** అట్లయినచో కొజ్జాలచే మోయించుకొని, ఈతనిని ఆయన వద్దకు చేర్పుము.

**జయసేన .-** అట్లే

**విదూషకుడు :-** (దేవిని చూచి) దేవీ! బ్రదుకుదునో లేదో? ప్రభువును సేవించునప్పుడు నేను తమకేదేని అపచారమును చేసియున్నచో దానిని క్షమింపుము.

**ధారిణి :-** దీర్ఘాయుష్మంతుడవు కమ్ము

సందిగ్ధమేవ సిద్ధౌ కాతర మాశంకతే చేతః॥ 5

(ప్రవిశ్య)

**విదూషకః** జయతు. జయతు. భవాన్. సిద్ధాని తే మంగళకార్యాణి.

**రాజా** జయసేనే! త్వ మపి నియోగ మశూన్యం కురు.

**జయసేనా** య ద్దేవ ఆజ్ఞాపయతి.

(ఇతి నిష్క్రాన్తా.)

**రాజా** గౌతమ! క్షుద్రా మాధవికా. న ఖలు కించి ద్విచారిత మనయా.

**విదూషకః** దేవ్యా అంగుళీయుకముద్రికాం దృష్ట్వా కథం విచారయతి?

**రాజా** న ఖలు ముద్రా మధికృత్య! బ్రవీమి 'తయో ర్బద్ధయోః కిం నిమిత్తో ఽ యం మోక్షమ్. కిం వా దేవ్యాః పరిజనం అతిక్రమ్య భవాన్ సందిష్ట' ఇత్యేవం తయా ప్రష్టవ్యమ్.

**విదూషకః** నను పృష్టో ఽస్మి, పున ర్మందస్యాపి మే తస్మి న్ప్రత్యుత్పన్నా బుద్ధిః.

**రాజా** కథ్యతామ్.

**విదూషకః** మయా కథితం 'దైవచింతకై ర్విజ్ఞాపితో రాజా సోపసర్గం వో నక్షత్రమ్. త దవశ్యం సర్వబంధమోక్షః క్రియతాం' ఇతి.

శంకించుచునే యున్నది.

(ప్రవేశించి)

**విదూషకుడు .-** మీకు జయము, జయము, మీ శుభారంభములన్నియు ఫలించినవి

**రాజు :-** జయసేనా! నీవును నీ కర్తవ్యమును చూచుకొనుము.

**జయసేన :-** దేవరవా రాజ్ఞాపించినట్లే!

(అని నిష్క్రమించును.)

**రాజు .-** స్నేహితుడా! మాధవిక అల్పబుద్ధిది. అది ఎంతమాత్రమును ఆలోచించినట్లు లేదు

**విదూషకుడు .-** దేనియొక్క ఉంగరపు ముద్రను చూచియు ఎట్లాలోచించును.

**రాజు .-** "ముద్రికను గురించి నేను చెప్పుట లేదు. "బంధింపబడిన ఆ యిరువురను విడుచుటకు కారణ మేమి? తన పరిజనమును మాని, దేవి నిన్నేల పంపవలెను", అని ఈ విధముగా నిన్నామె ప్రశ్నించియుండవలసినది

**విధూషకుడు :-** ప్రశ్నించినది కదా! కాని నేను మందుడవైనను, ఆ సమయమ్మున నా బుద్ధికి సద్యఃస్ఫురణ కలిగినది

**రాజు :-** చెప్పుము

**విదూషకుడు :-** అప్పుడు నేను "దైవజ్ఞులు ప్రభువున కిట్లు విన్నవించిరి. తమ నక్షత్రము దోషయుక్తమై యున్నది. కనుక వెంటనే కారాగృహబద్ధులైన ఎల్లరను విడిచిపెట్టుడు" అని చెప్పిరి.

**జయసేనా** దేవ! నివృత్తవిషవేగో గౌతమో ముహూర్తేన ప్రకృతిస్థ ఏవ సంవృత్తః.

**ధారిణీ** దిష్ట్యా వచనీయా న్ముక్తాస్మి.

**ప్రతీహారీ** ఏష పునః అమాత్యో వాహతకో విజ్ఞాపయతి 'రాజకార్యం బహు మంత్రయితవ్యమ్. దర్శనే నానుగ్రహ మిచ్ఛామి' ఇతి.

**ధారిణీ** గచ్ఛ త్వార్యపుత్రః కార్యసిద్ధయే.

**రాజా** (ఉత్థాయ) దేవి! ఆతపాక్రాంతో ఽ యముద్దేశః. శీతక్రియా చాస్య రుజః ప్రశస్తా. త దన్యత్ర నీయతాం శయనీయమ్.

**ధారిణీ** బాలికాః! ఆర్యపుత్రవచన మనుతిష్ఠత.

**పరిజనః** తథా. (ఇతి నిష్క్రాన్తా దేవీ, పరివ్రాజికా, పరిజనశ్చ.)

**రాజా** జయసేనే! గూఢేనపథా మాం ప్రమదవనం ప్రాపయ.

**జయసేనా** ఇత ఇతో దేవః.

**రాజా** జయసేనే! నను సమాప్తకార్యో గౌతమః.

**జయసేనా** అథ కిమ్?

**రాజా** శ్లో. ఇష్టాధిగమ నిమిత్తం ప్రయోగ మేకాంత సాధ్యమపి మత్వా।

**రాజు** - (హర్షముతో) తరువాత! తరువాత?

**విదూషకుడు** - ఆ మాటను విని, ఇరావతి యొక్క అభిప్రాయమును మన్నింపగోరినదై, దేవి, ప్రభువే విడిపించుచున్నట్లు కనబడుటకై నన్ను పంపినది. అప్పుడు ఆమె,"సరియే" అని మన కార్యమును నెఱవేర్చినది.

**రాజు** - (విదూషకుని కౌగిలించి) నేను నీకు ఇష్టుడను సుమా!

మిత్రుల ప్రయోజనము కేవలము బుద్ధిబలముచేతనే కాదు సుమా! అతిసూక్ష్మమైన కార్యసాఫల్యమార్గము, స్నేహముచేతకూడా సాధింపబడుచుండును. 6

**విదూషకుడు** .- తాము త్వరపడుదురుగాక, ప్రియసఖితోబాటు మాలవికను సముద్రగృహమునం దుంచి, నేను మీవద్దకు వచ్చితిని.

**రాజు** - నే నామెను సంభావింతును. నీవు ముందుగా నడువుము.

**విధూషకుడు** .- రమ్ము (ముందునడిచి) ఇదే సముద్రగృహము.

**రాజు** .- (శంకతో) ఇదుగో నీ సఖియైన ఇరావతియొక్క పరిచారిక, చంద్రిక పూలు కోయుటలో వ్యగ్రములైన చేతులతో ఇటే వచ్చుచున్నది ఇప్పుడు మన మీ గోడచాటున దాగి యుండెదము.

**విదూషకుడు** .- అహో! దొంగలకును, కాముకులకును చంద్రిక (వెన్నెల) పరిహరింపదగినది కదా!

(అని ఇరువురు అనుకొన్నట్టు చేయుదురు )

**రాజా** గౌతమ! కథం ను తే సఖీ మాం ప్రతిపాలయతి? ఏహ్యేనాం గవాక్ష మాశ్రిత్య యావ దవలోకయావః.

(ఇతి విలోకయన్తౌ స్థితౌ )

(తతః ప్రవిశతి మాలవికా వకులావలికా చ.)

**వకులావలికా** సఖి! ప్రణమ భర్తారమ్.

**రాజా** మన్యే మే ప్రతికృతిం దర్శయతి.

**మాలవికా** (సహర్షం) నమస్తే (ద్వార మవలోక్య సవిషాదం) కుత్ర భర్తా? హలా, విప్రలంభయసి మామ్

**రాజా** సఖే! హర్షవిషాదాభ్యాం అత్ర భవత్యాః ప్రీతో ఽ స్మి.

**శ్లో** **సూర్యోదయే భవతి యా సూర్యాస్తమయే చ పుండరీకస్య।**
**వదనేన సువదనాయా స్తే సమవస్థే క్షణా దూఢే॥ 7**

**వకులావలికా** నన్వేష చిత్రగతో భర్తా.

**ఉభౌ** (ప్రణిపత్య) జయతు. జయతు. భర్తా.

**మాలవికా** హలా! తథా ససంభ్రమదృష్టే భర్తు రూపే అహం సమ్ముఖస్థితా తథా న వితృష్ణాస్మి, యథాద్య మయా విభావిత శ్చిత్రగతో భర్తా

**రాజు :-** గౌతమా! నీ సఖి (మాళవిక) నాకొఱకెట్లు ఎదురు చూచుచున్నదో?. రమ్ము! ఈ గవాక్షమును చేరి ఆమె, నించుక తిలకింతము.

(అని ఇరువురును చూచుచుందురు.)

(అంతట మాళవికయును, వకుళావలికయును ప్రవేశింతురు )

**వకుళావలిక :-** చెలీ! భర్తకు (ప్రభువుకు) ప్రణమిల్లుము

**రాజు :-** నా చిత్రమును చూపుచున్న దనుకొందును

**మాళవిక :-** (హర్షముతో) నమస్కారము, (ద్వారము వైపునకు చూచి, విషాదముతో) భర్త ఎచ్చట? చెలీ! నన్ను వంచించుచున్నావు.

**రాజు :-** మిత్రమా! ఈమెయొక్క ఆనంద, విషాదములచే నే నానందించుచున్నాను

సూర్యోదయ సమయమునందును, సూర్యాస్తమయ సమయమునందును, పుండరీకమునకు (పద్మమునకు) ఏఏ యవస్థ సంభవించునో, అట్టి రెండవస్థలును ఈ సుముఖి వదనమునం దిప్పు డొక్కుమ్మడిగ కననగుచున్నవి. 7

**వకుళావలిక :-** ఇదుగో! చిత్రమున భర్త!

**ఇరువురు .-** (ప్రణమిల్లి) ప్రభువులకు జయము. జయము

**మాళవిక :-** చెలీ! ఇప్పుడు చిత్రగతుడైన ప్రభువును భావించుటచే కలిగిన తృప్తి, అప్పుడు సమ్ముఖమునందుండి, ప్రభువుయొక్క రూపమును తొందరలో చూచినప్పుడు కలుగలేదు సుమా!

**విదూషకః** శ్రుతం భవతా? అత్ర భవత్యా యథా దృష్ట శ్చిత్రే న తథా దృష్టో భవా నితి మంత్రితమ్. ముధేదానీం త్వం మంజూషేవ రత్నభాండం యౌవనగర్వం వహసి.

**రాజా** సఖే! కుతూహలవానపి నిసర్గశాలీనః స్త్రీ జనః. పశ్య

**131.విదూషకుడు** వింటివా? నీవు చిత్రములో కనబడినట్లు సాక్షాత్తుగా కనబడలేదని ఈమె పలుకుచున్నది రత్నభాండమును, మంజూషమువలె నీవిప్పుడు వృథగా యౌవనగర్వమును వహించుచున్నావు (కథయొక్క పూర్వాపర సన్నివేశమునుబట్టి మాళవికయొక్క వాక్యములకు వక్రభాష్యముచేయుచు విదూషకుడు రాజు యౌవన దశను దాటియును యౌవనపు చేష్టలను చేయుచున్నాడని పరిహసించెను. అగ్నిమిత్రుడు మొదట చిత్రమును చూచి, తరువాత మాళవికను ప్రత్యక్షముగా చూచును. అందువలన ఆయనకంటికి చిత్రములోని కంటె ప్రత్యక్షమాళవికయే అందముగా కనబడినది మాళవికకు వయసు మళ్లకుండుటయే ఇందుకు కారణము. కాని, మాళవిక ముందుగా తృతీయాంకమున

రాజును ప్రత్యక్షముగా చూచినది. అప్పటి కాయనకు యౌవన దశ దాటినది.తరువాత చతుర్థాంకమున ఇప్పుడా రాజును చిత్రపటములో చూచినది. అందతడు స్వమ్మోహనుడుగా కనబడినాడు. ఆ చిత్రము రాజు యొక్క యౌవన దశలో చిత్రింపబడినది. కనుక మాళవికకు ప్రత్యక్ష దర్శనము కంటె, రాజు యొక్క చిత్రదర్శనమే ఆనందము నిచ్చినది. ఈ విషయమునే చిత్రగత రూపమును, రత్నభాండముగను, ప్రత్యక్ష రూపమును పేటికగను ఊహించి, విదూషకుడు పరిహసించినాడు.

**రాజు .-** చెలికాడా! స్త్రీజనము కుతూహలము కలదయ్యు, సహజముగా లజ్జ కలది చూడు

**శ్లో -** కార్త్స్న్యేన నిర్వర్ణయితుం చ రూపం
ఇచ్ఛంతి తత్పూర్వ సమాగతానామ్।
న చ ప్రియే ష్వాయతలోచనానాం
సమగ్రవృత్తీని విలోచనాని॥ 8

**మాలవికా -** హలా! కైషా పార్శ్వపరివృత్తవదనా భర్త్రా స్నిగ్ధయా దృష్ట్యా నిధ్యాయతే.

**వకులావలికా -** నన్వియం పార్శ్వగతా ఇరావతీ.

**మాలవికా -** సఖి! అదక్షిణ ఇవ మే భర్తా ప్రతిభాతి. యః సర్వ దేవీజన ముజ్ఝిత్వా ఏకస్యా ముఖే బద్ధలక్ష్యః.

**వకులావలికా -** (ఆత్మగతం) చిత్రగతం భర్తారం పరమార్థతః సంకల్ప్య అసూయతే. భవతు క్రీడయిష్యామి తావ దేతయా. (ప్రకాశం) హలా! భర్తుః వల్లభైషా.

**మాలవికా -** తతః కి మిదానీ మాత్మాన మాయాసయిష్యామి.

(ఇతి సాసూయం పరావర్తతే.)

**రాజా -** సఖే! పశ్య తే సఖ్యా ముఖమ్.

**శ్లో -** భ్రూభంగభిన్నతిలకం, స్ఫురితాధరోష్ఠం,
సాసూయ మానన మితః పరివర్తయంత్యా।
కాంతాపరాధ కుపితే ష్వనయా వినేతుః
సందర్శితేవ లలితాభినయస్య శిక్షా॥ 9

**రాజు .-** విశాలములైన లోచనములుకల ప్రియురాండ్రు! తొలిసారి గా కలసికొన్న తమ ప్రియుల రూపమును సంపూర్ణముగా వర్ణింప వలెనని కోరుకొందురు కాని ఆ వారిజాక్షుల లోచనములు (సిగ్గుతో) ప్రియుల రూపసౌందర్యముపై సంపూర్ణముగా ప్రసరింపలేవని భావము. 8

**మాళవిక :-** సఖీ! ప్రక్కకుత్రిప్పిన మొగముకలదై, ప్రభువుచే ప్రీతితో తిలకింపబడుచున్న యీామె ఎవ్వతె?

**వకుళావలిక :-** ప్రక్కన ఉన్న ఈమె, ఇరావతియే కదా!

**మాళవిక -** చెలీ! ప్రభువు అదక్షిణునివలె నాకు తోచుచున్నాడు ఏలయన దేవీజనమునందఱను విడిచి, ఒక్క ఈమె ముఖమునందే చూపు నిలిపియున్నాడు.

**వకుళావలిక :-** (తనలో) చిత్రగతుడైన ప్రభువును నిజముగా భావించి, 'ఈమె అసూయపడుచున్నది కానిమ్ము. కొంచె మీమెను ఆడింతును! (పైకి) చెలీ! ప్రభువున కీమె ప్రియతమురాలు

**మాళవిక .-** అయినచో ఇప్పుడు న న్నాయాస పెట్టుకో నేటికి?

(అని అసూయతో వెనుతిరుగును.)

**రాజు :-** సఖుడా! నీ స్నేహితురాలియొక్క ముఖమును చూడుము.

కనుబొమముడిచే చిట్లిన తిలకముకలిగి, చిట్లిన క్రింది పెదవికల, ముఖమును, ఆసూయతో ఇటునుండి మరలించు చున్న అమె, ప్రియుల అపరాధములవలన కలిగెడు కోపమును ప్రదర్శింపవలసి వచ్చినపుడు, ఆచార్యుడు నేర్పిన లలితకళాభినయవిద్యను ప్రదర్శించుచున్నదా అన్నట్లున్నది. 9

**విదూషకః** అనునయసజ్జ ఇదానీం భవ.

**మాలవికా** ఆర్య గౌతమో ఒ ప్యత్రైవ సేవతే ఏనమ్.

(ఇతి పునః స్థానాంతరాభిముఖీ భవితుం ఇచ్ఛతి)

**వకులావలికా** (మాలవికాం రుధ్వా) న ఖలు కుపి తేదానీం త్వమ్.

**మాలవికా** యది చిరం కుపితావేవ మాం మన్యసే ఏష ప్రత్యానీయతే కోపః.

**రాజా** (ఉపేత్య)

**శ్లో** **కుప్యసి కువలయనయనే! చిత్రార్పిత చేష్టయా కిమేవం మయి।**

**నను తవ సాక్షా దయ మహ మనన్యసాధారణో దాసః॥ 10**

**వకులావలికా** జయతు. జయతు. భర్తా.

**మాలవికా** (ఆత్మగతం) కథం చిత్రగతో భర్తా మయా అసూయితః.

(సవ్రీడవదనా అంజలిం కరోతి.)

(రాజా మదనకాతర్యం నిరూపయతి.)

**విదూషకః** కిం భవా నుదాసీన ఇవ తిష్ఠతి ?

**రాజా** అవిశ్వసనీయత్వాత్ సఖ్యా స్తే.

**విదూషకః** అత్రభవత్యాం కథం తే ఒవిశ్వాసః?

**విదూషకుడు .-** అనునయమునకు ఇప్పుడు సిద్ధపడుము

**మాళవిక :-** ఆర్య గౌతముడు కూడా ఇందే ఆయనను సేవించుచున్నాడు (అని మరల వేరొక వైపునకు ముఖమును మరలింప గోరుచున్నది)..

**వకుళావలిక :-** (మాలవికను ఆపి) నీవిప్పుడు కోపగింప లేదు కదూ!

**మాళవిక :-** చాలసేపు కోపించుదానినిగా నన్ను తలుతువేని, ఇదుగో కోపమును మరల తెచ్చుకొనుచున్నాను.

**రాజు .-** (సమీపించి)

ఓ కువలయాక్షీ! చిత్రమునందలి చేష్టచేతనే నావట్ల కోపగింతువేల? ఈ నేను నీకు అనన్యసాధారణుడనైన దాసుడను సుమా! 10

**వకుళావలిక :-** ఏలినవారికి జయము. జయము.

**మాళవిక :-** (తనలో) ఎట్లా! నే(నింతవరకు) కోపించినది చిత్రగతుడైన ప్రభువుపట్లనా?

(సిగ్గుమొగముతో అంజలి బంధించును.)

(రాజు మదనాకులతను అభినయించును.)

**విదూషకుడు :-** ఏమియు పట్టనివానివలె నుంటివేమి?

**రాజు :-** నీ సఖి విశ్వసింపరాని దగుటవలన!

**విదూషకుడు :-** ఆమెయందు అవిశ్వాసము నీ కెట్లు కలిగినది?

**రాజా** శ్రూయతామ్

**శ్లో** **పథి నయనయోః స్థిత్వా స్వప్నే తిరోభవతి క్షణాత్**
**సరతి సహసా బాహ్వోర్మధ్యం గతాపి సఖీ తవ।**
**మనసిజరుజాక్లిష్ట స్యైవం సమాగమమాయయా**
**కథ మివ సఖే! విస్రబ్ధం స్యా దిమాంప్రతి మే మనః॥ 11**

**వకులావలికా** సఖి! బహుశః కిల విప్రలబ్ధో భర్తా. ఇదానీం తావ దాత్మా విశ్వసనీయః క్రియతామ్.

**మాలవికా** సఖి! మమ పున ర్మందభాగ్యాయాః స్వప్నసమాగమో ఽపి భర్తుః దుర్లభ ఆసీత్.

**వకులావలికా** భర్తా దదాత్వస్యా ఉత్తరమ్.

**రాజా** **శ్లో. ఉత్తరేణ కి మాత్మైవ పంచబాణాగ్ని సాక్షికమ్।**
**తవ సఖ్యై మయా దత్తో న సేవ్యః సేవితా రహః॥ 12**

**వకులావలికా** అనుగృహీతే స్వః.

**విదూషకః** (పరిక్రమ్య ససంభ్రమం) వకులావలికే! ఏష బాలాశోక వృక్షస్య పల్లవాని అభిలంఘయితు మిచ్ఛతి హరిణః ఏహి నివారయావ ఏనమ్.

**వకులావలికా** తథా. (ఇతి ప్రస్థితా.)

**రాజు .-** వినుము

సఖుడా! నీ చెలి కలలో కనుల ఎదుట నిల్చియుండియు క్షణములో మాయమగును బాహువుల మధ్యకు చేరియును (కౌగిలిలోకి చేరియు) వెంటనే జారిపోవును, ఈ విధముగా, సమాగమభ్రమచే మదనబాధాపీడితమైన నా హృదయము ఈమెను ఎట్లు నమ్మగలదు? 11

**వకుళావలిక :-** చెలీ! (ఇంతకుపూర్వము) ప్రభువును పలుమారులు మోసగించితివి, కనుక ఇప్పుడు నిన్ను నమ్మదగిన దానివిగా చేసికొనుము

**మాళవిక :-** చెలీ! మందభాగ్యురాలనైన నాకు ప్రభువుయొక్క స్వప్నసమాగమముకూడ దుర్లభమే అయ్యెను.

**వకుళావలిక:-** ప్రభువువారు ఈమెకు ప్రత్యుత్తరము నిత్తురుగాక!

**రాజు .-** ప్రత్యుత్తరమేమిటి? మదనాగ్నిసాక్షికముగా నీ చెలికి నా ఆత్మనే ఇచ్చుకొంటిని నేను ఏకాంతమున సేవకుడనే కాని సేవింపదగినవాడను కాను (మీరిద్దరు (వకుళావలికా, విదూషకులు) నన్నిప్పుడు సేవింపక దూరముగా ఉండుడని రాజు భావము ) 12

**వకుళావలిక :-** అనుగ్రహింపబడినాము.

**విదూషకుడు :-** (ముందుకు నడిచి, సంభ్రమముతో) వకుళావలికా! ఇదుగో ఈ లేడి, బాలాశోకవృక్షపు లేజవుళ్ళను కొరుకగోరుచున్నది. దీనిని నివారింతము రమ్ము.

**వకుళావలిక :-** అలాగే (అని బయలుదేరును.)

**రాజా** వయస్య ! ఏవ మస్మ ద్రక్షణే వయస్యే నావహితేన త్వయా భవితవ్యమ్.

**విదూషకః** ఏత దపి గౌతమో నను సందిశ్యతే?

**వకులావలికా** (పరిక్రమ్య) ఆర్య గౌతమ! అహ మప్రకాశే తిష్ఠామి. త్వం ద్వారరక్షకో భవ..

**విదూషకః** యుజ్యతే.

(నిష్క్రాన్తా వకులావలికా.)

**విదూషకః** (పరిక్రమ్యావలోక్య చ ఇదం తావ త్స్ఫటికస్థలం సంశ్రితో భవామి. (తధా కృత్వా) అహో సుఖస్పర్శతా శిలావిశేషస్య.

(ఇతి నిద్రాయతే.)

(మాలవికా ససాధ్వసా తిష్ఠతి.)

**రాజా** **శ్లో. విసృజ సుందరి! సంగమసాధ్వసం**
**తవ చిరాత్ప్రభృతి ప్రణయోన్ముఖే।**
**పరిగృహాణ గతే సహకారతాం**
**త్వ మతిముక్తలతాచరితం మయి॥** **13**

**మాలవికా** దేవీభయా దాత్మనో ఽ పి ప్రియం కర్తుం న పారయామి.

**రాజు :-** చెలికాడా! ఇట్లే మా రక్షణమునందును, మిత్రుడవైన నీవు శ్రద్ధగలవాడవై యుండవలెను

**విదూషకుడు :-** గౌతమునకు దీనిని కూడ చెప్పవలెనా?

**వకుళావలిక :-** (ముందుకు నడిచి), ఆర్యా గౌతముడా! నేను చాటున ఉందును, నీవు ద్వారరక్షకుడవుకమ్ము.

**విదూషకుడు :-** మంచిది.

(వకుళావలిక నిష్క్రమించును )

**విదూషకుడు .-** (పరిక్రమించి, చూచి) ఇంక ఈ స్ఫటికశిలాతలము నాశ్రయింతును (అట్లుచేసి). ఓహో ఈశిలావిశేషము ఎంత సుఖ స్పర్శముగా నున్నది.

(అని కునుకుతీయును )

(మాళవిక భీతయై నిలిచియుండును.)

సుందరీ! చిరకాలము నుండి, నీ ప్రణయమును పొందుటకై ఎదురు చూచుచుండిన నాపట్ల సంగమభీరుత్వమును (మొదటిసారిగా కలిసినప్పుడు ఏర్పడు భయమును) విడువుము, చూతవృక్షత్వమును పొందిన నాయెడ నీవు గురివింద తీవతీరును స్వీకరింపుము నన్ను పెనవేసికొనుమని భావము 13

**మాళవిక :-** దేవివలనవచ్చు భయమువలన నా ప్రియమును గూడ నేను తీర్చుకోజాలనుకున్నాను

**రాజా** అయి న భేతవ్యమ్

**మాలవికా** (సోపాలంభం) యో న బిభేతి, స మయా భట్టినీదర్శనే దృష్టసామర్థ్యో భర్తా నను.

**రాజా** **శ్లో. దాక్షిణ్యం నామ బింబోష్ఠి! బైంబికానాం కులవ్రతమ్।**
**త న్మే దీర్ఘాక్షి యే ప్రాణా స్తే త్వదాశానిబంధనాః॥ 14**
తదనుగృహ్యతాం చిరానురక్తో ఽ యం జనః

(ఇతి సంశ్లేషం అభినయతి.)

(మాలవికా నాట్యేన పరిహరతి.)

**రాజా** (స్వగతం) రమణీయః ఖలు నవాంగనానాం మదన విషయావతారః. ఏషా హి

**శ్లో** **హస్తం కంపవతీ రుణద్ధి రశనావ్యాపారలోలాంగుళిం**
**హస్తౌ స్వౌ నయతి స్తనావరణతా మాలింగ్యమానా బలాత్।**
**పాతుం పక్ష్మలనేత్ర మున్నమయతః సాచీకరో త్యాననం**
**వ్యాజేనా ప్యభిలాషపూరణసుఖం నిర్వర్తయత్యేవ మే॥ 15**

(తతః ప్రవిశతి ఇరావతీ నిపుణికా చ )

**రాజు :-** ప్రియా! భయపడకుము.

**మాళవిక :-** (ఎత్తిపొడుపుగా) భయపడని ప్రభువుగారి శక్తి, భట్టిని కనబడినప్పుడు కనబడినది కదా!

**రాజా .-** బింబోష్ఠీ! (దొండపండు వంటి, ఎఱ్ఱని క్రిందిపెదవి కలదానా!) బింబవంశసంజాతులమైన మాకు దాక్షిణ్యము అన్నది. (భార్య లందరియందు సమానమైన ప్రేమ భావము కలిగి యుండుట) కులవ్రతము అయినను, విశాలలోచనా! నా ప్రాణములు నీమీది ఆశచే కట్టుబడియున్నవి. 14

(అని కౌగిలించుకొనున ట్లభినయించును )

మాళవిక తప్పించుకొనినట్లు నటించును

**రాజు :-** క్రొత్త పడుచులు ప్రేమవ్యవహారములలోనికి ప్రవేశించు విధము రమణీయముగా ఉండునుగదా! ఈమె.

మొలనూలును విడిపింపజూచిన వేళ్లుగల నాచేతిని, వణుకుచున్నదై నిరోధించుచున్నది బలవంతముగా కౌగిలించుకొనబోగా, తన చేతులతో స్తనములను కప్పుకొనును తీర్చిదిద్దినట్లున్న కనురెప్పలుకల నేత్రములున్న ముఖమును పానము చేయుటకై పైకెత్తగా, ఆ ముఖము నడ్డము త్రిప్పికొనును. తిరస్కరించుమిషచేతనైనను, కోర్కె తీరినంత సుఖమును నాకు కలిగించుచునేయున్నది 15

(అంతట ఇరావతియును నిపుణికయును ప్రవేశింతురు )

**ఇరావతీ** హఞ్జే నిపుణికే! సత్యం త్వం పరిగతార్థా చంద్రికయా సముద్రగృహకాలిందె శయిత ఏకాకీ ఆర్యగౌతమో దృష్ట' ఇతి.

**నిపుణిక** అన్యథా కథం భట్టిన్యై విజ్ఞాప్యతే.

**ఇరావతీ** తేన హి తత్రైవ గచ్ఛావః. మృత్యుసంశయా న్ముక్తం ఆర్య పుత్రస్య ప్రియవయస్యం ప్రేక్షితుం చ

**నిపుణికా** సావశేషమివ భట్టిన్యా వచనమ్?

**ఇరావతీ** అమ్. చిత్రగత మార్యపుత్రం ప్రసాదయితుం చ.

**నిపుణికా** అథేదానీం కథం ను భర్త్రైవ ప్రత్యనునీయతే?

**ఇరావతీ** ముగ్ధే! యాదృశ శ్చిత్రగతః నను తాదృశ ఏవ అన్యసంక్రాంత హృదయ ఆర్యపుత్రః. కేవలం ఉపచారాతిక్రమం ప్రమార్ష్టు మయ మారంభః.

**నిపుణికా** ఇత ఇతో భట్టినీ.

(ఇతి పరిక్రామతః.)

(ప్రవిశ్య.)

**చేటీ** జయతు భట్టినీ దేవీ భణతి "నైష మే మత్సరస్య కాలః తవ ఖలు బహుమానం వర్ధయితుం వయస్యికయాసహ నిగడబంధనేకృతా మాలవికా. య

**ఇరావతి** - ఓసే! నిపుణికా! సముద్రగృహపువాకిట ఆర్య గౌతముడు ఒంటరిగా నిద్రించుచుకనబడినాడని చంద్రిక నీకు చెప్పినమాట సత్యమేనటే!

**నిపుణిక** :- కానిచో భట్టినికి ఎట్లు విన్నవింతును?

**ఇరావతి** :- అట్లైన మరణసంశయమునుండి బయటపడిన, ఆర్యపుత్రుని యొక్క ప్రియమిత్రుడైన, అతనిని (ఆర్యమాణవకుని) చూచుటకు అచ్చటకే పోవుదము.

**నిపుణిక** :- భట్టిని వాక్యము సావశేషముగా (వలె) నున్నది!

**ఇరావతి** :- అవును, చిత్రగతుడైన ఆర్యపుత్రుని ప్రసన్నుని చేసికొనుటకును.

**నిపుణిక** :- మరి ఇప్పుడు ప్రభువునే ఎందుకు వేడుకొనగూడదు?

**ఇరావతి** :- ఓసే బేలా! అన్యసంక్రాంతహృదయుడైన ఆర్యపుత్రుడు చిత్రములోనున్నపు డెట్టివాడో, ప్రత్యక్షముగా కూడ అట్టివాడే కదా! నేను చేసిన మర్యాదాతిక్రమమును, తుడిచివేయుటకు మాత్రమే ఈ నా ప్రయత్నము.

**నిపుణిక** :- భట్టిని ఇటు, ఇటు!

(అని ఇరువురును పరిక్రమింతురు )

(ప్రవేశించి)

**చేటి** - భట్టినికి జయము. దేవి ఇట్లు మీకు చెప్పుమనినది "ఇది నాకు మత్సరించుటకు తగిన సమయము కాదు. నీ గౌరవమును పెంచుటకు మాత్రమే చెలికత్తెతోకలిపి, మాళవికను సంకెళ్ళలో నుంచితిని" నీ వంగీకరించినచో ఆర్యపుత్రునకు

ద్యనుమన్యసే, ఆర్యపుత్రస్య ప్రియం కర్తుం ఇచ్ఛామి. య త్తవేష్టం తన్మే భణ" ఇతి.

**ఇరావతీ** సాగరికే! విజ్ఞాపయ దేవీం "కా వయం భట్టినీం నియోజయితుమ్. పరిజన నిగ్రహేణ మయి దర్శితః స్నేహః. కస్య వాన్యస్య ప్రసాదే నాయం జనో వర్ధతే" ఇతి.

(ఇతి నిష్క్రాన్తా.)

**చేటీ** తధా.

**నిపుణికా** (పరిక్ర మ్యావలోక్య చ) భట్టిని! ఏష ద్వారి సముద్రగృహకస్య విపణిగతో వృషభ ఇవ విస్రబ్ధ ఆర్యగౌతమ ఆసీనో నిద్రాయతే.

**ఇరావతీ** అత్యాహితమ్. న ఖలు సావశేషవికారో భవేత్.

**నిపుణికా** ప్రసన్నముఖవర్ణో దృశ్యతే. అపి చ ధ్రువసిద్ధినా చికిత్సితః. తదస్య అశంకనీయం పాపమ్.

**విదూషకః** (ఉత్స్వప్నాయతే) భవతి మాలవికే!

**నిపుణికా** శ్రుతం భట్టిన్యా? కస్యైష ఆత్మనీనో హతాశః కితవః. ఇతఏవ సర్వం కాలం స్వస్తివాచనమోదకైః కుక్షిం పూరయిత్వా, సాంప్రతం మాలవికాం ఉత్స్వప్నాయతే.

ప్రియమాచరింప `గోరుచున్నాను'' నీ ఇష్టమేమో నాకు తెలియజేయుము'' అని

**ఇరావతి :-** సాగరికా! దేవికి విన్నవింపుము. "భట్టినిని నియోగించుటకు మే మెవరము? తన పరిజనమును దండించుటచేత దేవి నా యెడలగల స్నేహమును చూపినది. మరి వేరెవ్వరి ప్రసాదమున ఈ జనము వర్థిల్లగలదు?'' అని

(అని నిష్క్రమించును.)

**చేటి :-** అట్లే.

**నిపుణిక :-** (పరిక్రమించి, చూచి) భట్టిని! ఇడుగో సముద్రగృహద్వారమున అంగడియందలి వృషభమువలె (అచ్చుపోసిన ఆంబోతువలె) ఆర్య గౌతముడు నిశ్శంకముగా కూర్చొని, నిద్రపోవుచున్నాడు.

**ఇరావతి :-** అయ్యో! ప్రమాదము! విషవికార మింకను మిగిలియుండలేదు కదా?

**నిపుణిక :-** ముఖము తేటగానే కనబడుచున్నది పైగా ధ్రువసిద్ధిచే చికిత్సపొందినాడు కదా! కనుక ఈతనికి ప్రమాదమును శంకింపరాదు.

**విదూషకుడు :-** (కలవరించుచు) పూజ్యురాలా! మాళవికా!

**నిపుణిక :-** భట్టిని! వింటిరా? స్వార్థపరుడు, హతాశుడునైన ఈ కుటిలుడు ఎవ్వరివాడు? ఎల్లకాలము ఇటునుండియే స్వస్తివాచన మోదకములచే (స్వస్తి, ఆశీర్వచనమును చెప్పి, వాయనముగా ఇచ్చిన కుడుములు, లడ్డులచే) పొట్ట నింపుకొనుచుండి, ఇప్పుడు మాళవికను పలవరించుచున్నాడు.

**విదూషకః** ఇరావతీ మతిక్రామంతీ భవ

**నిపుణికా** శ్రుత మేత దత్యాహితమ్? భుజంగభీరుకం బ్రహ్మబంధుం అనేన భుజంగకుటిలేన దండకాష్ఠేన స్తంభాంతరితా భీషయిష్యామి.

**ఇరావతీ** అర్హతి కృతఘ్నః ఉపద్రవస్య.

(నిపుణికా విదూషక స్యోపరి దండకాష్ఠం పాతయతి.)

**విదూషకః** (సహసా ప్రబుధ్య) అవిహా అవిహా, భో దర్వీకరో మే ఉపరి పతితః.

**రాజా** (సహసోపసృత్య) సఖే! న భేతవ్యం. న భేతవ్యమ్.

**మాలవికా** (అనుసృత్య) భర్తః, మా తావ త్సహసా నిష్క్రామ, సర్ప ఇతి భణతి.

**ఇరావతీ** హాధిక్! హాధిక్! భర్తా తావ దిత ఏవ ధావతి.

**విదూషకః** (సప్రహాసం) కథం దండకాష్ఠ మేతత్. అహం పున ర్జానే యన్మయా కేతకకంటకై ర్దంశం కృత్వా సర్పస్య దంశ ఇవ కృతః తన్మే ఫలిత మితి.

(తతః ప్రవిశతి పటాక్షేపేన వకులావలికా)

**వకులావలికా** (ససంభ్రమం) మా తావ ద్భర్తా ప్రవిశతు. ఇహ కుటిలగతిః సర్ప ఇవ దృశ్యతే.

**ఇరావతీ** (రాజానం సహసోపసృత్య) అపి నిర్విఘ్నమనోరథో దివాసంకేతో మిథునస్య?

**విదూషకుడు :-** ఇరావతిని మించుదానవు కమ్ము

**నిపుణిక :-** ఈ ఘోరమును వింటివా? పా మనిని భయపడు ఈ భ్రష్ట బ్రాహ్మణుని, పామువలె వంకరయైన ఈ కఱ్ఱతో, స్తంభము చాటున ఉండి, భయపెట్టుదును.

**ఇరావతి .-** ఈ కృతఘ్ను డీ ఉపద్రవమునకు తగియున్నాడు.

(నిపుణిక, విదూషకుని మీద వంకర కఱ్ఱను పడవేయును.)

**విదూషకుడు .-** (తటాలున మేల్కొని) అయ్యో! అయ్యో! నా మీద పాము పడినది!

**రాజు :-** (తటాలున సమీపించి) చెలికాడా! భయపడకు, భయపడకు.

**మాళవిక :-** (వెంటవచ్చి) ప్రభూ! తటాలున వెలువడకుడు, పాము అని పలుకుచున్నాడు

**ఇరావతి :-** ఛీ, ఛీ, ప్రభువుకూడ ఇటే పరుగిడివచ్చుచున్నాడు.

**విదూషకుడు -** (నవ్వుతో) ఎట్లా! ఇది దండకాష్ఠమా! మరి మొగలి ముళ్ళతో గంటుచేసి, పాముకాటులాగ చేసుకొన్నది, నాకు యథార్థమే అయినదని (ఎంతో) భయపడితిని.

(అంతట తెరను త్రోసికొని వకులావలిక ప్రవేశించును.)

**వకుళావలిక :-** (సంభ్రమముతో) ప్రభువు ప్రవేశింపవలదు. ఇచ్చట వంకరగా కద. ..గు పామువలె కనబడుచున్నది.

**ఇరావతి :-** రాజును తటాలున సమీపించి, (మీ) మిధునమునకు పగటి సంకేతము నిర్విఘ్నముగా ఫలించినదా?

(సర్వే ఇరావతీం దృష్ట్వా సంభ్రాంతాః.)

**రాజా** - అయే! అపూర్వోఽయ మపచారః.

**ఇరావతీ** వకులావలికే! దిష్ట్యా దౌత్యాధికారవిషయా సంపూర్ణా తే ప్రతిజ్ఞా.

**వకులావలికా** ప్రసీదతు భట్టినీ. కిం ను ఖలు దర్దురాః వ్యాహరంతీతి పృథివ్యాం దేవో వర్షితుం విరమతి.

**విదూషకః** మా తావత్. భవత్యా దర్శనమాత్రేణ అత్రభవాన్ ప్రణిపాతలంఘనం విస్మృతః. భవతీ పున రద్యాపి ప్రసాదం న గృహ్ణాతి.

**ఇరావతీ** కుపితా పీదానీం అహం కిం కరిష్యామి?

**రాజా** అస్థానే కోప ఇ త్యనుపపన్నం త్వయి. తథాహి.

**శ్లో.** **కదా ముఖం వరతను కారణాదృతే**
**తవాగతం క్షణమపి కోపపాత్రతామ్।**
**అపర్వణి గ్రహకలుషేందుమండలా**
**విభావరీ కథయ కథం భవిష్యతి॥ 16**

**ఇరావతీ** అస్థానే ఇతి సుష్ఠు అవధారిత మార్యపుత్రేణ. అన్య సంక్రాంతే ష్వస్మాకం భాగధేయేషు యది పునః కుప్యేయం, తతో ఽ హం హాస్యా భవేయమ్.

(అందరును ఇరావతినిగ్రాంచి తొట్రువడుదురు.)

**రాజు :-** (ప్రియా!) అహో! ఇదియే నా మొట్టమొదటి అపచారము. (ఇంతకు ముందెన్నడును ఇట్టి తప్పుచేయలేదు.)

**ఇరావతి :-** వకుళావలికా! (రాజును మాళవికతో) తార్పుడువిషయమున అదృష్టవశమున, నీ ప్రతిజ్ఞ పూర్తియైనది.

**వకుళావలిక :-** భట్టిని దయచూడవలెను. కప్పలు బెకబెకలాడునని దేవేంద్రుడు భూమిపై వర్షించుట మానునా?

**విదూషకుడు :-** అట్లుకాదు, నీదర్శన మాత్రముచేతనే ఈ పూజ్యుడు ప్రణిపాత తిరస్కారమును (తృతీయాంకము చివర రాజునకు నమస్కరింపక కోపముతో ఇరావతి వెళ్లిపోయి చేసిన అవమానమును) మఱచినాడు. మరినీవో, ఇప్పటికిని ప్రసన్నతను వహింపకున్నావు.

**ఇరావతి :-** కోపించినంతమాత్రమున నే నిప్పు డేమి చేయగలను?

**రాజు :-** అస్థానమున కోపము అన్నది నీకు తగదు. అట్లేకదా!

వరాంగీ! కారణము లేకుండనే నీముఖము క్షణకాలమైనను కోపమునకు ఎప్పుడు ఆశ్రయమైనది? పర్వమునగాక (అమావాస్య, పూర్ణిమతిథులయందుగాక) రాత్రి రాహు గ్రహణముచే కలుషితమైన చంద్రమండలము కలది ఎట్లగునో నీవే చెప్పుము. (కాదని భావము) 16

**ఇరావతి :-** "అస్థానమున" అని ఆర్యపుత్రులు చక్కగా నిశ్చయించినారు. మా అదృష్టములు అన్యసంక్రాంతము లైనప్పుడు నేను ఇంకను కోపించినచో పరిహాసపాత్రురాలను కావలసివచ్చును.

**రాజా** త్వ మన్యథా కల్పయసి. అహం పునః సత్యమే వాత్ర కోప స్థానం న పశ్యామి కుతః

**శ్లో** **నార్హతి కృతాపరాధో ఽ ప్యృత్సవ దివ సేషు పరిజనో బంధమ్।**

**ఇతి మోచితే మ యైతే ప్రణిపతితుం మా ముపగతే చ॥17**

**ఇరావతీ** నిపుణికే! గచ్ఛ దేవీం విజ్ఞాపయ 'దృష్టం భవత్యాః పక్షపాతిత్వం నన్వద్య' ఇతి.

**నిపుణికా** తథా. (ఇతి నిష్క్రాన్తా.)

**విదూషకః** (ఆత్మగతం) అహో అనర్థః సంపతితః. బంధనభ్రష్టో గృహకపోతకో బిడాలికాయా ఆలోకే పతితః.

**నిపుణికా** (ప్రవిశ్య) (అపవార్య) భట్టిని! యదృచ్ఛాదృష్టయా మాధవికయా ఽఽ ఖ్యాతం ఏవం ఖల్వేత న్నివృత్త మితి.

(ఇతి కర్ణే కథయతి.)

**ఇరావతీ** (ఆత్మగతం) ఉపపన్నం సర్వమేవ. సత్య మయ మత్ర బ్రహ్మబంధునా ఉద్భిన్నః దుష్ప్రయోగః.

(విదూషకం విలోక్య ప్రకాశం) ఇయ మస్య కామతంత్రసచివస్య బ్రహ్మబంధో ర్నీతిః.

**రాజు :-** నీవు వేరువిధముగా ఊహించుచున్నావు. నేను మాత్రము నిజముగనే ఇందు కోపకారణమును కనజాలకున్నాను. ఏలయన

"పరిజనులు అపరాధులైనను, పండుగ రోజులయందు నిర్బంధమునకు అర్హులుకారు" అని నాచే వీరిరువురు విడిపింపబడినారు. (అందువలన ఇప్పుడు నాకు వీరిరువురును) ప్రణమిల్లుటకు వచ్చియున్నారు. 17

**ఇరావతి :-** నిపుణికా! పోయి దేవికి విన్నవింపుము. "తమ పక్షపాత స్వభావ మిప్పుడు కనబడినది సుమా" అని.

**నిపుణిక :-** అట్లే (అని నిష్క్రమించును )

**విదూషకుడు :-** అనర్థము వచ్చిపడినది. బంధనమునుండి తప్పించుకొనిన పెంపుడు పావురము బిడాలిక (ఆడుపిల్లి) కంటబడినది.

**నిపుణిక :-** (ప్రవేశించి) (అపవారించి) యాదృచ్ఛికముగా కనబడిన మాధవిక చెప్పినది. "ఇది ఇట్లు జరిగినదట" అని.

(అని చెవిలో చెప్పును )

**ఇరావతి :-** (తనలో) ఇదియంతయు తగినట్లే యున్నది నిజముగా ఈ దుస్తంత్ర మంతయు ఈ భ్రష్టబ్రాహ్మణుడు కల్పించినదే! (విదూషకుని చూచి, ప్రకాశముగా) ఇది కామ వ్యాపారమంత్రియైన ఈ భ్రష్టబ్రాహ్మణుని నీతియే!

**విదూషకః** భవతి! యది నీత్యాం ఏకమ ప్యక్షరం పరేయం నాత్ర భవంతం సంశ్రితో భవేయమ్.

**రాజా** (ఆత్మగతం) కథం ను ఖల్వస్మాత్సంకటా దాత్మానం మోచయిష్యామి?

(ప్రవిశ్య)

**జయసేనా** (సావేగం) దేవ! కుమారీ వసులక్ష్మీః కందుక మనుధావంతీ పింగళవానరేణ బలవ త్త్రాసితా. అంకనిషణ్ణా చ దేవ్యాః ప్రవాత కిసలయమివ వేపమా నేదానీం న కిమపి ప్రకృతిం ప్రతిపద్యతే.

**రాజా** కష్టం. కాతరో బాలభావః.

**ఇరావతీ** (సావేగం) త్వరతామ్. త్వరతామ్. ఆర్యపుత్ర ఏనాం సమాశ్వాసయితుమ్. మా తావ దస్యాః సంత్రాసజనితో వికారో వర్ధతామ్.

**రాజా** అహ మేనాం సంజ్ఞాపయామి.

(ఇతి సత్వరం పరిక్రామతి.)

**విదూషకః** (ఆత్మగతం) సాధు రే పింగళవానర! సాధు. సుష్ఠు పరిత్రాత స్త్వయా స్వపక్షః.

(నిష్క్రాన్తో రాజా, విదూషకశ్చ, ఇరావతీ, నిపుణికా, ప్రతీహారీచ.)

**విదూషకుడు .-** పూజ్యురాలా! నీతిలో ఒక్క అక్షరమేని పఠించియున్నచో ఈ ప్రభువును ఆశ్రయించుకొని యుండెడివాడను కాను.

**రాజు -** (తనలో) ఈ సంకటమునుండి నే నెట్లు తప్పించుకొందునో కదా!

(ప్రవేశించి)

**జయసేన :-** (ఆవేగముతో) కుమారి వసులక్ష్మి బంతివెంట పరువెత్తుచు పింగళవానరముచే తీవ్రముగా భయపెట్టబడి ప్రబలమారుతముచే చిగురాకువలె కంపించుచు, దేవిగారి ఒడిలో వడియున్నది. ఇప్పటికిని కొంచెము కూడా కుదుటపడకున్నది.

**రాజు :-** కటా! పసితనము పిరికిది!

**ఇరావతి :-** (ఆవేగముగా) ఆర్యపుత్ర, ఆమెను ఓదార్చుటకు త్వరపడుడు, త్వరపడుడు, భయమువలన కలిగిన ఆమె వికారము ఎక్కువ కాకూడదు.

**రాజు :-** నే నామెకు తెలివిని తెప్పింతును

(అని సత్వరముగా నిష్క్రమించును.)

**విదూషకుడు :-** (తనలో) మేలు? పింగళ వానరమా! మేలు! స్వపక్షమును చక్కగా కాపాడితివి.

(రాజును, విదూషకుడును, ఇరావతియును, నిపుణికయును, ప్రతీహారియును నిష్క్రమింతురు.)

**మాలవికా** హలా! దేవీం చింతయిత్వా వేపతే మే హృదయమ్. సంప్రతి కి మితః పరం అనుభవితవ్యం భవిష్యతీతి.

(నేపథ్యే)

ఆశ్చర్య మాశ్చర్యమ్. అపూర్ణ ఏవ పంచరాత్రే దోహదస్య, ముకులైః సంనద్ధః తపనీయాశోకః! యావ ద్దేవ్యై నివేదయామి.

(ఉభే శ్రుత్వా ప్రహృష్టే భవతః.)

**వకులావలికా** ఆశ్వాసయతు ప్రియసఖీ సత్యప్రతిజ్ఞా దేవీ.

**మాలవికా** తేన హి ప్రమదవన పాలికాయాః పృష్టతో భవావః.

**వకులావలికా** తథా.

(ఇతి నిష్క్రాన్తా స్సర్వే.)

ఇతి శ్రీకాళిదాసవిరచితే మాలవికాగ్నిమిత్రమ్
నామ సంస్కృతనాటకే
చతుర్థో ఽ ఙ్కః.



సముద్ర గృహంలోకి ప్రవేశిస్తున్న అగ్నిమిత్రుడు

**మాళవిక .-** చెలీ! దేవిని తలుచుకొని, నా హృదయము కంపించుచున్నది ఇప్పు డింతకుమించి ఏమి అనుభవింపవలసి యుండునో, ఎఱుగలే కున్నాను

(తెరవెనుకనుండి)

ఆశ్చర్య మాశ్చర్యము, దోహదముచేసి 5 దినములు మించకుండగానే బంగారపుటశోకము మొగ్గలు తొడిగినది. ఇప్పుడే దీనిని దేవికి నివేదింతును.

(ఇరువురును విని ఆనందింతురు )

**వకుళావళిక :-** ప్రియసఖీ ఊరడిల్లుము దేవి ఆడిన మాట తప్పదు.

**మాళవిక :-** అట్లయిన, ఉద్యానపాలికవెంటనే పోవుదము

**వకుళావళిక .-** అట్లే

(అని అందరు బయలుదేరుదురు.)

**ఇది మహాకవి శ్రీకాళిదాసు రచించిన "మాళవికాగ్నిమిత్రమ్" అను సంస్కృతనాటకమునందలి నాలుగవ అంకమునకు "ప్రవచనప్రభాకర ఉపన్యానకేసరి భాగవతరత్న" బిరుదాంకితుడైన బ్రహ్మశ్రీ గోళ్ళమూడి. వెంకట శ్రీహరి సుబ్రహ్మణ్యశర్మ వెలయించిన ఆంధ్రానువాదము.**



పాతాళ గృహము నుండి పైకి వచ్చిన మాళవిక

శ్రీః

# మాలవికాగ్నిమిత్రమ్

## పంచమో ఽఙ్కః

(తతః ప్రవిశ త్యుద్యానపాలికా.)

**ఉద్యానపాలికా** ఉపక్షిప్తో మయా కృతసత్కారవిధేః తపనీయాశోకస్య వేదికాబంధః. యావ దనుష్ఠితనియోగం ఆత్మానం దేవ్యై నివేదయామి. (పరిక్రమ్య) అహో! దైవస్య అనుకంపనీయా మాలవికా, య త్తస్యాం తథా చండీకృతా దేవీ అనేనాశోకకుసుమవృత్తాన్తేన ప్రసాదసుముఖీ భవిష్యతి. కుత్ర ను ఖలు భవే ద్దేవీ? (విలోక్య) అహో, ఏష దేవ్యాః పరిజనాభ్యంతరః. కి మపి జతుముద్రాలాఞ్ఛితాం మంజూషికాం గృహీత్వా, చతుఃశాలాత్ కుబ్జః సారసకః నిష్క్రామతి. ప్రక్ష్యామి తావ దేనమ్.

(తతః ప్రవిశతి యథానిర్దిష్టః కుబ్జః.)

**ఉద్యానపాలికా** (ఉపసృత్య) సారసక! కుత్ర ప్రస్థితో ఽసి?

**సారసకః** మధుకరికే! వేదపారగాణాం బ్రాహ్మణానాం నిత్య దక్షిణా దాతవ్యా. త దార్య పురోహితస్య హస్తం ప్రాపయితుమ్.

**మధుకరికా** కిం నిమిత్తమ్?

శ్రీః

# మాళవికాగ్నిమిత్రము

## ఐదవ అంకము

(అంతట ఉద్యానపాలిక ప్రవేశించును.)

**ఉద్యానపాలిక :-** బంగారపుటశోకవృక్షమునకు సత్కారవిధిని గావించి, వేదికను (తిన్నెకట్టును) నిర్మించితిని. నా కప్పగించిన బాధ్యతను సక్రమముగా నెరవేర్చితినని దేవికి విన్నవించెదను. (పరిక్రమించి), ఆహా! ఇప్పుడు దైవము మాళవికను కనికరించినది. ఏలయన, ఆమెపై అంతగా మండిపడిన దేవి ఈ తపనీయాశోకము పుష్పించినదను వార్తచే ప్రసాదాభిముఖురాలు కాగలదు దేవి ఇప్పు డెచ్చట నుండునో కదా! (చూచి) ఓహో దేవి పరిజనములోనివాడైన ఈ కుబ్జుడైన, సారసకుడు లక్కముద్రతో గుర్తింపబడిన మంజూషికను (పెట్టెను) తీసికొని, చతుశ్శాలనుండి బయటికి వచ్చుచున్నాడు. ఇప్పు డీతనిని అడుగుదును.

(అంతట నిర్దేశింపబడినతీరున కుబ్జుడు ప్రవేశించును.)

**ఉద్యానపాలిక -** (సమీపించి), సారసకా! ఎచ్చటికి బయలుదేరినావు?

**సారసకుడు .-** మధుకరికా! వేదపారగులైన బ్రాహ్మణులకు నిత్యదక్షిణ ఈయవలసియున్నది. దానిని పూజ్యుడైన పురోహితునకు అందజేయుటకు.

**మధుకరిక :-** ఎందుకొఱకు?

**సారసకుడు** యదాప్రభృతి శ్రుతం సేనాపతినా యజ్ఞతురగరక్షణే నియుక్తో భర్తృదారకో వసుమిత్ర ఇతి తదాప్రభృతి తస్యాయుషో నిమిత్తం అష్టాదశసువర్ణప్రమాణాం దక్షిణాం దక్షిణీయైః ప్రతిగ్రాహయతి.

**మధుకరికా** యుజ్యతే, అథ కుత్ర దేవీ? కింవా నుతిష్ఠతి?

**సారసకః** మంగళగృహే ఆసనస్థా భూత్వా విదర్భవిషయాత్ భ్రాత్రా వీరసేనేన ప్రేషితం లేఖం లిపికరీభిః వాచ్యమానం శృణోతి.

**మధుకరికా** కః పున ర్విదర్భరాజవృత్తాంతః శ్రూయతే?

**సారసకః** వశీకృతః కిల వీరసేనప్రముఖైః భర్తుః విజయదండకైః విదర్భనాథః. మోచితశ్చ అస్య దాయాదో మాధవసేనః తేన మహాసారాణి రత్నాని, వాహనాని, శిల్పకారికా భూయిష్ఠం పరిజనంచ ఉపాయనీకృత్య భర్తుః సకాశం ప్రేషితో దూతః. శ్వః కిల భర్తారం ద్రక్ష్యతీతి.

**మధుకరికా** గచ్ఛ. అనుతిష్ఠ ఆత్మనో నియోగమ్. అహ మపి దేవీం ప్రేక్షిష్యే.

(ఇతి నిష్క్రాన్తౌ)

## (ఇతి ప్రవేశకః)

(తతః ప్రవిశతి ప్రతీహారీ.)

**సారసకుడు** యాగాశ్వరక్షణార్థమై సేనాపతిచే యువరాజు వసుమిత్రుడు నియుక్తుడైనాడని విన్నది మొదలు ఆయన ఆయుష్యము కొఱకు దేవి పదునెనిమిది సువర్ణముల ప్రమాణముకల దక్షిణను గ్రహింపయోగ్యులైనవారికి ఇప్పించుచున్నది

**మదుకరిక** బాగున్నది మఱి దేవి ఎచ్చట? ఏమి చేయుచున్నది?

**సారసకుడు** మంగళగృహమున ఆసనస్థయై, విదర్భదేశమునుండి, తన తమ్ముడు వీరసేనుడు పంపిన లేఖను వ్రాయసకత్తెలు చదువు చుండగా, వినుచున్నది

**మదుకరిక** విదర్భరాజు వృత్తాంత మేమని వినబడుచున్నది?

**సారసకుడు** వీరసేనప్రముఖులైన, ప్రభువుగారి విజయసేనలచే విదర్భరాజు ఓడింపబడినాడట అతని దాయాదుడైన మాధవసేనుడు విడిపింపబడినాడట! గొప్ప విలువగల రత్నములను వాహనము లను, శిల్పకారికలతో గూడిన పరిజనమును ఉపాయనముగా నిచ్చి, ఆ విదర్భరాజుచే ప్రభువు వద్దకు పంపబడిన దూత రేపు ప్రభువును దర్శించునట!

**మదుకరిక** పోయి నీపని చేసికొనుము నేను కూడా దేవిని దర్శింతును

(అని నిష్క్రమించును )

**(ఇది ప్రవేశకము)**

(అంతట ప్రతీహారి ప్రవేశించును )

**ప్రతీహారీ** ఆజ్ఞప్తాఽ స్మి అశోకసత్కారవ్యాపృతయా దేవ్యా ఆజ్ఞాపయ ఆర్యపుత్రం "ఇచ్ఛా మ్యార్యపుత్రేణ సహాశోకవృక్షస్య ప్రసూనలక్ష్మిం ప్రత్యక్షీకర్తుం" ఇతి త ద్యావ ద్ధర్మాసనగతం దేవం ప్రతిపాలయామి

(ఇతి పరిక్రామతి )

(నేపథ్యే వైతాలికౌ )

**వైతాలికౌ** దిష్ట్యా దండేనై వారిశిరస్సు వర్తతే దేవః

**ప్రథమః శ్లో.** పరభృతకలవ్యాహారేషు త్వ మాత్తరతి ర్మధుం
నయసి విదిశాతీరోద్యానవనే ష్వనంగ
ఇవాంగవాన్।
విజయకరిణా మాలానత్వంగతైః ప్రబలస్య తే
వరద! వరదారోధోవృక్షైః సహావనతో రిపుః॥ 1

**ద్వితీయః శ్లో** విరచితపదం వీరప్రీత్యా సురోపమః సూరిభిః
చరిత ముభయో ర్మధ్యేకృత్య స్థితం క్రథకైశికాన్।
తవ హృతవతో దండానీకై ర్విదర్భపతేః శ్రియం
పరిఘగురుభి ర్దోర్భిః విష్ణోః ప్రసహ్య చ రుక్మిణీమ్॥
2

**ప్రతీహారి** అశోకవృక్షమును సత్కరించుటయందు ఆసక్తిగొనియున్నదేవి, న న్నాదేశించినది "ఆర్యపుత్రునితో కలిసి, అశోకవృక్షపు కుసుమశోభను దర్శింపగోరుచున్నాను, అని ఆర్యపుత్రునకు మనవి చేయుము" అని కనుక ఇప్పుడు ధర్మాసనస్థుడైన ప్రభువుకొఱకు నిరీక్షింతును

(అని పరిక్రమించును )

(తెరవెనుకనుండి ఇద్దరు వైతాళికులు )

**వైతాళికులు** అదృష్టవశమున మన ప్రభువు తన దండశక్తిచేతనే శత్రువుల శిరస్సులపై నర్తించుచున్నాడు

**ప్రథముడు** కోకిలముల మధుర కూజితములుకల విదిశానగర తీరోద్యానములయందు నీవు ఆత్మరతివై (1 ఇష్టము కలవాడవై 2 రతీదేవియను భార్యతో కూడినవాడవై) రూపుదాల్చిన అనంగుని (మన్మధుని)వలె కాలమును గడుపుచున్నావు ఓ వరదుడా! విజయమాతంగములకు ఆలానములైన (ఏనుగులను కట్టుటకుపయోగించు స్తంభములు) వరదానది ఒడ్డుయందలి వృక్షములతో బాటు ప్రబలుడవైన నీ శత్రువుకూడా వంచబడినాడు) 1

**ద్వితీయుడు** సురోపముడా! విజయవాహినులచే విదర్భరాజుయొక్క రాజ్య సంపదను అపహరించిన నీ యొక్కయు, ఇనుప గుదియల వలె దృఢములైన భుజములతో బలాత్కారముగా, రుక్మిణిని హరించిన విష్ణువుయొక్కయు, చరితము వీరప్రీతిచే విద్వాంసులచే కూర్చబడిన వాక్కులు కలదై, క్రథకైశికముల నిండ (విదర్భ రాజ్యమునిండ) వ్యాపించియున్నది



**ప్రతీహారీ** ఏష జయశబ్దసూచితప్రసాధనో భర్తా ఇత ఏవ ఆగచ్ఛతి అహ మపి తావ దస్య ప్రముఖా త్క్రమ ప్యపసృత్య ఏతన్ముఖాలిందతోరణం సమాశ్రితా భవామి (ఇత్యేకాంతె స్థితా)

(తతః ప్రవిశతి సవయస్యో రాజా)

**రాజా శ్లో॥** **కారాం విచింత్య సులభేతర సంప్రయోగాం**
**శ్రుత్వా విదర్భపతి మానమితం బలైశ్చ।**
**ధారాభి రాతప ఇవాభిహతం సరోజం**
**దుఃఖాయతే మమ మనః సుఖ మశ్నుతే చ॥ 3**

**విదూషకః** యధా అహం పశ్యామి తధా ఏకాంతసుఖితో భవాన్ భవిష్యతి

**రాజా** సఖే! కధమివ?

**విదూషకః** అద్య కిల దేవ్యా ధారిణ్యా పండితకౌశికీ భణితా భగవతి త్వం యది సత్యం ప్రసాధనగర్వం వహసి తత్ దర్శయ తావత్ మాలవికాయాః శరీరే వైదర్భం వివాహనేపధ్యం ఇతి తదా చ సవిశేష కౌతూహలం అలంకృతా మాలవికా తత్ర భవతీ కదాపి పూరయేత్ భవతో మనోరధమ్

**ప్రతిహారి** ఈ జయశబ్దముచే సూచింపబడిన ప్రసాధనముగల ప్రభువు ఇటే వచ్చుచున్నాడు నేను ఇంతలో ఆయన ఎట్ట ఎదుటనుండి కొంచెము తొలగి, ఈ మొగసాల ద్వారమువద్ద నిల్చియుందును (అని ఒక పక్కగా నిలుచును)

(అంతట మిత్రునితో కలిసి, రాజు ప్రవేశించును )

**రాజు** కలియుటకు సాధ్యపడని ప్రియురాలిని గూర్చి తలంచుకొనియు, సేనలచే లొంగదీయబడిన విదర్భ రాజును గూర్చి వినియును, నా మనస్సు ఎండలో వర్షధారచే కొట్టబడిన కమలమువలె దుఃఖించుచున్నది సుఖమును కూడ అనుభవించుచున్నది 3

**విదూషకుడు** - నీవు కేవలము సుఖవంతుడవు కాగలవని నాకు తోచుచున్నది

**రాజు** సఖుడా! ఎట్లు

**విదూషకడు** "భగవతీ!! నీవు నిజముగా అలంకరణము చేయుటలో నిపుణురాలవను గర్వము కలిగినదానవైనచో, ఇప్పుడు మాళవిక శరీరముపై విదర్భదేశపు వివాహాలంకరణమును ప్రదర్శింపుము" అని దేవి నేడు పండిత కౌశికకు చెప్పినదట! అట్లే మాళవికయు విశేషరమణీయముగా అలంకరింప బడినది బహుశః దేవి ఈనాడు నీ కోర్కెను తీర్చినను తీర్చవచ్చును.

**రాజా** సఖే! మదపేక్షానువృత్త్యా నివృత్తేర్ష్యాయాః ధారిణ్యాః పూర్వచరితైః సంభావ్యత ఏవైతత్

**ప్రతీహారీ** (ఉపగమ్య) జయతు జయతు దేవః దేవీ విజ్ఞాపయతి 'తపనీయాశోకస్య కుసుమసౌభాగ్య దర్శనేన మమారంభః సఫలీక్రియతాం' ఇతి

**రాజా** నను తత్రైవ దేవీ

**ప్రతీహారీ** అథ కిమ్ యథార్హసంమానసుఖిత మంతఃపురం విసృజ్య, మాలవికాపురోగేణ ఆత్మనః పరిజనేన పండితకౌశిక్యాసమం దేవం ప్రతిపాలయతి

**రాజా** (సహర్షం, విదూషకం విలోక్య) జయసేనే! గచ్ఛాగ్రతః

**ప్రతీహారీ** ఇత ఇతో దేవః

(పరిక్రామతి )

**విదూషకః** (విలోక్య) భో వయస్య! కించి త్పరివృత్తయౌవన ఇవ వసంతః ప్రమదవనే లక్ష్యతే

**రాజా** యథాహ భవాన్

**రాజు** చెలికాడా! నా యిష్టానుసారము ప్రవర్తింపవలెనను భావముచే ఈర్ష్యను మానిన ధారిణీ పూర్వప్రవర్తనమును బట్టి ఇది సంభావనీయమే!

**ప్రతిహారి** (సమీపించి) "దేవరకు జయము జయము బంగారపు టశోకముయొక్క కుసుమసౌభాగ్యమును దర్శించుటచేత ఏలినవారు నే నారంభించిన ఈ దోహదప్రక్రియను సఫలము చేతురుగాక" అని దేవి విన్నవించుచున్నది

**రాజు** దేవి యచ్చటనే యున్నది కదా!

**ప్రతీహారి** మరియేమి? యథోచిత సమ్మానముచే అంతఃపురజనమును సంతోషపెట్టి, రాణివాసపు జనమును పంపివైచి, మాళవికా పురస్సరమైన పరిజనముతో, పండిత కౌశికితోబాటు దేవర రాకకొరకు ఎదురుచూచుచున్నది

**రాజు** (సహర్షముగా, విదూషకునిచూచి) జయసేనా! ముందు నడువుము

ఏలినవారు ఇటు, ఇటు

(పరిక్రమించును )

**విదూషకుడు** (చూచి) ఓయి మిత్రమా! ఈ ప్రపంచమున వసంతుడు కొంచెము వయసుమీరినట్లు కనబడుచున్నాడు

**రాజు** నీ వన్నట్లే

శ్లో అగ్రే వికీర్ణ కురవకఫలజాల విభిద్యమాన
సహకారమ్।
పరిణామాభిముఖ మృతో రుత్సుకయంతి
యౌవనం చేత॥ 4

**విదూషకః** (పరిక్రమ్య) భోః అయం దత్తనేపథ్య ఇవ కుసుమస్తబకై స్తపనీయాశోకః అవలోకయతు భవాన్.

**రాజా** స్థానే ఖలు ప్రసవమంధరో ఽ భూత్ యదయమిదానీం అనన్యసాధారణీం శోభాం పుష్యతి పశ్య

శ్లో సర్వాశోకలతానాం ప్రథమం సూచిత వసంత
విభవానామ్।
నిర్వృత్త దోహదే ఽస్మిన్ సంక్రాన్తానీవ
ముకులాని॥ 5

**విదూషకః** భోః విస్రబ్ధో భవ అస్మాసు సన్నిహితేష్వపి ధారిణీ పార్శ్వపరివర్తికాం మాలవికాం అనుమన్యతే

ఎదుట విరజిమ్మబడిన కురవకఫలజాలములతో కలిసిన సహకారములు కలదై, పరిణామాభిముఖమగుచున్న (పంటకు వచ్చుచున్న) ఋతువుయొక్క యౌవనము నా చిత్తమును ఉత్సుకము గావించుచున్నది 4

**విదూషకుడు** (పరిక్రమించి) ఓయీ! ఈబంగారపుటశోకము పూలగుత్తులచే అలంకరింపబడిన దానివలె నున్నది నీవు తప్పక దీనిని చూతువుగాక

**రాజు** ఇది పూలను పూయుటలో చేసిన విలంబము యుక్తమే! ఏలయన ఇప్పుడిది దేనికిని లేని శోభను దాల్చినది చూడు

సర్వాశోకలతలకు ఇంతకు పూర్వమే వసంతుని విభవమువలన పూసిన మొగ్గలన్నియు, దోహదము నిర్వర్తింపబడిన ఈ వృక్షమునందే(ఇప్పుడు) సంక్రమించినవా? అన్నట్లున్నది 5

**విదూషకుడు** ఓయీ! నిబ్బరముగా నుండుము మనము సన్నిహితులమై యున్నను ధారిణీదేవి మాళవికను ప్రక్కనే యుండనిచ్చినది (రాజుకంట పడకుండ ధారిణీదేవి మాలవికను ఎన్నాళ్ళు రక్షించినది. నాయికా, నాయకుల కలయికకు గౌతముడే కారకుడని తెలిసిన ధారిణికి గౌతమునిపై కోపము కలదు ఇప్పుడా ఇరువురును కలిసి, తన వద్దకు వచ్చుచున్నను ధారిణి మాళవికను దాచక ప్రక్కనే ఉంచుకొనుట నాయికా నాయక భావసమాగమమునకు శుభసూచకము అని రాజు భావించెను )

**రాజా** (సహర్షం) పశ్య, పశ్య, సఖే!

**శ్లో** **మా మియ మభ్యుత్తిష్ఠతి దేవీ వినయా దనూత్థితా ప్రియయా।**
**విస్మృతహస్తకమలయా నరేంద్రలక్ష్మ్యా వసుమతీవ॥ 6**

(తతః ప్రవిశతి ధారిణీ, మాలవికా, పరివ్రాజికా, విభవతశ్చ పరివారః )

**మాలవికా** (ఆత్మగతం) జానామి నిమిత్తం మమ కౌతుకాలంకారస్య తథాపి మే హృదయం బిసినీపత్రగతమివ సలిలం వేపతే అపి చ దక్షిణేతరదపి మే నయనం బహుశః స్ఫురతి

**విదూషకః** భో వయస్య! వివాహనేపథ్యేన సవిశేషం ఖలు శోభతే ఽ త్రభవతీ మాలవికా

**రాజా** పశ్యా మ్యేనామ్ ఏషా

**శ్లో** **అనతిలంబి దుకూలనివాసినీ**
**లఘుభి రాభరణైః ప్రతిభాతి మే।**
**ఉడుగణై రుదయోన్ముఖచంద్రికా**
**గతహిమై రివ చైత్రవిభావరీ॥ 7**

**ధారిణీ** (ఉపేత్య) జయతు జయతు ఆర్యపుత్రః

**విదూషకః** వర్ధతాం భవతీ

**రాజు** (సంతోషముగా) మిత్రమా! చూడు చూడు

వినయమువలన తన వెంటనే లేచిన, ప్రియురాలితో (మాళవికతో) కలిసి, ఈ దేవి, హస్తకమలమును మరిచిన, వసుమతీదేవివలె రాజ్యలక్ష్మి లేచి, నాకు ఎదురువచ్చుచున్నది 6

(అంతట, ధారిణియును, మాళవికయును, పరివ్రాజిక యును, విభవముకొలది పరిజనమును ప్రవేశింతురు )

**మాళవిక** (తనలో) నా కౌతుకాలంకారమునకు కారణము నెఱుగుదును అట్లయినను నా హృదయము తామరాకుమీది నీటిబొట్టువలె కంపించుచున్నది మరియు నా ఎడమ కన్ను మాటి మాటికి అదురుచున్నది

**విదూషకుడు** ఓ చెలికాడా! వివాహవేషముచెత పూజ్యురాలు మాలవిక విశేషముగా శోభించుచున్నది

**రాజు** చూచుచున్నాను ఈమె

ఎక్కువ వదులుకాని పట్టుబట్టను ధరించి, కొలదియైన అలంకారములతో వెన్నెల ఉదయించుచున్నట్లు కనబడుచు, మంచు తొలగిన తరువాత తారాగణములతో కూడిన చైత్రమాసపు రాత్రివలె ఈమె నాకు తోచుచున్నది 7

**దారిణి** (సమీపించి) ఆర్య పుత్రునకు జయము జయము

**విదూషకుడు** దేవి వర్ధిల్లుగాక!

**పరివ్రాజికా** విజయతాం దేవః

**రాజా** భగవతి! అభివాదయే

**పరివ్రాజికా** అభిప్రేత సిద్ధి రస్తు

**దారిణీ** (సస్మితం) ఆర్యపుత్ర! ఏష తే ऽ స్మాభిః తరుణీజనసహాయు స్యాశోకః సంకేతగృహకః సంకల్పితః

**విదూషకః** భోః ఆరాధితో ऽ సి

**రాజా** (సవ్రీడ మశోక మభితః పరిక్రామ్యన్)

**శ్లో**
**నాయం దేవ్యా భాజనత్వం న నేయః**
**సత్కారాణా మీదృశానా మశోకః।**
**యః సావజ్ఞో మాధవశ్రీనియోగే**
**పుష్పైః శంస త్యాదరం త్వత్ప్రయత్నే.॥ 8**

**విదూషకః** భో విస్రబ్ధో భూత్వా యౌవనవతీ మిమాం ప్రేక్షస్వ

**ధారిణీ** కామ్?

**విదూషకః** తపనీయాశోకస్య కుసుమశోభామ్

(సర్వే ఉపవిశన్తి )

పరివ్రాజిక ఏలినవారికి జయము

రాజు భగవతీ! నమస్కారము

పరివ్రాజిక అభీష్టసిద్ధి యగుగాక

దారిణి (చిఱునవ్వుతో) ఆర్యపుత్రుడా! తరుణీ జనసహాయకుడవైన నీకు ఈ అశోకవృక్షము సంకేతగృహముగా (ఇష్టులను కలిసికొనుటకు గుర్తుగా నిర్ణయించిన గృహము) మాచే కల్పింపబడినది

విదూషకుడు ఓయీ! సమ్మానింపబడిన వాడవైతివి!

(సిగ్గుతో అశోకము చుట్టును తిరుగుచు)

ఏ అశోకవృక్షము పూర్వము వసంతవైభవసంయోగమున కూడా పూలును పూయుటకు తిరస్కరించి, నేడు నీ దోహదక్రియ అను ప్రయత్నముచేత, ప్రేమతో పూసినపూలతో నీ మీది గౌరవమును ప్రకటించుచున్నదో, ఆ అశోకవృక్షము దేవిచే ఇట్టి సత్కారమును పొందుట కర్హము కాదనరాదు 8

విదూషకుడు ఓయీ నిర్భయుడవై ఈ యౌవనవతిని (1 అశోకమును 2 మాలవికను) తిలకింపుము

ధారిణి ఏ యౌవనవతిని?

విదూషకః తపనీయాశోకముయొక్క కుసుమశోభను

(అందరు కూర్చుందురు )

**రాజా** (మాలవికాం విలోక్య ఆత్మగతం) కష్టః ఖలు సన్నిధివిప్రయోగః

**శ్లో** **అహం రథాంగనామేవ ప్రియా సహచరీ మే।**
**అననుజ్ఞాతసంపర్కా ధారిణీ రజనీవ నౌ॥ 9**

(ప్రవిశ్య)

**కఞ్చుకీ** జయతు జయతు దేవః అమాత్యో విజ్ఞాపయతి "తస్మి న్విదర్భరాజోపాయనే ద్వే శిల్పకారికే మార్గపరిశ్రమా దలసశరీరే ఇతి పూర్వం న ప్రవేశితే సంప్రతి దెవోపస్థాన యోగ్యే తదాజ్ఞాం దేవో దాతు మర్హతి" ఇతి

**రాజా** ప్రవేశయ తే

**కఞ్చుకీ** య దాజ్ఞాపయతి దేవః (ఇతి నిష్క్రమ్య తాభ్యాం సహ పునః ప్రవిశ్య) ఇత ఇతో భవత్యౌ

**ప్రథమా** (జనాన్తికం) హలా రజనికే। అపూర్వ మప్యేతత్ రాజకులం ప్రవిశంత్యా వేం ప్రసీదతి హృద యాభ్యంతరగత ఆత్మా

**ద్వితీయా** జ్యోత్స్నికే। మమా ప్యేవమేవ అస్తి ఖలు లోకప్రవాద "ఆగామి సుఖం వా దుఃఖం వా హృదయసమవస్థా కథయతి" ఇతి

**రాజు** (మాళవికను చూచి, తనలో) (ఈ సన్నిధివియోగము కష్టముకదా!

నేను చక్రవాకమువలె నున్నాను ప్రియురాలు నా సహచరి (చక్రవాకి) వలె నున్నది మా ఇరువురి సంయోగము ననుమతింపనిదై ధారిణి రాత్రివలె నున్నది 9

(ప్రవేశించి)

**కంచుకి** "దేవరకు జయము జయము విదర్భరాజు పంపిన ఆ కానుకలో ఇద్దరు శిల్పకారులు మార్గాయాసమువలన బడలికచెంది, ఇదివరకు తమ సన్నిధికి ప్రవేశపెట్టబడలేదు ఇప్పుడు వారు దేవరను సేవించుటకు తగియున్నారు కనుక ఏలినవారు అనుజ్ఞ నిప్పింపగలరు" అని అమాత్యుడు విన్నవించుచున్నాడు

**రాజు** వారిరువురను ప్రవేశపెట్టుము

**కంచుకి** దేవర, ఆజ్ఞాపించినట్లే (అని నిష్క్రమించి, ఆ ఇరువురితోగూడి, మరల ప్రవేశించి,) ఇటు ఇటు మీరు

**ప్రదమ** (జనాంతికముగా) ఓసీ రజనికా! అపరిచితమైనప్పటికిని ఈ రాచనగరులోనికి ప్రవేశింపగనే నా అంతరాత్మ ప్రసన్న మగుచున్నది

**ద్వితీయ** జ్యోత్స్నికా! నాకును అట్లే యున్నది "రాగల సుఖమును గాని దుఃఖమునుగాని, హృదయావస్థ సూచించును" అను ఆర్యోక్తి ఉన్నదే కదా!

**ప్రథమా** స సత్య ఇదానీం భవతు

**కఞ్చుకీ** ఏష దేవ్యాసహ దేవ స్తిష్ఠతి ఉపసర్పేతాం భవత్యౌ

(ఉభే ఉపసర్పతః మాలవికా పరివ్రాజికా చ చేట్యౌ దృష్ట్వా, పరస్పర మవలోకయతః)

**ఉబే** (ప్రణిపత్య) జయతు జయతు భర్తా జయతు జయతు. భట్టినీ

**రాజా** స్వాగతం! ఇతో నిషీదతమ్

(ఉభే ఉపవిష్టే)

**రాజా** కస్యాం కలాయా మభివినీతే భవత్యౌ?

**ఉబే** భర్తః! సంగీతే అభ్యంతరే స్వః

**రాజా** దేవి! గృహ్యేతా మనయో రన్యతరా

**దారిణీ** మాలవికే! ఇతః పశ్య, కతరా తే సంగీత సహాయినీ రోచతే

**ఉబే** (మాలవికాం దృష్ట్వా) అహో! భర్తృదారికా! జయతు జయతు భర్తృదారికా (ఇతి ప్రణిపత్య తయాసహ బాష్పం విసృజతః సర్వే సవిస్మయం విలోకయన్తి)

**రాజా** కే భవత్యౌ కా వేయమ్?

**ప్రథమా** భర్తః! ఏషా అస్మాకం భర్తృదారికా

**రాజా** కథ మివ?

**ప్రథమ** అది ఇప్పుడు యథార్థ మగుసుగాక!

**కంచుకి** ఇదుగో ప్రభువు! దెవితో కలిసియున్నాడు మీరిరువురు సమీపింపుడు

(ఇరువురు రాజును సమీపింతురు, మాళవికయును, పరివ్రాజికయును, చేటులను చూచి, ఒకరిమొగమును నొకరు చూచుకొందురు.)

**ఇరువురును** (ప్రణమిల్లి) జయము, జయము ప్రభువులకు జయము జయము భట్టినికి

**రాజు** స్వాగతము ఇటు కూర్చొనుడు

(ఇరువురును కూర్చుందురు )

**రాజు** మీరిరువురు ఏ కళను నేర్చినవారు?

**ఉభయులు** ప్రభూ! సంగీతమున ప్రవేశము కలవారము

**రాజు** దేవీ! ఈ ఇరువురిలో నొకరిని తీసికొనుము

**దారిణి** మాళవికా! ఇటు చూడుము వీరిలో ఎవ్వతె నీకు సంగీత సహాయినిగా నచ్చినది?

**ఉభయులు** (మాళవికను చూచి) ఓహో! రాజకుమారి! జయము జయము రాజకుమారికి! (అని నమస్కరించి, ఆమెతోబాటు కన్నీరు విడుతురు అందరు ఆశ్చర్యముతో చూతురు )

**రాజు** మీ రిద్దరు ఎవ్వరు మరి ఈమె ఎవ్వతె?

**ప్రదమ** ప్రభూ! ఈమె మా రాజకుమారి

**రాజు** అది యెట్లు?

**ఉబే** శృణోతు బర్తా యః స బర్త్రా విజయదండైః విదర్భనాథం వశీకృత్య, బంధనా న్మోచితః కుమారో మాధవసెనో నామ, తస్యేయం కనీయసీ భగినీ మాలవికా నామ

**దారిణీ** కధం రాజదారికేయమ్? చందనం ఖలు మయా పాదుకాపదేశేన దూషితమ్

**రాజా** అధాత్ర భవతీ కధ మిత్థం బూతా

**మాలవికా** (నిఃశ్వ స్యాత్మగతం) విధినియోగేన!

**ద్వితీయా** శృణొతు బర్తా దాయాదవశంగతే అస్మాకం బర్తృదారకే మాధవసేనే తస్యామాత్యే నార్యసుమతినా అస్మాదృశ పరిజన ముజ్ఝిత్వా గూఢ ముపనీతైషా

**రాజా** శ్రుతపూర్వం మయైతావత్, తత స్తతః?

**ద్వితీయా** భర్తః! అతఃపరం న జానీమః

**పరివ్రాజికా** అతఃపర మహం మందభాగినీ కధయిష్యామి

**ఉబే** భర్తృదారికే! ఆర్యకౌశిక్యా ఇవ స్వరసంయోగః

**మాలవికా** నను సైవ

**ఉబే** యతివేషధారిణీ ఆర్యకౌశికీ దుఃఖేన విభావ్యతే భగవతి నమ స్తే

**ఉభయులు** ప్రభువులు చిత్తగింపవలెను విజయసేనలచే విదర్భరాజును వశపఱచుకొని, యువరాజు మాధవసేనుడు ప్రభువుచే విడిపింప బడినాడు కదా! ఈమె ఆ మాధవసేనుని చెల్లెలు మాళవిక!

**దారిణి** ఎట్లూ? ఈమె రాజకుమార్తెయా? చందనమును పాదుకగా ఉపయోగించి, అవమానించితిని

**రాజు** మరి ఈమె ఏల ఇట్లయినది?

**మాళవిక** (నిట్టూర్చి, తనలో) విధినియోగముచేత

**ద్వితీయ** ప్రభువులు చిత్తగింపవలెను మాధవసేనుడు దాయాదులకు వశపడగా, ఆయన ఆమాత్యుడగు సుమతి, మావంటి పరిజనమును విడిచి పెట్టి, ఈమెను మాత్రము రహస్యముగా తీసికొని పోయెను

**రాజు** ఇంతవరకు వృత్తాంతమును మేమును పూర్వము వింటిమి తరువాత? తరువాత?

**ద్వితీయ** అటుపైన మాకు తెలియదు

**పరివ్రాజిక** ఆపై (కథను) మందభాగినియైన నేను చెప్పెదను

**ఇరువురు** రాజపుత్రీ! ఆర్యకౌశికియొక్క కంఠస్వరమువల్లెనున్నదే

**మాళవిక** అవును ఆమెయే కదా!

**ఇరువురు** యతివేషమును ధరించిన ఆర్యకౌశికి గుర్తింపశక్యము కాకున్నది భగవతీ! నమస్కారము

**పరివ్రాజికా** స్వస్తి భవతీభ్యామ్

**రాజా** కధ మాప్తవర్గోఽయం భగవత్యాః?

**పరివ్రాజికా** ఏవ మేతత్।

**విదూషకః** తేన హి కధయతు ఇదానీం భగవతీ అత్రభవత్యాః వృత్తాంత శేషమ్

**పరివ్రాజికా** (సవైక్లబ్యం) శ్రూయతాం తావత్ మాధవసేనసచివం సుమతిం మమాగ్రజ మవగచ్ఛ

**రాజా** ఉపలబ్ధమ్ తత స్తతః?

**పరివ్రాజికా** స ఇమాం తధా గతభ్రాతృకాం మయా సార్ధ మపవాహ్య భవత్సంబంధాపేక్షయా పధికసార్ధం విదిశాగామిన మనుప్రవిష్టః

**రాజా** తత స్తతః?

**పరివ్రాజికా** స చ అటవ్యంతరే నివిష్టా గతాధ్వా వణిగ్గణః విశ్రమితు మారబ్ధః

**రాజా** తత స్తతః?

**పరివ్రాజికా** తతశ్చ

**శ్లో.** **తూణీరపట్ట పరిణద్ధభుజాంతరాళ**
**మాపార్ష్ణిలంబి శిఖిబర్హకలాపధారి।**
**కోదండపాణి నినదత్ప్రతిరోధకానా**
**మాపాతదుష్ప్రసహ మావిరభూ దనీకమ్॥** 10

పరివ్రాజిక మీ ఉభయులకు మేలు కలుగుగాక

రాజు ఏమీ! భగవతికి మీరు ఆప్తవర్గమా?

పరివ్రాజిక అవునట్లే!

విదూషకుడు అట్లయినచో ఈ పూజ్యురాలి యొక్క తదుపరికధను భగవతి చెప్పునుగాక!

పరివ్రాజిక (దిగులుతో) ఇంక వినుడు, మాధవసేనుని మంత్రియగు సుమతి నా అన్న అని తెలిసికొనుము

రాజు - తెలిసినది తరువాత, తరువాత?

పరివ్రాజిక నా సోదరుడు, ఈ విధముగా రక్షకుడు లేని ఈమెను నాతోపాటు తీసికొనిపోయి, మీతోడి సంబంధమును కోరుకొనుచు విదిశా నగరమునకు బయలుదేరుచున్న వర్తకులగుంపులో చేరినాడు

రాజు తరువాత తరువాత?

పరివ్రాజిక - ఆ వర్తకులగుంపు అడవిలోనికి ప్రవేశించి, చాలా దూరము నడచి, విశ్రమింపనారంభించినది

రాజు - తరువాత, తరువాత?

పరివ్రాజిక - మరి ఆ తరువాత

తూణీరముయొక్క (అమ్ములపాదియొక్క) పట్టములతో విశాలములైన వక్షః స్థలములు కలిగిన, మడమలవరకు వేలాడు నెమలిపింఛపు అలంకారమును ధరించిన, విల్లులను చేబట్టిన, బందిపోటుదొంగల గుంపు పెద్ద పెట్టున అరుచుచు

(మాలవికా భయం రూపయతి )

**విదూషకః** భవతి! మా భిభేహి అతిక్రాంతం ఖలు భగవతీ కథయతి

**రాజా** తత స్తతః?

**పరివ్రాజికా** తతో ముహూర్తబద్ధయుద్ధా స్తే పరాఙ్ముఖీకృతాః సార్థవాహయోద్ధార స్తస్కరైః

**రాజా** భగవతి! అతః కష్టతర మిదానీం శ్రోతవ్యమ్

**పరివ్రాజికా** తతః స మ త్సోదరః

**శ్లో** **ఇమాం పరీప్సుః దుర్జాతేః పరాభిభవకాతరామ్।**
**భర్తృప్రియః ప్రియైః భర్తు రానృణ్య మసుభిః గతః॥ 11**

**ప్రథమా** హా హతః సుమతిః?

**ద్వితీయా** అతః ఖలు భర్తృదారికాయా ఇయం సమవస్థా సంవృత్తా

(పరివ్రాజికా బాష్పం విసృజతి )

**రాజా** భగవతి! తనుభృతా మీదృశీ లోకయాత్రా న శోచ్యః తత్రభవాన్ సఫలీకృత భర్తృపిండః తత స్తతః?

సహింపరాని పరాక్రమముతో మాకు ప్రత్యక్ష మయ్యెను 10

(మాళవిక, భయమును అభినయించును )

**విదూషకుడు** అమ్మా! భయపడకుము జరిగిపోయిన కధను కదా భగవతి చెప్పుచున్నది

**రాజు** తరువాత, తరువాత?

**పరివ్రాజిక** అ తరువాత క్షణకాలము నిలిచి పోరాడిన, ఆ వ్యాపారయోధులను దొంగలు పారద్రోలిరి

**రాజు** భగవతీ! ఇప్పుడు వినవలసినది ఇంతకంటెను కష్టతరము

**పరివ్రాజిక** అప్పుడు నా సోదరుడు

శత్రువుల పరాభవముచే భయపడిన ఈమెను ఆ దుష్టులనుండి రక్షింపగోరి ప్రభుభక్తుడై, తన ప్రియములైన ప్రాణములతో మా అన్న ప్రభువుయొక్క ఋణమును తీర్చుకొనెను (మరణించెను) 11

**ప్రధమ** అయ్యో! సుమతి చంపబడెనా?

**ద్వితీయ** అందువలనే కదా రాజుకుమారి యిట్టి దురవస్థకు పాలయినది

(పరివ్రాజిక కన్నీరు విడుచును )

**రాజు** భగవతీ! దేహధారుల జీవితయాత్ర యిట్లే యుండును ప్రభువు పెట్టిన తిండిని సఫలముగావించినవానికై దుఃఖింపతగదు

**పరివ్రాజికా** తతో ఽ హం మోహ ముపాగతా యావత్ సంజ్ఞాం ప్రతిలభే తావ దియం దుర్లభదర్శనా సంవృత్తా

**రాజా** మహ త్ఖలు కృచ్ఛ్ర మనుభూతం భగవత్యా

**పరివ్రాజికా** తతో భ్రాతుః శరీర మగ్నిసాత్కృత్య పున ర్నవీకృత వైధవ్య దుఃఖయా మయా త్వదీయం దేశ మవతార్య ఇమే కాషాయే గృహీతే

**రాజా** యుక్తం సజ్జన స్యైష పంథాః తత స్తతః?

**పరివ్రాజికా** తతః సేయ మాటవికేభ్యో వీరసేనం, వీరసేనాచ్చ దేవీం గతా దేవీగృహే లబ్ధప్రవేశయా మయా చానంతరం దృష్టే త్యే తదవసానం కథాయాః

**మాలవికా** (ఆత్మగతం) కిం ను ఖలు భర్తా సాంప్రతం భణతి

**రాజా** అహో పరిభవోపహారిణో వినిపాతాః కుతః

**శ్లో.** **ప్రేష్యభావేన నామేయం దేవీశబ్దక్షమా సతీ।**
**స్నానీయవస్త్రక్రియయా పత్రోర్ణం వోపయుజ్యతే॥ 12**

**ధారిణీ** భగవతి! త్వయాభిజనవతీం మాలవికా మనాచక్షాణయా అసాంప్రతం కృతమ్

తరువాత తరువాత?

**పరివ్రాజిక** తరువాత నేను కూడ మూర్ఛపోయి తెలివివచ్చుసరికి ఈమె (మాళవిక) నాకు కనబడలేదు

**రాజు** భగవతి గొప్ప కష్టములను అనుభవించినది కదా,

**పరివ్రాజిక** ఆ తరువాత సొదరుని శరీరమునకు అగ్నిసంస్కారమును చేసి, మరల వైధవ్యదుఃఖమును పొందినట్లై నేను తమ దేశములోనికి ప్రవేశించి, ఈ కాషాయములను ధరించితిని

**రాజు** యుక్తమే సజ్జనులయొక్క మార్గ మిదే తరువాత తరువాత?

**పరివ్రాజిక** తరువాత ఈ మాళవిక అడవిదొంగలనుండి వీరసేనుని, వీరసేనునినుండి దేవివద్దకు చేరినది. దేవిఇంట ప్రవేశము లబించిన నేను, ఆ తరువాత ఈమెను చూచితిని, ఇది ఈ కథయొక్క పర్యవసానము

**మాళవిక** (తనలో) ప్రభువు ఇప్పుడు ఏమని పలుకునో కదా!

**రాజు** అహో! ఆపదలు పరాభవములను తెచ్చిపెట్టును ఏలయన

దేవీశబ్దమునకు యోగ్యురాలైన ఈమె, స్నానముచేయుటకై కట్టుకొనబడిన కట్టుబట్టవలె పరిచారికాభావమున ఉపయోగింప బడుచున్నది 12

**ధారిణి** భగవతీ! మాళవిక అభిజాత్యముకలదని నీవు నాకు చెప్పకుండుట సరియగు పనికాదు నీవు చేసిన యీ పని మంచిది కాదు

**పరివ్రాజికా** శాంతం పాపం, శాంతం పాపమ్ కారణేన ఖలు మయా నైభృత్య మవలంబితమ్

**ధారిణీ** కి మివ తత్కారణమ్?

**రాజా** యది వక్తవ్యం కథ్యతామ్,

**పరివ్రాజికా** శ్రూయతాం ఇయం పితరి జీవతి కేనాపి దేవయాత్రా ౭౭ గతేన సిద్ధాదేశేన సాధునా మత్సమక్షం సమాదిష్టా సంవత్సరమాత్ర మియం ప్రేష్యభావ మనుభూయ, తతః సదృశభర్తృగామినీ భవిష్యతీతి త మేన మవశ్యమ్భావిన మాదేశ మస్యాః త్వత్పాద శుశ్రూషయా పరిణమంత మవేక్ష్య, కాలప్రతీక్షయా మయా సాధు కృత మితి పశ్యామి

**రాజా** యుక్తోపేక్షా

(ప్రవిశ్య)

**కంచుకీ** దేవ! కథాంతరేణాంతరిత మిద మమాత్యో విజ్ఞాపయతి విదర్భగత మనుష్ఠేయ మవధారిత మస్మాభిః దేవస్య తావ దభిప్రేతం శ్రోతు మిచ్ఛామీతి

**పరివ్రాజిక** పాపము శమించుగాక నేను ఈ విషయమును దాచి ఉంచుటకు ఒక కారణ మున్నది

**దారిణి** ఏమిటో ఆకారణము?

**రాజు** చెప్పదగిన దైనచో చెప్పుము

**పరివ్రాజిక** వినుడు, ఈమె తండ్రి జీవించియుండగ తీర్థయాత్రలు చేయుచు ఒక సిద్ధవచనుడు వీరి ఇంటికి వచ్చినాడు నా సమక్షమునందే ఈమెను గూర్చి ఇట్లు చెప్పినాడు "ఒక్క సంవత్సరకాలము ఈమె పరిచారికాభావమును అనుభవించి అనంతరము అనురూపుడైన భర్తను పొందగలదు అని చెప్పెను, తప్పని సరిగ జరిగి తీరవలసిన ఆ సిద్ధుని ఆదేశము ఈమెకు తమపాదసేవయందు ఇట్లుపూర్తి అయినది (అనురూపుడైన భర్త దొరుకుటకు) తగిన సమయము కొరకు ఎదురుచూచుచు నేను మంచి పనినే చేసితినను కొనుచున్నాను

**రాజు** - (భగవతీ) నీవు చెప్పక ఊరుకొనుట తగిన పనియే

(ప్రవేశించి)

**కంచుకి** దేవా! ఇంకొక విషయమును పరిశీలించుచు మరుగునపడిన యీ విషయమును అమాత్యుడు ఇప్పుడు నీకు ఇట్లు విన్నవించుచున్నాడు "విదర్భదేశవు విషయమున చేయదగినదానిని, నేను నిశ్చయించితిని ఇప్పుడు దే.. అభిప్రాయమును వినగోరుచున్నాను" అని

**రాజా** మౌద్గల్య! తత్ర భవతో ర్భ్రాత్రోః యజ్ఞసేన మాధవసేనయోః ద్వైరాజ్య మిదానీ మవస్థాపయితుకామో ఽస్మి

**శ్లో** **తౌ పృథ గ్వరదా కూలే శిష్టా ముత్తర దక్షిణే।**
**నక్తం దివం విభజ్యోభౌ శీతోష్ణకిరణా వివ॥ 13**

**కఞ్చుకీ** దేవ! ఏవ మమాత్యపరిషదే విజ్ఞాపయామి (రాజా అంగుల్యా అనుమన్యతే నిష్క్రాన్తః కఞ్చుకీ)

**ప్రథమా** (జనాంతికం) భర్తృదారికే! దిష్ట్యా బర్తృదారకో ఽర్ధ రాజ్యే ప్రతిష్ఠాం గమిష్యతి

**మాలవికా** ఏత త్తావ దృహుమన్తవ్యమ్ యజ్జీవితసంశయా ద్విముక్తః

**కఞ్చుకీ** (పునః ప్రవిశ్య) విజయతాం దేవః అమాత్యో విజ్ఞాపయతి అహో కల్యాణీ దేవస్య బుద్ధిః మంత్రిపరిషదో ప్యేతదేవ దర్శనమ్ కుతః

**శ్లో** **ద్విధా విభక్తాం శ్రియ ముద్వహంతౌ**
**ధురం రథాశ్వావివ సంగ్రహీతుః।**
**తౌ స్థాస్యత స్తే నృపతే ర్నిదేశే**
**పరస్పరోపగ్రహ నిర్వికారౌ॥ 14**

**రాజు** మౌద్గల్యుడా! సోదరులగు ఆయజ్ఞసేన, మాధవసెనులకు ద్వైరాజ్యమును (రాజ్యమును రెండుభాగములుగా విభజించి, దాయాదులకు చెరునగమును ఇచ్చుట) స్థాపింప గోరుచున్నాము

ఆయజ్ఞసేన, మాధవసేనులు ఇద్దరును వరదా నదియొక్క ఉత్తర దక్షిణ తీరములను వేర్వేరుగా సూర్యచంద్రులు ఇరువురునూ రాత్రింబవళ్లనువలె పంచుకొని, శాశింతురుగాక **13**

**కంచుకి** దేవా! ఇట్లని మంత్రిపరిషత్తునకు విన్నవింతును (రాజు తన వ్రేలితో అనుమతింపగా, కంచుకి నిష్క్రమించును)

**ప్రథమ** (జనాంతికముగా) రాజకుమారీ! అదృష్టవశమున రాజకుమారుడు అర్థరాజ్యమున ప్రతిష్ఠింపబడనున్నాడు

**మాళవిక** జీవితశంకనుండి బయటపడినాడు అనుటయే గొప్ప లాభము అనుకొనవలసియున్నది

**కంచుకి .-** (మరల ప్రవేశించి) ఏలినవారికి జయమగుగాక! "దేవరయొక్క బుద్ధి ఎంతయో శుభప్రదముగా ఉన్నది మంత్రి పరిషత్తుయొక్క దృష్టి కూడ అట్లేయున్నది" అని అమాత్యుడు విన్నవించుచున్నాడు ఏలయన

ఆ యజ్ఞసేన, మాధవసేనులు అను ఇరువురును విభజింపబడిన రాజ్యసంపదను వేరు వేరుగా వహించుచు (రథభారమును వహించు అశ్వములు రెండును సారథి ఆజ్ఞకులోబడి ఉండునట్లు,) స్వామివైన మీ ఆజ్ఞకు లోబడి పరస్పర,

**రాజా** తేన హి మంత్రిపరిషదం బ్రూహి సేనాన్యే వీరసేనాయ లిఖ్యతామ్ ఏవం క్రియతామ్" ఇతి

**కఞ్చుకీ** య దాజ్ఞాపయతి దేవః (ఇతి నిష్క్రమ్య, సప్రాభృతకం లేఖం గృహీత్వా, పునః ప్రవిశ్య) అనుష్ఠితా ప్రబో రాజ్ఞా అయం దెవస్య సేనాపతెః పుష్యమిత్రస్య సకాశాత్ సప్రాబృతకో లేఖఃప్రాప్తః ప్రత్యక్షికరొ త్వేనం దేవః

**రాజా** (సహసోత్థాయ ప్రాభృతకం సోపచారం పరిగృహ్యా శిరసికృత్వా పరిజనాయార్పయతి లేఖం చ నాట్యే నోద్వేష్టయతి )

**ధారిణీ** (ఆత్మగతం) అహహ తన్ముఖమేవ నో హృదయమ్ శ్రోష్యామి తావ ద్గురుజనకుశలాన్తరం వసుమిత్రస్య వృత్తాంతమ్ అతిభారే ఖలు సేనాపతినా నియుక్తః మే పుత్రకః

**రాజా** (ఉపవిశ్య వాచయతి ) స్వస్తి యజ్ఞశరణాత్ సేనాపతిః పుష్యమిత్రో వైదిశస్థం పుత్ర మాయుష్మంతం అగ్నిమిత్రం స్నేహా త్పరిష్వజ్య అనుదర్శయతి విదిత మస్తు యో ఽ సౌ రాజసూయ దీక్షితేన మయా రాజపుత్రపరివృతం

కలహామును మాని, శాంతులై ఇక ఉండగలరు 14

**రాజు** అట్లయినచో "ఈ విధముగానే చేయవలెనని మన సేనానిఅయిన వీరసేనునికి వ్రాయుము" అని మంత్రి మండలికి ఇట్లు చెప్పుము

**కంచుకి** ఏలినవారు ఆజ్ఞాపించినట్లే (అని నిష్క్రమించి, కానుకతో లేఖను తీసికొని, మరల ప్రవేశించి) ప్రభువుయొక్క ఆజ్ఞ అనుష్ఠింప బడినది, మరి ఇదుగో ప్రభువగు, సేనాపతియైన, పుష్యమిత్రుని దగ్గరనుండి కానుకతో ఈ లేఖ వచ్చినది దేవర దీనిని పరికింతురు గాక

**రాజు** తటాలున లేచి, సగౌరవముగా కానుకను గ్రహించి, శిరస్సున దాల్చి, పరిజనముకు అర్పించును లేఖను విప్పునట్లు నటించును

**దారిణి** (తనలో) అహో! నా హృదయము లేఖపైని లగ్నమగుచున్నది ఇంక పెద్దల కుశలము తరువాత వసుమిత్రుని వృత్తాంతమును విందును సేనాపతిచే మిగుల భారమైన కార్యమున, నా పుత్రుడు (వసుమిత్రుడు) నియమింపబడినాడు కదా!

**రాజు** (కూర్చుండి చదువును) స్వస్తి యజ్ఞవాటమునుండి సేనాపతి పుష్యమిత్రుడు వైదిశమందున్న (విదిశానగరముననున్న) కుమారుడును, ఆయుష్మంతుడును, అగు అగ్నిమిత్రుని ప్రేమతో కౌగిలించి, శాశించునది రాజసూయయాగ దీక్షితుడనయిన నేను, రాజపుత్రపరివృతుడయిన వసుమిత్రుని అశ్వరక్షకునిగా

వసుమిత్రం గోప్తార మాదిశ్య సంవత్సరోపావర్తనీయో నిరర్గల స్తురగో విసృష్టః, స సింధోర్దక్షిణే రోధసి చర న్నశ్వానీకేన యవనానాం నిషిద్ధః. తత ఉభయోః సేనయో ర్మహా నాసీత్ సంమర్దః.

(ధారిణీ విషాదం రూపయతి.)

**రాజా** - కథ మీదృశం సంవృత్తమ్?

(శేషం పున ర్వాచయతి.)

**శ్లో** - **తతః పరా న్పరాజిత్య వసుమిత్రేణ ధన్వినా।**
**ప్రసహ్య హ్రియమాణో మే వాజిరాజో నివర్తితః॥15**

**ధారిణీ**:- అనేనా శ్వాసితం మే హృదయమ్.

**రాజా** - (లేఖశేషం వాచయతి) సో ఽహ మిదానీ మంశుమతేవ సగరః పౌత్రేణ ప్రత్యాహృతాశ్వో యక్ష్యే. త దిదానీం అకాలహీనం, విగతదోషచేతసా భవతా వధూజనేన సహ యజ్ఞసందర్శనాయ ఆగంతవ్య మితి.

**రాజా** - అనుగృహీతో ఽ స్మి.

**పరివ్రాజికా** - దిష్ట్యా పుత్రవిజయేన దంపతీ వర్ధేతే. (దేవీం విలోక్య)

చేసి, సంవత్సర కాలములో స్వేచ్ఛగా తిరిగి రావలసినదిగా యాగాశ్వమును విడిచితిని అది సింధునదికి దక్షిణతీరమున తిరుగుచు యవనుల అశ్వసేనచే నిరోధింపబడినది అంతట ఉభయసేనలకు గొప్పయుద్ధము జరిగెను అని తెలిసి కొందురుగాక

(ధారిణీదేవి విషాదమును ప్రకటించును )

**రాజు** ఏమీ, ఇట్లు జరిగినదా?

(మిగిలిన దానిని మరల చదువును )

అంతట శత్రువులను ఓడించి, ధనుర్ధరుడైన వసుమిత్రుడు
బలాత్కారముగా హరింపబడిన ఆ యాగపు అశ్వరాజమును
మరలించెను **15**

**ధారిణి** ఈ వార్తచే నా హృదయము ఊరడిల్లినది

**రాజు** (మిగిలిన లేఖను చదువును) కావున అంశుమంతునిచే మరలించుకొని రాబడిన గుఱ్ఱముతో సగరునివలె, నా పౌత్రునిచే కొనిరాబడిన అశ్వముకలవాడనైన నేను, యజ్ఞము చేయు చున్నాను కనుక ఇప్పుడు ఆలస్యముచేయక, చిత్తమున రోషమును మాని, వధూజన సహితముగా నీవు యజ్ఞ సందర్శనార్థము రావలెను" అని

**రాజు** అనుగ్రహింపబడితిని

**పరివ్రాజిక** అదృష్టవశమున పుత్రవిజయముచే దంపతులు వర్థిల్లు చున్నారు (దేవిని తిలకించి)

**శ్లో** **భర్తాసి వీరపత్నీనాం శ్లాఘ్యానాం స్థాపితా ధురి।**
**వీరసూ రితి శబ్దో ఽ యం తనయా త్త్వా ముపస్థితః॥ 16**

**ధారిణీ** భగవతి! పరితుష్టాస్మి య త్పితర మనుగతో వత్సః

**పరివ్రాజికా** నను కలభేన యూథపతే రనుకృతమ్

**కంఞ్చుకీ** **శ్లో. నైతావతా వీరవిజృంభితేన**
**చిత్తస్య నో విస్మయ మాదధాతి।**
**యస్యా ప్రధృష్యః ప్రభవ స్త్వ ముచ్చైః**
**అగ్నే రపాం దగ్ధు రివోరుజన్మా॥** 17

**రాజా** మౌద్గల్య! యజ్ఞసేనస్యాల మురరీకృత్య ముచ్యతాం సర్వే బంధనస్థాః

**కఞ్చుకీ** య దాజ్ఞాపయతి దేవః

(ఇతి నిష్క్రాన్తః)

**ధారిణీ** జయసేనే! గచ్ఛ ఇరావతీప్రముఖానా మంతః పురాణాం పుత్రకస్య విజయవృత్తాంతం నివేదయ

నీ భర్తచేత నీవు పొగడదగిన వీరపత్నులందరిలో అగ్రస్థానమున నిలుపబడినావు నీ తనయునివలన వీరమాత అన్న ఈ బిరుదము ఇప్పుడు నిన్ను చేరినది 16

**ధారిణి** భగవతీ! నా పుత్రుడు తండ్రిని పోలినందుకు సంతుష్ట నైతిని

**పరివ్రాజిక** గున్నఏనుగు, గుంపుదొరను అనుకరించినది సుమా.

**కంచుకి** సముద్రజలమును దహించునట్టి బడబాగ్నికి ఔర్వుడువలె ఏ వసుమిత్రునికి, దుర్జయుడవైన నీవు, ఉన్నత జన్మకు కారణమో, ఆ రాజకుమారుడు (ఈ నాటి దిగ్విజయములో) వీరవిజృంభణము చేయుటచేత మా మనస్సులకు ఆశ్చర్యమును కలిగించుట లేదు (వసుమిత్రుని ప్రతాపము ముందు శత్రుసైన్యము తృణప్రాయము అయిపోయినది ఈ శత్రుజయము అను గొప్పతనమునకు కారణము తండ్రియగు అగ్నిమిత్రుడే! కనుక, అతని పుత్రుడైన వసుమిత్రుడు శత్రువులను చంపినాడనుటలో ఆశ్చర్యము లేదు అని ఇచ్చటి భావము) 17

**రాజు** మౌద్గల్యుడా! యజ్ఞసేనుని మరిదితోకలిపి, బందీల నందరను విడిపింపవలెను

**కంచుకి -** ఏలినవారు ఆజ్ఞాపించినట్లే

(అని నిష్క్రమించును )

**ధారిణి -** జయసేనా! ఇరావతి మొదలగు అంతఃపుర ప్రముఖులకు, పుత్రుని విజయవృత్తాంతమును నివేదింపుము పొమ్ము

**ప్రతీహారీ** తధా (ఇతి ప్రస్థితా)

**ధారిణీ** ఏహి తావత్

**ప్రతీహారీ** (ప్రతినివృత్య) ఇయ మస్మి

**దారిణీ** (జనాన్తికం) య న్మయా అశోకదోహదనియోగే మాలవికాయై ప్రతిజ్ఞాతం తత్, తస్యా అభిజనం చ నివేద్య, మమ వచనేన ఇరావతీ మనునయ "త్వయాహం సత్యా న్న పరిభ్రంశయితవ్యా" ఇతి.

**ప్రతీహారీ** య ద్దేవ్యాజ్ఞాపయతి (ఇతి నిష్క్రమ్య, పునః ప్రవిశ్య) భట్టిని! పుత్రవిజయ నిమిత్తేన పరితోషే ణాంతః పురాణాం ఆభరణానాం మంజూషాస్మి సంవృత్తా

**దారిణీ** కి మత్రాశ్చర్యమ్ సాధారణః ఖలు తాసాం మమ చాయ మభ్యుదయః.

**ప్రతీహారీ** (జనాన్తికం) భట్టిని!

ఇరావతీ విజ్ఞాపయతి "సదృశం ఖలు దేవ్యాః ప్రభవంత్యా స్తవ వచనమ్, ప్రధమసంకల్పితం న యుజ్యతే అన్యధాకర్తుమ్" ఇతి.

**ధారిణీ** భగవతి! త్వయానుజ్ఞాతా ఇచ్ఛా మ్యార్య సుమతినా ప్రధమం సంకల్పితాం ఆర్యపుత్రస్య మాలవికాం ప్రతిపాదయితుమ్

**ప్రతీహారి** అట్లే (అని బయలుదేరును)

**ధారిణి** ఇదుగో, కొంచెము ఇటు రమ్ము

**ప్రతీహారి** - (వెనుకకు మరలి) ఇదుగో వచ్చితిని

**ధారిణి** · (జనాంతికముగా) అశోకవృక్షమునకు దోహదము చేయుమని నియోగించునప్పుడు, నేను మాళవికకు చేసిన వాగ్దానమును, ఆమె, అభిజాత్యమును నివేదించి, నీవు నా మాటగా ఇరావతిని, "నన్ను నీవు సత్యము నుండి తొలగునట్లు చేయరాదు", అని ప్రార్థింపుము

**ప్రతీహారి** - దేవిగారు, ఆజ్ఞాపించినట్లే (అని నిష్క్రమించి, మరల ప్రవేశించి) భట్టినీ! పుత్రవిజయుముమువలన కల్గిన సంతోషముచేత నేను రాణివాసమువారి ఆభరణములకు మంజూషను (పెట్టెను) అయినాను.

**ధారిణి** • ఇందు ఆశ్చర్య మే మున్నది? ఈకుమారుని అభ్యుదయము వారికిని, నాకును, సమానమేకదా!

**ప్రతీహారి** - (జనాంతికముగా) భట్టినీ!

ఇరావతి ఇట్లు విన్నవించుచున్నది "దేవియును, సమర్థురాలవును అయిన నీకు ఈ మాట తగియే యున్నది కదా! తొలుత సంకల్పించిన దానిని అన్యథాకరించుట (వేరుగా చేయుట) యుక్తము కాదు" అని.

**ధారిణి** ·- భగవతీ! నీ అనుమతినిగొని,ఆర్యసుమతిచే ముందే సంకల్పింప బడినట్లు మాలవికను ఆర్యపుత్రునకు సమర్పింప గోరుచున్నాను

**పరివ్రాజికా** - ఇదానీ మపి త్వ మే వాస్యాః ప్రభవసి.

**ధారిణీ** - (మాలవికాం హస్తే గృహీత్వా) ఇమా మార్యపుత్రః ప్రియ నివేదనానురూపం పారితోషికం ప్రతీచ్ఛతు.

(రాజా సవ్రీడం జోష మాస్తే.)

**ధారిణీ** - (సస్మితం) కి మవధీరయతి మా మార్యపుత్రః?

**విదూషకః** - భవతి! అస్తి ఖలు లోకప్రవాదః సర్వో ఽపి నవ్యో వరో లజ్జాతురో భవతి ఇతి.

(రాజా విదూషక మవేక్షతే.)

**విదూషకః** - అథవా దేవ్యా ఏవ కృతప్రణయవిశేషాం దత్త దేవీసంజ్ఞాం మాలవికాం అత్రభవాన్ ప్రతిగ్రహీతు మిచ్ఛతి.

**ధారిణీ** - ఏతస్యా రాజదారికాయా అభిజనేనైవ దత్తో దేవీశబ్దః. కిం పునరుక్తేన?

**పరివ్రాజికా** - మా మైవమ్.

**శ్లో** - **అప్యాకరసముత్పన్నా మణిజాతి రసంస్కృతా।**
**జాతరూపేణ కల్యాణి! న హి సంయోగ మర్హతి॥ 18**

**పరివ్రాజిక** ఇప్పుడుకూడ నీవే ఈమెకు (మాళవికకు) అధికారిణివి

**దారిణి** (మాళవికను చేతితో పట్టుకుని) ప్రియంవార్తను అందించినందుకు తగిన పారితోషికముగా, ఆర్యపుత్రుడు ఈమెను స్వీకరింపవలెను

(రాజు సిగ్గుతో ఊరకుండును )

**ధారిణి** (చిరునవ్వుతో) ఆర్యపుత్రుడు ఇక నన్ను నిర్లక్ష్యము చేయునా ఏమి?

**విదూషకుడు** దేవీ! "నూత్నవరుడు ప్రతివాడును లజ్జాపీడితుడగును అను లోకప్రవాదము ఉన్నదే కదా!

(రాజు విదూషకుని వంకకు చూచును )

**విదూషకుడు** అట్లుకానిచో, దేవిచేతనే ఎక్కువ ప్రేమతో దేవీపదము ఇవ్వబడిన ఈ మాలవికను ప్రభువు ప్రతిగ్రహింపగోరుచున్నాడు

**ధారిణి** ఈ రాజకుమారికి పుట్టుక చేతనే దెవీశబ్దము ఒసంగ బడినది పునరుక్తి ఎందుకు?

**పరివ్రాజిక** అట్లనరాదు

ఓ కల్యాణీ! సముద్రమున పుట్టినదైనను, గనిలోపుట్టినదైనను జాతిరత్నము సంస్కరణమును పొందనిదే సువర్ణముతోడి సంయోగమునకు అర్హము కాదుకదా!

**దారిణీ** మర్షయతు భగవతీ అభ్యుదయకథయా ప్రథమం ఉచితం న లక్షితమ్ జయసేనే! గచ్ఛ తావత్ కౌశేయ పత్రోర్ణయుగల ముపనయ

**ప్రతీహారీ** య ద్భట్టి న్యాజ్ఞాపయతి (ఇతి నిష్క్రమ్య పత్రోర్ణం గృహీత్వా ప్రవిశ్య) దేవి! ఏతత్

**దారిణీ** (మాలవికా మవగుంఠనవతీం కృత్వా ) ఇదానీ మిమా మార్యపుత్రః ప్రతీచ్ఛతు

**రాజా** త్వ చ్ఛాసనా దప్రత్యుత్తరా వయమ్

**పరివ్రాజికా** హంత ప్రతిగృహీతా.

**విదూషకః** అహో! దేవ్యా అనుకూలతా

(దేవీ పరిజన మవలోకయతి )

**పరివ్రాజికా** (మాలవికా ముపేత్య) జయతు జయతు భట్టినీ

(ధారిణీ పరివ్రాజికాం నిర్వర్ణయతి )

**పరివ్రాజికా** దేవి! నైతచ్చిత్రం త్వయి తథాహి

**శ్లో** **ప్రతిపక్షేణాపి పతిం సేవంతే భర్తృవత్సలా సాధ్వ్యః।**
**అన్యసరితాం శతాని హి సముద్రగాః ప్రాపయం త్యుదధిమ్॥19**

**ధారిణి** భగవతి మన్నింపవలెను అభ్యుదయవృత్తములో పడి ముందుగా ఔచిత్యమును గమనింపనైతిని జయసేనా! కొంచెముపెళ్లి, పట్టువస్త్రముల జతను తెమ్ము

**ప్రతీహారి** - భట్టిని ఆజ్ఞాపించినట్లే (అని నిష్క్రమించి, పట్టువస్త్రముల జతను తీసికొని, ప్రవేశించి) దేవీ! ఇవిగో

**ధారిణి** - మాళవికను అవగుంఠనవతిని (మేలిముసుగు వేసుకున్న దానిని) చేసి, ఇప్పుడు ఆర్యపుత్రుడు ఈమెను పరిగ్రహించుగాక

**రాజు** నీ శాసనమువలన మేము నిరుత్తరుల మైనాము

**పరివ్రాజక** ఆహా! పరిగ్రహింపబడినది

**విదూషకుడు** ఆహా! దేవి అనుకూలత (ఎంత గొప్పది?)

(దేవి పరిజనమువంక చూచును )

**పరివ్రాజిక** (మాళవికను సమీపించి) భట్టినికి జయము జయము

(ధారిణి పరివ్రాజక వంక చూచును )

**పరివ్రాజిక** దేవీ! ఈ ప్రవర్తన నీ యందు వింతకాదు అట్లే కదా!

భర్తయందు ఇష్టముకల సాధ్వీమణులు, సవతిని అందించుటచేత కూడ తమభర్తను సేవింతురు. సముద్రములో కలియుటకు ఆ దిశగా ప్రయాణము చేయుచున్న మహానదులు వందలకొలది ఇతర ప్రవాహములను కూడ తమతోపాటుగా సముద్రమునకే చేర్చును కదా! 19

**నిపుణికా** - (ప్రవిశ్య) జయతు. జయతు. భర్తా. ఇరావతీ విజ్ఞాపయతి - "య దుపచారాతిక్రమేణ తదా హం భర్త్రే అపరాద్ధా, త త్స్వయమేవ భర్తు రనుకూలంనామ మయా చరితమ్. సాంప్రతం పూర్ణమనోరథేన భర్త్రా అహం సంప్రసాదమాత్రేణ సంభావయితవ్యా" ఇతి.

**ధారిణీ** - నిపుణికే! అవశ్యం రోషం హాస్య త్యార్యపుత్రః.

**నిపుణికా** - య ద్దే వ్యాజ్ఞాపయతి.

(ఇతి నిష్క్రాన్తా.)

**పరివ్రాజికా** - దేవః అహం అమునా భవత్సంబంధేన చరితార్థం మాధవసేనం సభాజయితు మిచ్ఛామి, యది మే తవ ప్రసాదః.

**ధారిణీ** - భగవతి! న యుక్త మస్మా న్పరిత్యక్తుమ్.

**రాజా** - భగవతి! మదీయేషు లేఖేషు తత్రభవతే త్వా ముద్దిశ్య సభాజనాక్షరాణి పాతయిష్యామి.

**పరివ్రాజికా** - యువయోః స్నేహేన పరవా నయం జనః.

**ధారిణీ** - ఆజ్ఞాపయ త్వార్యపుత్రః కిం భూయో ఽపి ప్రియం అనుతిష్ఠామి?

**రాజా** - కి మతఃపర మపి ప్రియ మస్తి? తథాపి భవ త్వేవం తావత్.

**నిపుణిక :-** (ప్రవేశించి) ప్రభువునకు జయము. జయము. ఇరావతి ఇట్లు విన్నవించుచున్నది. "ఉపచారమును అతిక్రమించుటచేత ప్రభువుపట్ల అపరాధమును చేసినందువలన నేను స్వయముగా ప్రభువునకు ఉపకారమును ఇప్పుడు చేసినదాననైతిని. ఇప్పుడు కోర్కె నెరవేరిన ప్రభువు. తన అనుగ్రహముతో నన్ను ఆదరింపవలెను" అని.

**ధారిణి :-** నిపుణికా! ఆర్యపుత్రుడు తప్పక, దోషమును వీడగలడు.

**నిపుణిక :-** దేవి ఆనతిచ్చినట్లే.

(అని వెడలిపోవును.)

**పరివ్రాజిక :-** దేవా! నన్ను తాము మన్నించినచో తమతోడి ఈ సంబంధముచే చరితార్థుడైన మాధవసేనుని అభినందించుటకు పోగోరు చున్నాను.

**ధారిణి :-** భగవతీ! మమ్ము విడచిపోవుట నీకు తగదు.

**రాజు :-** భగవతీ! నేను వ్రాయు లేఖలో నీ విషయమును తెలియపరచు వాక్యములను ఆయనకు వ్రాయించెదను.

**పరివ్రాజిక :-** మీ ఉభయుల ప్రేమచే నేను అస్వతంత్ర నైనాను.

**ధారిణి :-** ఇంకనూ ఏమి ప్రియమును నేను అనుష్ఠింతునో ఆర్యపుత్రుడు అజ్ఞాపింపవలెను.

**రాజు :-** ఇంతకంటెను ఇంకొక ప్రియమైనది యుండునా? అయినను ఇట్లగుగాక!

శ్లో త్వం మే ప్రసాదసుముఖీ భవ దేవి! నిత్యం
ఏతావదేవ వరయే ప్రతిపక్షహేతోః।
ఆశాస్య మీతివిగమప్రభృతి ప్రజానాం
సంపత్స్యతే న ఖలు గోప్తరి నాగ్నిమిత్రే॥ 20

(ఇతి నిష్క్రాంతాః సర్వే )

ఇతి మహాకవి శ్రీకాళిదాస విరచితే మాలవికాగ్నిమిత్రమ్
నామ సంస్కృతనాటకే పంచమో ఽఙ్కః
సమాప్త మిదం నాటకమ్



సిద్ధుడు మాలవికను దీవించుట

దేవీ! నీవు నాకు ఎల్లప్పుడును ప్రసాదసుముఖివై యుండుము ప్రతిపక్షము కొరకై నేను ఇంత మాత్రమే కోరుదును అగ్నిమిత్రుడు పాలకుడై ఉండగా ఈతిబాధానివృత్తి ప్రజలకు కోరదగినది కాదుకదా! (అగ్నిమిత్రుని రాజ్యమునందు అతని పరాక్రమముచేతనే ఈతిబాధలు భయపడి అతని రాజ్యములోనికి ప్రవేశింపవు (కనుక ఆ కోర్కెను కోరనక్కరలేదని ఇచ్చటి భావము ) **20**

(అని అందరు నిష్క్రమింతురు )

**ఇది మహాకవి శ్రీకాళిదాసు రచించిన "మాళవికాగ్ని మిత్రమ్" అను సంస్కృతనాటకమునందలి ఐదవ అంకమునకు "ప్రవచనప్రభాకర ఉపన్యాసకేసరి భాగవతరత్న" బిరుదాంకితుడైన బ్రహ్మశ్రీ గోళ్ళమూడి. వెంకట శ్రీహరి సుబ్రహ్మణ్యశర్మ వెలయించిన ఆంధ్రానువాదము.**

**ఈ నాటకము సంపూర్ణమైనది.**



అగ్నిమిత్రుడు రాజాస్థానమునందు



మాలవికాగ్నిమిత్రుల వివాహము



మాళవిక అగ్నిమిత్రుల సమాగమము

# మాళవికాగ్నిమిత్రం నాటకమందలి సుభాషితములు

## ప్రథమాంకము

1 పురాణ మిత్యేవ న సాధు సర్వమ్
న చాపి కావ్యం నవ మిత్యవద్యమ్ ।
సంతః పరీ క్ష్యాన్యతర ద్భజంతే
మూఢః పరప్రత్యయనేయబుద్ధిః ॥

2 ఆకృతివిశేషేషు ఆదరః పదం కరోతి

3 సర్వస్యాపి కులవిద్యా బహుమతా

4 నాట్యం భిన్నరుచే ర్జనస్య బహుధా ప్యేకం సమారాధనమ్

5 పాత్రవిశేషే న్యస్తం గుణాంతరం వ్రజతి శిల్ప మాధాతుః ।
జలమివ సముద్రశుక్తౌ ముక్తాఫలతాం పయోదస్య ॥

6 అచిరాధిష్ఠితరాజ్యః శత్రుః ప్రకృతి ష్వరూఢమూలత్వాత్ ।
నవ సంరోపణశిథిలః తరురివ సుకరః సముద్ధర్తుమ్ ॥

7 అర్థం సప్రతిబంధం ప్రభు రధిగంతుం సహాయవానేవ ।
దృశ్యం తమసి న పశ్యతి దీపేన వినా సచక్షురపి ॥

8 అహో! దురాసదో రాజమహిమా

9 అతిమాత్ర భాసురత్వం పుష్యతి భానోః పరిగ్రహా దనలః ।
అధిగచ్ఛతి మహిమానం చంద్రో ఽపి నిశా పరిగృహీత ॥

10 పత్తనే సతి గ్రామే రత్న పరీక్షా?

11 ప్రయోగప్రధానం హి నాట్యశాస్త్రమ్

12 అన్యోన్య కలహితయోః మత్తహస్తినోః ఏకతరస్మి
న్ననిర్జితే కుతః ఉపశమః?

13 శిష్టా క్రియా కస్యచి దాత్మసంస్థా
సంక్రాంతి రన్యస్య విశేషయుక్తా।
యస్యోభయం సాధు స శిక్షకాణాం
ధురి ప్రతిష్ఠాపయితవ్య ఏవ ॥

14 వినేతు రద్రవ్యపరిగ్రహో ఽపి బుద్ధిలాఘవం ప్రకాశయతి

15 యస్యాగమః కేవల జీవికాయై
తం జ్ఞానపణ్యం వణిజం వదన్తి

16 అపరినిష్ఠితస్య ఉపదేశస్య అన్యాయ్యం ప్రదర్శనమ్

17 సర్వజ్ఞస్యా ప్యేకాకినో నిర్ణయాభ్యుగమో దోషాయ

18 ప్రభవంత్యో ఽపి హి భర్తృషు కారణకోపాః కుటుంబిన్యః.-

19 న ఖలు సుశిక్షితో ఽపి సర్వః ఉపదేశదర్శనే నిష్ణాతో భవతి

20 ప్రభవత్యాచార్యః శిష్యజనస్య

21 ప్రాయః సమానవిద్యాః పరస్పరయశఃపురోభాగాః

## ద్వితీయాంకము

1 ఉపస్థితం నయనమధు సన్నిహితమక్షికం చ.

2 మందో ఽప్యమందతా మేతి సంసర్గేణ విపశ్చితః।
పంకచ్ఛిదః ఫలస్యేవ నికషే ణావిలం పయః॥

3 ఉపదేశం విదు శ్శుద్ధం సంత స్త ముపదేశినః ।
శ్యామాయతే న విద్వత్సు యః కాంచన మివాగ్నిషు ॥

4 పండితపరితోషప్రత్యయా నను మూఢాజాతిః

5 త్వం దరిద్ర ఆతుర ఇవ వైద్యే నోపనీయమాన మౌషధ మిచ్ఛసి

6 ఉచితవేలాతిక్రమాత్ చికిత్సకాః దోష ముదాహరన్తి

7 దృఢం విపణికందు రివ మే ఉదరాభ్యన్తరం దహ్యతే

8 మేఘావలీ నిరుద్ధజ్యోత్స్నేవ పరాధీనదర్శనా

9 భవానపి సూనోపరిచరో గృధ్ర ఇవ అమిషలోలుపో, భీరుకశ్చ

## తృతీయాంకము

1 నాగరక్షితో మణిరివ న సుఖం సమాసాదయితవ్యా

2 మృదుతీక్ష్ణతరం య దుచ్యతే
త దిదం మన్మధ దృశ్యతే త్వయి ॥

3 నిసర్గనిపుణాః స్త్రియః

4 ఉచితః ప్రణయో వరం విహంన్తుం
బహవః ఖండన హేతవో హి దృష్టాః ।
ఉపచారవిధి ర్మనస్వినీనాం
న తు పూర్వాభ్యధికోఽపి భావశూన్యః ॥

5 ఇయం ఖలు సీధుపానోద్వేజితస్య మత్స్యండి కోపనతా

6 న హి కమలినీం దృష్ట్వా గ్రాహ మవేక్షతే మతంగజః

7 తత్త్వావబోధైకఫలో న తర్కః

8 మదః కిల స్త్రీజనస్య విశేషమండనమ్

9 చూతాంకురం విచిన్వత్యో రావయోః పిపీలికాభి ర్దష్టమ్

10 అనురాగో ఽ అనురాగేణ పరీక్షితవ్యః

11 భ్రమర సంబాధో భవిష్యతీతి వసంతావతారసర్వస్వం
కిం న చూతప్రసవో అవతంసయితవ్యః?

12 స్థానే ప్రాణాః కామినాం దూత్యధీనాః

13 నిర్వికారస్యాపి ఉత్సుకతాజనకః ఉపదేశః

14 అహో అవిశ్వసనీయాః పురుషాః

15 కర్మగృహీతేన కుంభీలకేన సంధిచ్ఛేదనే శిక్షితో ఽ
స్మీతి వక్తవ్యం భవతి

16 న శోభతే ప్రణయిజన నిరపేక్షతా

## చతుర్థాంకము

1 న హి బుద్ధి గుణేనైవ సుహృదా మర్థదర్శమ్ ।
కార్య సిద్ధిపథః సూక్ష్మః స్నేహేనా ప్యుపలభ్యతే ॥

2 కుంభీలకైః కాముకైశ్చ పరిహరణీయా చంద్రికా

3 నిసర్గశాలీనః స్త్రీజనః

4 రమణీయః ఖలు నవాంగనానాం మదనవిషయావతారః

5 విపణిగతో వృషభ ఇవ విస్రబ్ధః ఆసీన ఏవ నిద్రాయతే

6 కిం ను ఖలు దర్దురా వ్యాహరంతీతి పృధివ్యాం దేవో
వర్షితుం విరమతి?

7 అపర్వణి గ్రహ కలుషేందుమండలా
విభావరీ కధయ కధం భవిష్యతి?

8 నార్హతి కృతాపరాధో ఽ
ప్యృత్సవదివసేషు పరిజనో దండమ్

9 బంధనభ్రష్టో గృహకపోతకో బిడాలికాయాః ఆలోకే పతితః

10 కాతరో బాలభావః

## పంచమాంకము

1 కష్టః ఖలు సన్నిధివిప్రయోగః

2 ఆగామి సుఖం వా దుఃఖం వా హృదయసమస్థా కధయతి

3 చందనం ఖలు మయా పాదుకాపదేశేన దూషితమ్

4 అహోః పరిభవోపహారిణః వినిపాతాః

5 నను కలభేన యూధపతే రనుకృతమ్

6 సర్వో ఽపి నవవరో లజ్జాతురో భవతి

7 అప్యాకరసముత్పన్నా మణిజాతి రసంస్కృతా ।
జాతరూపేణ కల్యాణి! నహి సంయోగ మర్హతి ।

8 ప్రతిపక్షేణాపి పతిం సేవంతే భర్తృవత్సలాః ।
అన్యసరితాం శతాని హి సముద్రగాః ప్రాపయం[illegible]ధమ్ ॥

# మాళవికాగ్నిమిత్రములోని

# అకారాదిశ్లోకానుక్రమణిక

# అభిప్రాయాలు...

బ్రహ్మశ్రీ జి.వి.యస్. సుబ్రహ్మణ్య శర్మగారు విద్వాంసులు. వారికి ప్రతిభ, వ్యుత్పత్తి, సహృదయత కలిగియుండుటచే కాళిదాస కృతులను అన్యూనానతిరిక్తంగా అనువదించడం సాధ్యమైనది. కాని కొన్ని విషయాలు మరొక భాషలో ఇమడవు. శ్లోక చతుష్టయంలో సామాన్య ప్రతిపత్తిపూర్వకం అనుమాటకు అన్ని అర్థాలతోటి అనువాదం చేయడం సాధ్యం కాదు. అయినా వారు రచనాకౌశల్యంచేత అనువాదం చక్కగా సాగింది. కాళిదాస కృతులన్నింటినీ వారీవిధంగానే అనువదించి లోకానికందించే ప్రయత్నం అవ్యాహతంగా సాగేలా శ్రీసీతారామచంద్రప్రభువు అనుగ్రహించుగాక! (పుట XIV)

'ప్రవచన శిరోమణి' ఉ.వే.ప్ర. **శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్య**, ఎం.ఏ.
విశ్రాంత సంస్కృతోపన్యాసకులు, షీలానగర్, విశాఖపట్టణం-12

మిత్రప్రోత్సాహంతో కాళిదాస కావ్యద్వయానికి శ్రీ జి.వి.ఎస్. సుబ్రహ్మణ్య శర్మగారు తెలుగు అనువాదాన్ని సంతరించి కృతకృత్యులయినారు. మహాన్మోదః- భాష సరళ గ్రాంధికం అయినా మధురంగాను, సుబోధంగాను ఉంది. పదగుంభనం బాగా అమరింది. సర్వమున్నూ మూలవిధేయంగానే సాగింది. దీన్ని నేను పుష్కలంగానే అనుభవించి ఆనందించేను. ఈ కృతి "వీరి కృతులన్నింటికిన్నీ మూర్ధాలంకృతియే అగుగాక! ఇతోధికంగా కృతులను కూర్చుటకు భగవానుడు వీరికి శక్తియుక్తులను ప్రసాదించుగాక" అని మంగళా శాసనమును అందిస్తున్నాను. (పుట XVI)

ఆచార్య **అప్పల్ల సోమేశ్వర శర్మ**, ఎం.ఏ., పి.ఓ.ఎల్.,
సీతమ్మధార, విశాఖపట్టణం - 13.

తెలుగులో అభిజ్ఞానశాకుంతలమ్ నాటకానికి ఇంతవరకు ఎన్నో అనువాదాలు వచ్చి ఒక్కొక్కటి ఒక్కొక్క విధంగా మూలనాటక సౌందర్యాన్ని చెడగొట్టాయి. ఇప్పుడు శ్రీ జి.వి.ఎస్. సుబ్రహ్మణ్య శర్మగారు తెలుగువచనంలోనికి అనువదించారు. ఈ గ్రంథానికున్న ప్రసిద్ధ సంస్కృత వ్యాఖ్యలపట్ల శ్రీ శర్మగారికి గల గౌరవం వారి తెలుగుసేతలో స్పష్టంగా కనిపిస్తుంది. వీరి అనువాద సారళ్యం ఎలా ఉందంటే తెలుగు అనువాదాన్ని శ్రద్ధగా చదివి, రెండవ సారి మూలాన్ని చదివితే దానంతటదే బోధపడుతుంది. బహుబాషలలో బహువిధాలుగా అనువదింపబడినప్పటికి వ్యాసుని హృదయం ఆవిష్కరింపబడలేదని బాధపడిన రాజరాజు నన్నయచేత భారతాన్ని సమీచీనంగా తెలుగులోనికి వ్రాయించినట్లు బ్రహ్మశ్రీ రాళ్ళభండి చంద్రశేఖర శాస్త్రి దంపతులు శ్రీ శర్మగారిచేత కాళిదాస కృతులను తెలుగులో వ్రాయించి ఒక గొప్ప యజ్ఞఫలం పొందారు. మేఘసందేశానువాదం ద్వారా తెలుగుభాషలోని మాధుర్యాన్ని ప్రవహింపజేసిన శ్రీ శర్మగారు అభినందనీయులు. (పుట XVII నుండి XX వరకు)

**డా॥ కాజ లక్ష్మీనరసింహారావు**, ఎం.ఏ., పి.హెచ్.డి., రీడర్,
తెలుగు-సంస్కృతశాఖాధిపతి, నోబుల్ కాలేజీ మచిలీపట్నం.



జి.వి.యస్. సుబ్రహ్మణ్య శర్మ, ఎం.ఏ.

## ఇతర రచనలు

1. శ్రీ సాయిరామమ్
2. శ్రీరామ శ్రీకృష్ణ - చారిత్రమంజరి
3. షడ్విధపూజావిధానము
4. శ్రీసరస్వతీరహస్యోపనిషత్తు
5. గాయత్రీవైభవము
6. గాయత్రి - 24 స్వరూపములు
7. A Notes on Shaddarshanas
8. శ్రీసత్యసాయిత్రికాలస్మరణ స్తోత్రము
9. శ్రీసత్యసాయిఅష్టోత్తరశత, సహస్రనామ స్తోత్రమ్
10. శ్రీదత్తభాగవతము (ముద్రణలో ఉన్నది)
11. అభిజ్ఞానశాకుంతలము, మేఘసందేశముల ఆంధ్రవచనానువాదము

Aparna Graphics, Hyd. Ph : 6631389